

'భామకలాపం': యామిని కృష్ణమూర్తి నృత్యం

# ఉత్తరాలు

## ముఖచిత్రం

వెండితెర వెలుగు కుమారి శాంతి ముఖ చిత్రంతో వున్న ఆంధ్ర సచిత్ర వారపత్రిక 10—4—64 సంచిక ఆయస్కాంతము వలె పాఠకులను ఆకర్షించి, ఆనంద పరచినది 'సిరి సిడలు' కథానిక నా హృదయానికి హత్తుకు పోయింది.

ఆట్లూరి శరత్‌బాబు (విజయవాడ)

## కథలు

రామలక్ష్మిగారు వ్రాసిన "మలుపులో పిలుపు" చాల బాగుంది పత్రిక ద్వారా మా అందరకు ఇద్దరు 'రామలక్ష్మి' అనే పేరుతో పరిచితులు, ఒకరు శ్రీమతి ఆరుద్రగారు. ఈ రామ లక్ష్మిగారు ఎవరండీ, ఎవరైనా సరే, కథ చాల బాగుంది, ఆమెకు పత్రిక ద్వారా నా ధన్యవాదాలు శ్రీకె సభాగారు వ్రాసిన 'దర్పణం' చాల బాగుంది 'సంపెంగ పొదలు'లో గిరి పాత్ర చాల బాగా రాణించింది

కుమారి ఏ విజయలక్ష్మి (హైదరాబాదు)

* * *

10—4—64 సంచికలోని "సిరి సిడలు" వ్రాసిన విహారి మరియు శాలివాహనలకు నా ధన్యవాదాలు ఈ కథకు జీవం పోసి, చక్కని భాషతో వక్కాణించారీ కవులు కథ చదువుతున్నంత సేపు నాలో ఆనందం, ఆత్రత పెంపొందింది ఇక ముందు ముందు ఇటువంటి కథలు పై రచయితలవి ప్రచురించగలరని, మా వంటి పాఠకులకు సంతోషం గలిగించ గలరని భావిస్తున్నాను.

కారువల్లి సుందరం (హోసూరు)

## సీరియల్ కథలు

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురిస్తున్న "సంపెంగ పొదలు" సీరియల్ కథ చాలా బాగున్నది. ముఖ్యముగా "గిరి" పాత్ర ఎంతో ఆకర్షణీయంగా ఉంది రచయిత్రి గారికి నా నమస్కృతులు. ఇటువంటి సీరియల్ కథలు ఎక్కువగా ప్రచురించాలని కోరుతున్నాము.

కోట రామకృష్ణ (బొబ్బిలి)

* * *

ఆంధ్ర పత్రిక, వీక్లీలో (10—4—64) "ఎండమావులు" సీరియల్‌లో స్వాతి అన్నమాటలు "నా మనస్సు మీదయినా, నేను మీ ఇల్లాలిని అయినా, ఎంత చదువుకున్నా యాపచెట్టుని మాయిడికాయలు కాస్తయ్యా చెప్పండి" ఈ వాక్యములో మాయిడి కాయలు అని వ్రాయటము చాల పొరపాటు హరిజనులలో కూలి చేసుకొనేవాళ్ళు కూడ "మామిడి కాయ" అని ఉపయోగిస్తారు గాని మాయిడి కాయ లని అనరు ప్రతి హరిజనుడు మాయిడికాయ అన్న దాన్ని చాల తీవ్రంగా తీసుకొంటాడు రచయిత గారు హరిజనులు ఉపయోగించే భాషతెలియకుండా వ్రాశారు. అంటె భాష ఉచ్చారణలో ఎన్ని తప్పు లుంటాయో అన్ని తప్పులు హరిజనులు ఉపయోగిస్తారని ఆయన భావించి ఉంటారు.

వీరాస్వామి (పూరి) ★





# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 24—4—'64

క్రోధినామ సం॥ నిజ చైత్ర మాస శుద్ధ త్రయో॥

సంపుటము 56 సంచిక : 34

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ 15 60. ఇతర దేశాలు సీమీద (Sea Mail) రూ. 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడిప్రతి 30 న.పై.

సంవత్సర చందా 15.60 న పై.

6 మాసాల చందా 7.80 న.పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1



"కాంగ్రెసుమీద కోపం మనమీద చూపిస్తున్నాడు...!!

## మనలో మాట

'ఆర్ఫియస్' ప్రస్తుతం కెనడాలోని ఓట్టవా యూనివర్సిటీలో న్యూక్లియర్ కెమిస్ట్రీశాస్త్రంలో పి. హెచ్.డికి కృషిచేస్తున్నారు. ఎం.ఎస్.సి భారతదేశంలో పూర్తిచేసి కొంతకాలం హైద్రాబాదు, పూనాలలో పనిచేశారు. వీరిది నెల్లూరు. పోయినవారం అందరికీ ఆనందం కలిగించే విషయం ఒకటి ఈ సంచికలో ఉంటుందని వ్రాశాము. అది ఏమిటో వేరే చెప్పనక్కర్లేదు.

*  *  *

'అసురసంధ్య' గొలుసు కథ రచయితలని పాఠకులకు పరిచయం చెయ్యటం అనవసరం !

*  *  *

ప్రపంచమంతటా షేక్స్పియర్ ఉత్సవాలు జరుగుతున్నాయి. పోయినవారం అతనికి సంబంధించిన వ్యాసం ఒకటి వేశాము. ఈ సంచికలోని శ్రీ సాలింగర్ వ్యాసం ఆంధ్ర సచిత్ర వారపత్రికకి ప్రత్యేకం. శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి గారి పేరు తెలుగు పాఠకలోకానికి సుపరిచితమే వీరు ఇంతక్రితమే ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఒక ఇంగ్లీష్ గ్రామర్ పుస్తకాన్ని సమీక్షించారు.

*  *  *

ఈ వారంలో సుశీల సత్యాన్ని పూర్తిగా గ్రహించినట్లు తోస్తుంది...

*  *  *

'ఎండమావులు', 'సంపెంగపొదలు' రెండూ పైవారంతో అయిపోతాయి. ఆ పైవారం, అంటే 8-5'-64 ఆంధ్ర సచిత్ర వార పత్రికలో శ్రీమతి ముప్పాళ్ల రంగనాయకమ్మ రచించిన 'కూలిన గోడలు' నవల మొదలవుతుంది. మరొక సీరియల్ కూడా త్వరలోనే ప్రారంభిస్తాము. ★

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: విజయ


విడుదల తర్వాత అబ్దుల్లా ప్రకటన


కావలెను
ఆంధ్రప్రదేశ్ కి ఇంకా మంత్రులు కావలెను అర్జీ దాఖలు చేసుకోవచ్చును


మావో తలలో ఏమి మెదుల్తోందని క్రుశ్చేవ్ సందేహం


కలుసుకున్నాం!
నీతులు చెప్పాం
ఒకరికష్టాలొకరు తెలుసుకున్నాం
దేశీయాంగ మంత్రుల సమావేశం
ఇక ఫలితాల కోసం ప్రార్థిద్దాం!

# అబ్దుల్లా విడుదల సమంజసమా?

షేక్ అబ్దుల్లా విడుదలకావటం జరిగిపోయింది. పార్లమెంటు సభ్యులు, ఎలాగయితేనేం, శాంతిస్తున్నట్లు లాబీవర్గాల కథనం. అసలు, శాంతించక చేయగలిగింది మాత్రం ఏముంది కనుక?

ఉన్నపళంగాచూస్తే, యీనాడు ఇండియాను పరిపాలిస్తున్నది, 'కాంగ్రెస్' అనే నియంతృత్వం. కాంగ్రెస్‌కు మరోపేరు జవహార్‌లాల్ నెహ్రూ, ఆయన పలికిందాని కల్లా "ఊ"కొట్టి చేతులెత్తేవాళ్లు పార్లమెంటులోనే ఐదువందలమంది వున్నారు.

ఇక పార్లమెంటు వెలుపల సరేసరి... లెక్కే లేదు. 'ఓ' అంటే 'న' రానివాళ్లు, ఒకవేళ ఆ "ఓ' 'న' మ" వచ్చినా, అసలు సంగతి పందర్భాలు తెలియని వాళ్లు, లక్షలు లక్షల మంది నెహ్రూగారి విధానాలకు జేజేలు పలుకుతున్నారు. ఇక్కడ మరో విషయం చెప్పాలి... పార్లమెంటరీ ప్రజాస్వామ్యం జన్మించిన దేశాల్లోనే, "ప్రయోజన వోటింగు" పద్ధతి రావటానికి శతాబ్దాలు పట్టింది. కాని ఇండియాలో మాత్రం... అడుగడుగునా నిరక్షరాస్యత తాండవిస్తున్నప్పటికీనీ, కులమత తత్వాలు వెర్రితలలు వేసివి కటాట్టహాసం చేస్తున్నప్పటికీనీ, మూఢనమ్మకాలు దేశమంతటా వేరులు తన్ను కొంటున్నప్పటికీ... ఈ దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యవిధానం ప్రారంభమైన తొలినాటినుంచీ "ప్రయోజన వోటింగు"! మలులో ఉంది. అబ్బ! ఏంరాజ్యం ఇది?

## పాత చరిత్ర

మరో విషయం వింటున్నాం. షేక్ అబ్దుల్లా నిర్బంధం పట్ల నెహ్రూ సుముఖులు కానేకారట. మొదట్లో అబ్దుల్లా అరెస్టు, నెహ్రూ అనుమతినే జరిగిందట. 1953లో అతన్ని అరెస్టు చేసిన అధికారి కీర్తిశేషులయిన రఫీ అహమ్మద్ కిద్వాయ్. బక్షీగులాం మహమ్మద్‌ను ఆ మధ్యకాలంలో ప్రధానిగా ఉంచాలని రఫీ సాహెబ్‌గారు అనుకొన్నారు జి. యం. సాదిక్ వైపు రఫీ సాహెబ్ సుముఖులనీ మరో వార్త. ఏ మయితేనేం, సాదిక్‌జీకి కమ్యూనిస్టులతో సంబంధాలున్నాయన్న వదంతులను ఆధారం చేసికొని, ఆ రోజుల్లో రఫీ సాహెబ్‌ను హెచ్చరిక చేయటం కూడా జరిగింది. ఆయనే ఈ నాడు బ్రతికి ఉంటే తిరిగి బక్షీగులాం మహమ్మద్ ప్రధాని స్థానంలో ఉండేవారేమో!

అంతటితో కథ ఆగలేదు. షేక్ అబ్దుల్లాను మరోమారు అరెస్టు చేసే వరకు కృష్ణమీనన్ నిద్రపోలేదట! నెహ్రూజీ ప్రక్కనే ఉండి మీనన్ ఏవేవో సాకులు చెప్పాడు. అందువల్లనే కాబోలు, నెహ్రూజీ అబ్దుల్లాను మళ్ళీ అరెస్టు చేయించారు.



శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి 26 వ పుణ్యావర్ధంతి : నిజ చైత్ర శుద్ధ ద్వాదశీ గురువారం 23-4-64న అయినది

అద్దాలమేడలో వుంటున్న పండిట్ నెహ్రూకు, తనవింత చర్యలనుచూచి ప్రజలు నవ్వుతున్నారని తెలియక పోవచ్చు కాని, అది వాస్తవమేగా! నిజం ఎప్పుడూ చేదుగానే వుండొచ్చు!

అబ్దుల్లాను నిర్బంధించినందుకు, కాశ్మీరు 'కుట్ర' కేసును నడిపినందుకు లక్షల రూపాయలు ఖర్చు అయ్యాయి. అబ్దుల్లాను నిర్బంధించటం, కుట్రకేసు నడిపించటం తప్పిదమేనని ఐదేళ్ళ తరువాత కాంగ్రెసు పెద్దలు బహిరంగంగానే ఒప్పేసుకున్నారు.

బక్షీగులాం మహమ్మదు గారి రాజకీయ శత్రువైన అబ్దుల్లాను పీడించటమే ఈ "కాశ్మీరు కేసు" రహస్యమనీ, నిర్బంధమంతా ఒక 'ఫార్సు' అనీ ఎవరైనా విమర్శిస్తే, విమర్శకులదేమీ తప్పు ఉండదు.

## కొత్త మిత్రులు

ఒకప్పుడు జైలునుంచి విడుదల అయిన అబ్దుల్లాకు రవాణా సౌకర్యమయినా ఏర్పరచని బక్షీసాహెబ్ గారే, యీనాడు ఆ అబ్దుల్లా శ్రీనగర్ రాగానే దండలు వేయటానికి "కుతూహల" పడుతున్నాడని వార్త.

దేశంలో మత కలహాలు కొనసాగుతున్న ప్రాంతాలను సందర్శించమని శ్రీ అబ్దుల్లాను కోరుతున్నట్లు వార్తలు వస్తున్నాయి. అవి నిజమో, లేక పరిహాసపు కథలో తెలియటం లేదు. 'పరిహాసం కాక మరేమిటి ?... అబ్దుల్లా మత కలహాలు జరిగిన ప్రాంతాలు సందర్శించమని కోరటంలో రెండు రకాల ఆంతర్యాలు ఉన్నాయి మొదటిది - సక్రమంగా ప్రవర్తించమని హిందువులకు చెప్పటం. రెండవది - మత కలహాలను అణచి వేయటంలో భారత ప్రభుత్వం విఫలమయి పోయిందని సూచించటం

ప్రస్తుతం, ఢిల్లీ మహానగరంలో ఏ నోట, విన్నా, అబ్దుల్లా మాటే వినిపిస్తున్నది. అసలు అబ్దుల్లా అరెస్టు చేయటం, వదిలి పెట్టటం,

28 వ పేజీ చూడండి

# షేక్స్పియర్ సమకాలికులు

ఎల్. జి. సాలింగర్



షేక్స్పియర్ సమాధివున్న నార్విక్ షైర్లోని ట్రినిటీ చర్చ్‌లో గల అతని విగ్రహం.

**ప్రతిభ ఎలా పని చేస్తుందనే విషయమై కొంత 'రహస్యం' ఉండి తీరుతుంది కాని ఒక ప్రతిభావంతుడు ఉన్నత శిఖరాలను సాధించాలంటే, మానసికాహారం ఇచ్చే వాతావరణం సహాయం పొందగలగాలి; ప్రోత్సాహం, పోటీ ఉండాలి. ఇంత అదృష్టమూ ఉన్నవాడు విలియం షేక్స్పియర్**—శాంతిని అనుభవిస్తున్న దేశంలో పెరిగాడు. ఈ శాంతి ఎంత ప్రమాద పరిస్థితిలో ఉన్నప్పటికీ, అతని కాలంలో ఇంగ్లండ్ తను ప్రపంచ వ్యవహారాలలో ప్రముఖ స్థానం వహిస్తున్న సంగతి తెలుసుకుంది, చురుకైన పరిపాలన, వ్యాపారుల నావికుల సాహసం, వీటి పుణ్యమా అని. షేక్స్పియర్ తన వృత్తి కొనసాగిస్తూ ఉన్న కాలంలో లండన్ యూరప్‌లో కెల్లా ఎక్కువ రద్దీగా ఉన్న రేవు.

అతని సమకాలికుల రచనలు చదివేవారు ఎన్నో రకాలవారు, దేశంలోని వివిధ వర్గాల ప్రతినిధులు, ఇంకా పాత సంప్రదాయాలకు లోనయిన ఆలోచనా విధానాలు కలవారు, కాని, రినైసాన్స్ కి సంబంధించిన కొత్త సంస్కృతిని గ్రహించటానికి కుతూహలంతో ఎదురు చూసే వారు. నాటక రంగాన్ని వదిలివేస్తే, షేక్స్పియర్ యుగంతో సమకాలీనమయినదే స్పెన్సర్ 'ఫెయిర్ రీక్వీన్' యుగం—ఈకావ్యాన్ని, ఇతిహాసం 'షివల్రిక్ రొమాన్స్', నీతి కథ, ఎలాగైనా వర్ణించవచ్చు. తన ప్రణయ గీతాలతో, భక్తి అనే అనుభూతిని వస్తువుగా తీసుకున్న పద్యాలతో ఆత్మానుశీలనాన్ని వాస్తవికంగానూ క్షుణ్ణంగానూ నవర్పించ గలిగిన డాన్ యుగంకూడా ఇదే 17వ శతాబ్దంలో విజ్ఞాన శాస్త్రానికి బాహ్య దృష్టి కల్పించటానికి ముఖ్య కారకుడైన బేకన్ యుగమూ ఇదే.

**ఈ వ్యాసరచయిత కేంబ్రిడ్జ్ యూనివర్సిటీ (ట్రినిటీ కాలేజి)లో లెక్చరర్.**

## సాంస్కృతిక కేంద్రం

కాని షేక్స్పియర్ కాలంలో జాతీయ సాంస్కృతిక కేంద్రాలు లండన్ థియేటర్లే. షేక్స్పియర్‌కి రచయిత గానూ, నటుడుగానూ వీటితో సంబంధం ఉండేది. ఇంగ్లండ్ యొక్క భావనా శక్తిని ఇంత సంపూర్ణంగా ఈ కాలంలో చెప్పినట్లు నాటక రంగం అంతకు ముందూ తర్వాతా ఎప్పుడూ చెప్పలేదు. పండితులూ, పామరులూ; ఆస్థాన సభ్యుడూ, వర్తకుడూ, వేడుకలు చూసేవారూ, జేబు దొంగలూ, వీరందరినీ ఆకర్షించేవి థియేటర్లు.

ఎప్పుడూ కొత్తదనం కోసం ప్రయత్నించే నాటక రచయితలు, జాతీయ సంప్రదాయాలతో విదేశ సంప్రదాయాలను సమ్మిళనం చేసేవారు—కథనంలో కానీయండి, నాటకం జరిగే విధానంలో **కానీయండి, వికటంలో . కానీయండి, చరిత్ర, సాహిత్యం, జానపద— సారస్వతంలో కానీయండి.**

నాటకాలు వెయ్యటం ఇంగ్లండ్‌లో ఒక ప్రాచీన వ్యాసంగం, కాని అప్పటికి ఒక కొత్త వృత్తి. 1576లో మొదటి థియేటర్ (నాట్యశాల ?—అ॥) కట్టడం పైకి లేచింది. (అప్పటికి షేక్స్పియర్ పన్నెండేళ్ల బడిపిల్లవాడు.) 1580లో విశ్వవిద్యాలయాల నుంచి కొత్త రచయితలు లండన్‌కి తరలి వచ్చారు, అక్కడ డ్రామా 'కంపెనీ'ల అవసరాలను తీర్చటానికి. (స్పెయిన్ లోనూ ఇటువంటి పరిణామాలే ఏర్పడుతున్నాయి కాని 'లేట్ రినైసాన్స్'కి సంబంధించిన రెండు నాటక సంప్రదాయాలూ ఇంగ్లీష్, స్పానిష్‌వి— వేరు వేరుగా పెరిగాయి. ఈ అభివృద్ధి అంతా షేక్స్పియర్ కోసం జరిగినట్లే వూహించవచ్చు. అతను 1580లో లండన్‌కి వెళ్ళేసరికి ఆధునిక 'పద్య— నాటకం' యొక్క పరిస్థితి బాగానే ఉన్నప్పటికీ, ఇంకా పరిశోధన, నవీనత వాటిని వదలలేదు.

షేక్స్పియర్ తన ముందువారివద్దనుంచి చాలా నేర్చుకున్నాడు. మాటలలో చాతుర్యంచూపే జాన్ లైలీ నాటకాల నుంచి కొన్ని పరిగ్రహించాడు, (లైలీ నాటకాలు ఆస్థానాలలో వేస్తూ ఉండేవారు), థామస్ కిడ్‌నీ, రాబర్ట్ గ్రీన్‌నీ 'రొమాంటిక్ కామెడీ'ల విషయంలోనూ, భీభత్సమైన ట్రాజడీల విషయంలోనూ అనుసరించాడు. (వీరిద్దరూ ప్రజాబాహుళ్యం వినోదం కోసం వ్రాసేవారు). అన్నిటికన్నా ముఖ్యం, అతని సమకాలీనుడైన, క్రిస్టఫర్ మార్లో (1564—93) ప్రభావం అతని మీద చాలా ఉంది మార్లో ప్రవేశ పెట్టిన కొత్తరకం నాయకుడు, వాగ్ధోరణి, ప్రజలని ఆశ్చర్య పడేట్లు చేశాయి. 'మార్లోస్ మైటీ లైన్' ధాటి ఇంతా అంతా కాదు. అతను 'బ్లాంక్ వెర్స్'ని విరివిగా వాడి, దానికి కొత్త నినాదం, సంకల్పం కల్పించాడు.

అతని నాయకులు విపరీతమైన ఆకాంక్ష కలవారు, నీతి నియమాల కోసం, సంప్రదాయాల కోసం లెక్కచేసే వారు కాదు టాంబర్లైన్ ఒక స్కైథియన్ (శాక) గొల్లవాడు, ఆసియా అంతనీ జయించినట్లు చూపాడు మార్లో. 'ది జ్యూ ఆఫ్ మాల్టా'లోని బారబాస్ మధ్యధరా సముద్రం ప్రాంతాలన్నిటి మీదా ఆధిపత్యం వహిస్తున్నట్లు కనిపిస్తాడు. "ఇన్‌ఫినిట్ రిచెస్ ఇన్ ఎ లిటల్ రూమ్" సేకరిస్తాడు.

ఈ నాయకుల పరిమాణాలు సాధారణ మానవుల పరిమాణాల కన్నా చాలా పెద్దవిగా ఉంటాయి. కాని చురుకు బుద్ధి కల మార్లో వీటిలోని అవాస్తవికత గమనించక పోలేదు "ఎడ్వర్డ్"లో కొత్త పద్ధతి అవలంబించి చూశాడు "డాక్టర్ ఫాస్టస్"లో, పైకి రావాలనుకున్న ఐంద్రికుడి పతనం చూపించాడు. "డాక్టర్ ఫాస్టస్"ని గోతె చాలా మెచ్చుకున్నాడు ఇది చాలా వరకు ఒక మధ్య యుగపు (మెడివల్) నాటకమే కాని ఆధునిక విషాదాంత నాటకాలలో మొదటిది—అంటే, కథానాయకుడి మనసులోని గాఢ కల్లోలం మనం కూడా అనుభవిస్తున్నామనే భావం కలుగ చెయ్యగల నాటకాలలో మొదటిది అన్నమాట.

షేక్స్పియర్ మార్లోని నమూనాగా వాడుకో లేదు మార్లో షేక్స్పియర్‌ని ఉత్తేజ పరచ గలిగాడు, అంతే. సామాన్య మానవుల విషయమై షేక్స్పియర్‌కి ఉన్న సానుభూతి మార్లోకిలేదు. **ప్రతి వ్యక్తికీ తోటివారితో ఏదో సంబంధం**

ఉందనే చైతన్యం షేక్స్పియర్‌కి ఎక్కువ. మార్లో "ఎడ్వర్డ్ 2", ఒక రాజుయొక్క వ్యక్తిగత విషాద చరిత్ర కాని, షేక్స్పియర్ చరిత్రాత్మక నాటకాలలో ఎప్పటికీ తీరని రాజుల సమస్యలు, జాతీయ జీవితం ఇవన్నీ వస్తాయి. ప్రతిభ కలవాడు కాబట్టి తన పాత్రల అంతరంగాలలోకి చూడ గలిగాడు. మార్లో సృష్టించిన బారబాస్ అమానుష ప్రకృతి కలవాడు, కొంచెం చిత్రమైన వ్యక్తి కాని షైలక్ నిజంగా విశేషమైన మనిషి.

మార్లోకి మరొక వారసుడు ఉండేవాడు, ఎలిజబెతన్ నాటక రచయితలలో రెండవ వాడనిపించుకున్నవాడు ఇతనే బెన్ జాన్సన్ (1572—1637)

జాన్సన్ పాత్రలరోసుం అభిలాష, ఆకాంక్ష కలవారు ఉంటారు కాని ఇతని రచనలో హేళనతో కూడిన వ్యంగ్యం ఉంటుంది.

'వోల్పోన్' అనే నాటకం పెట్టుబడిదారీ వ్యవస్థని చాలా చక్కగా వెక్కిరిస్తుంది. ప్రదేశం సమకాలీనపు వెనిస్‌గా చూపించినా పాత కాలంలో సామ్రాజ్యాలు ఏలిన రోమ్‌ని మనసులో ఉంచుకుని వ్రాసి ఉంటాడు జాన్సన్.

## మానసిక అంతర్దృష్టి

1610లో జాన్సన వ్రాసిన 'ది ఆల్కెమిస్ట్' అనే నాటకం వెలువడింది. ఇందులో అతను అప్పటి కాలం లండన్ మనుష్యుల భాషనీ, ప్రవర్తననీ వేళాకోళం చేశాడు. జాన్సన్ అంటే గురుభావంకల చార్లెస్ డికెన్స్‌దాకా మళ్లీ ఇంత హాస్య రచయిత పుట్టలేదేమో! వ్యక్తుల స్వభావాలని జాగ్రత్తగా పరిశీలించగల శక్తిగల జాన్సన్‌తో పోలిస్తే షేక్స్పియర్‌లోని విశేషమైన స్వాభావికత బయట పడుతుంది.

1600 తర్వాత 'కామెడీ' రచయితలందరూ షేక్స్పియర్ కన్నా జాన్సన్‌నే ఎక్కువగా అనుసరించారనవచ్చు— నాటకాలు చూసే వారందరికీ ఫాల్‌స్టాఫ్ అంటే చాలా ఇష్టమైనప్పటికీ. 'ట్రాజెడీల' విషయంలో మాత్రం మానసిక వ్యాపారాల ఆంతర్యాలని శోధించిన షేక్స్పియర్ అందరికీ ఆదర్శ ప్రాయుడయ్యాడు 'టూర్నుయిర్' వ్రాసిన'రివెంజర్స్ ట్రాజెడీ"(1607), "వోల్పోన్" "హామ్లెట్"ల విచిత్ర మిళనం అనవచ్చు కాని, తర్వాత వెలువడ్డ వెబ్‌స్టర్, మిడిల్‌టన్‌ల ట్రాజెడీలలో భావ సంఘర్షణలతే ప్రాధాన్యం వహించాయి థామస్ మిడిల్‌టన్ (1580—1627) తన నాటకం, "చేంజ్ లింగ్"లో వాంఛ, శిక్షలమధ్య సంబంధ బాంధవ్యాలని అనుశీలించాడు, మానవ స్వభావంలో వర్గ చైతన్యం వల్ల ఏర్పడే సంఘర్షణలని చిత్రీకరించాడు. పాత్రలందరూ 'బూర్జువా, తరగతి వారే భాష నిరాడంబరంగా ఉన్నా కవితా శైలి ఆప్యాయంగా ఉన్నట్లు ఉంటుంది పాఠకుల భాషకి దగ్గరగా ఉంటుంది ఇబ్సెన్ శైలికి మార్గం చూపిస్తున్నట్లే వూహించవచ్చు, కాని 'ఒథెల్లో' లేనట్లయితే దానిని వ్రాసి ఉండటానికి వీలులేదు.

"చేంజ్ లింగ్" వెలువడే సరికి షేక్స్పియర్ చనిపోయి ఆరు సంవత్సరాలు కావచ్చింది (1616) కాని, దేశంలో నాటకం మీద ద్వేషం బాగా పెరిగింది షేక్స్పియర్‌కి లభించిన అవకాశాలు **మాయమయ్యాయి. అవకాశాలను వినియోగించుకొనటంలో షేక్స్పియర్ చాలా ప్రతిభ కల**వాడు. అసలు అతను నాటకాల రచన కొనసాగించే సమయానికి మరికొందరు కూడా తమ రచనలు **కొనసాగించటమే కాక అతనిని అనుసరించి గాని,** స్వతంత్రంగా గాని పురోగమించటం షేక్స్పియర్‌కి కలిగిన అవకాశం క్రిందనే పరిగణించాలి. ★

# షేక్స్పియర్ కబుర్లు

విలియం షేక్స్పియర్‌ని గురించి పెద్ద పెద్ద వాళ్లంతా రాసేస్తున్నప్పుడు ఈ చిన్న కబుర్లపోగుకన్నా మామూలు వాళ్ళు రాయటం సాహసంకదా! వి. షే. జీవిత చరిత్ర మీకు చదవాలనీ ఉండదు, నేను ఇక్కడ (క్లుప్తంగానైనా సరే) ఇవ్వనూ ఇవ్వను, ఎవరికీ ఉపయోగంగా ఉండని, ఉండలేని కబుర్లు కొన్ని చెప్పి వూరుకుంటాను....

**విలియం షేక్స్పియర్ వూరు స్ట్రాట్‌ఫర్డ్—ఆన్—ఏవన్ అని మీకు తెలియకుండా ఉండిఉండదు. ఏవన్ ఒక చిన్న నది. ఒకసారి ఈ ఏటి నీరు సీసాలోపోసి అమెరికా** తీసుకు వెళ్లారుట, అక్కడ ఒక కొత్త 'థియేటర్' పునాదులలో పొయ్యటానికి!

షేక్స్పియర్ నాటకాలు అతనుకాక మరెవరో రాశారనేవారు లేకపోలేదు అసలు రచయితలుగా వూహాగానాలలో ఎన్నిక అయిన వారు కొందరు ఫ్రాన్సిస్ బేకన్, లార్డ్ వెరులామ్, ఎడ్వర్డ్ డినియర్, రాజర్ మానర్స్, సర్‌వాల్టర్ రాలై; వీరుకాక ఇద్దరు వనితలు:— మేరీ కౌంటెస్ ఆఫ్ పెంబ్రోక్, మిస్ ఆన్ వాట్‌లీ

ఈ శతాబ్దంలో ఇటువంటి సిద్ధాంతాలని నమ్మేవారు (అదృష్టవశాత్తు) తగ్గిపోయారు క్రిస్టఫర్ మార్లో షేక్స్పియర్ పేరుకింద నాటకాలు రాశాడన్న సిద్ధాంతం ఇటీవలే నిరాధారం అని తేలిపోయింది మార్లో శవపేటికని తెరిచిచూసి కొన్ని సందేహాలు నివృత్తి చేసుకున్నారు

పై జాబితాలోని చివరి స్త్రీ పేరు (ఆన్ వాట్‌లీ) గమనించతగ్గది. 27—11—1582 లో ఆన్‌వాట్‌లీకి, విలియం షేక్స్పియర్‌కి ఒక పెళ్ళి 'లైసెన్స్' ఇచ్చినట్లు రికార్డు ఉంది కాని మర్నాడే షేక్స్పియర్‌కి ఆన్‌హాత్‌వేకి వివాహం నిశ్చయం అయిపోయింది! ఈ షేక్స్పియరూ మొదటి మనిషీ ఒకడేనా? ఇంతదాకా ఎవరూ చెప్పలేకుండా ఉన్నారు షేక్స్పియర్ భార్య అతనికన్నా ఎనిమిది సంవత్సరాలు పెద్ద వారిద్దరికీ ముగ్గురు పిల్లలు పుట్టారు కాని, వీరిపరంపర 17వ శతాబ్దంలో నశించిపోయింది. షేక్స్పియర్ తోబుట్టువు సంతతివారు మాత్రం 'హార్ట్' పేరుతో నేటికీ ఉన్నారని వినికిడి . .

షేక్స్పియర్ కన్నా గొప్ప రచయిత ఎవడూలేడు, ఇతని ప్రతిభ ఇంతా అంతా, కాదు, కాని సాధారణంగా అందరూ అనుకునే రకం 'కళాకారుడు' మాత్రంకాదు! కావలసినంత ఆస్తి సంపాదించాడు. జాగ్రత్తగా వీలునామా రాశాడు (పోతేకి తన 'సెకండ్ బెస్ట్‌బెడ్' వదిలిపెట్టాడు. **అల్లుడు జాన్‌హాల్‌కీ, కూతురు సుసాన్నాకి తక్కిన** వస్తువులతో చాలామట్టుకు ఇచ్చేశాడు.) తన నాటకాల ప్రదర్శనలలో అతనికి 'వాటా' ఉండేది థియేటర్‌లో కూడా ఉండేదంటారు

అప్పటికి నాటకాల ప్రదర్శనలలో బాగానే వచ్చేదిట. ఒక 'ఆట' కి అయిదారు పవున్లదాకా పోగయ్యేదిట. ఇప్పటికన్నా అప్పుడు **ఒక పవున్‌కి చాలా విలువ ఉండేదనే సంగతి గుర్తించాలి. (కొన్ని చోట్ల 15 పవున్లు కూడా వచ్చేవిట! ఇవి బాక్సాఫీసు హిట్లు అన్నమాట.)**

అందుకనే షేక్స్పియర్ కర్చు సంవత్సరానికి 1000 పవున్లు ఉండేదని స్ట్రాట్‌ఫర్డ్ వికార్‌గా (1662—81) పని చేసిన జాన్‌వార్డ్ రాస్తే మనం చదివి ఆశ్చర్య పడక్కరలేదు!

షేక్స్పియర్ నటుడుగా వేషాలు వేశాడని పైనే చెప్పాను. 1603 లో 'సెజానస్' అనే నాటకంలో పాల్గొన్నట్లు ఉంది. ఆ తర్వాత, ముందు కూడా ఎన్నో పాత్రాభినయాలు చేసిఉండాలి విలియం షేక్స్పియర్.

షేక్స్పియర్ పేర ఉన్న నాటకాలన్నీ పూర్తిగా అతనే రాశాడని కొందరు నమ్మరు. ఫ్లెచ్చర్, నేష్ మొదలయిన వారితో కలిసి రచనలు చేసి ఉంటాడంటారు అంతేకాదు, 'కార్డెనియో' అనే నాటకం అతని రచనే అని ప్రతీతి ఉందికాని అది ఇప్పుడు మనకి దొరకటంలేదు.

షేక్స్పియర్ 'సానెట్'లు అంకితం చేసిన డబ్ల్యు హెచ్. ఎవరు? ఇంతదాకా తేలని ప్రశ్న ఇది ఆ సానెట్‌లలోనే ఒక స్త్రీ ప్రసక్తి ఉంది. ఈవిడని 'ది డార్క్ లేడీ ఆఫ్ ది సానెట్స్' అంటారు. ఈవిడ మూలంగా షేక్స్పియర్ చాలా కష్టాలకి (మానసికంగా మాత్రమేనేమో!) లోనయినట్లు విమర్శకుల వూహ! కాని ఈ స్త్రీ ఎవరో కూడా ఇంకా తేలలేదు. క్లియోపాత్రా, రోసలిన్ పాత్రల సృష్టి షేక్స్పియర్ స్వయంగా ఎరిగిన ఒక వ్యక్తిని మనసులో ఉంచుకుని చేసినదని ఇంచు మించు అందరూ అంటారు.

షేక్స్పియర్ పుట్టిన రోజూ, చనిపోయిన రోజూ కూడా 23 ఏప్రిల్ అంటారుకాని నిజానికి అతని జన్మదినం సరిగ్గా తెలియదు. 1916 లో చనిపోవటానికి కొంతకాలం ముందు జాన్సన్, డ్రేటన్‌లతో బాగా తాగి జబ్బుచేసి మరణించాడని వార్డ్ రాశాడు. ఇది ఎంతదాకా నిజమో తెలియదు. షేక్స్పియర్ అల్లుడు డాక్టర్ జాన్‌హాల్ తన 'కేస్‌బుక్' లలో వివరాలేమీ ఇవ్వలేదు. ★

# 'రవీంద్రభారతి' లో నృత్య ప్రదర్శనాలు 'ఉస్మానియా' లోనూ తన పరిశోధనా విభాగం!

ఈమధ్యనే హైదరాబాదు పట్నంలో అఖిల భారత నృత్యోత్సవ సదస్సు జరిగింది. రవీంద్ర భారతివారు, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారు కలిసి ఈ సదస్సును నిర్వహించారు. నాలుగు రోజులపాటు జరిగిన ఈఉద్యమాల్లో పాల్గొనటానికి దేశం నాలుగు మూలల్నుంచి సుప్రసిద్ధ కళాకారులు, పండితులు, నాట్యాచార్యులు విచ్చేశారు. రాత్రిళ్ళ నృత్య ప్రదర్శనాలు, పగటిపూట నృత్య రీతుల గురించి ఉపన్యాసాలు, అవసరాన్నిబట్టి పగటిపూట కూడా నృత్య విన్యాసాలు కూడా జరిపించారు. "అఖిల భారత శాస్త్రీయ నృత్య రీతులు, పరిణామ వికాములు, లక్ష్య సామ్య సంబంధములు" అనే విషయాన్ని చర్చనీయాంశముగా స్వీకరించారు. కేంద్ర సంగీత నాటక అకాడమి వారి అధ్వర్యంలో అఖిల భారత స్థాయిన ఇలాంటి నృత్యోత్సవములే అది వరకు ఢిల్లీలో జరిగినాయి. తర్వాత అలాంటి గౌరవము మన ఆంధ్ర దేశానికి దక్కింది. ప్రసిద్ధికెక్కిన శాస్త్రీయ నృత్య రీతులే ప్రదర్శింపబడ్డాయి. అందు వలన కూచిపూడి, భరత నాట్యము ఒడిస్సి, మణిపురి, కథక్, కథాకళి నృత్య బృందములు మాత్రమే ఈ ఉత్సవములో పాల్గొన్నాయి.

మొదటి రోజున ఉత్సవము, శ్రీ వేదాంతం రాఘవయ్య గారి అధ్యక్షతన ప్రారంభమయింది నాలుగు రోజుల పాటు వారే అధ్యక్షభారం వహించారు. నాట్యశాస్త్ర విశిష్టతను గురించి, నృత్యరీతులను గురించి విపులంగా ప్రస్తావించారు. నృత్యరీతులన్నీ కూడా విశిష్టమైనవేనని, ఒకదానికంటే ఒకటి తక్కువ ఎక్కువ అనే భేద భావము లేనే లేదని దృష్టాంత పూర్వకంగా విశదీకరించారు. నర్తకియొక్క అంతః ప్రాణలక్షణములు పదింటిలోను 'వడి' 'నిలుకడ' అనునవి ప్రధానములు. కూచిపూడి నృత్య, భరత నాట్యములలో ఈ 'వడి' 'నిలుకడలు' సమ ప్రాధాన్యమును కలిగియుంటాయి. ఆంధ్రదేశపు కూచిపూడి నృత్యములోను, తమిళ దేశమునందలి భరతనాట్యములోను అభినయమునకు ప్రాధాన్యము. ఉత్తర హిందూస్థానమునందలి కథక్‌నృత్యములో నృత్తమునకు ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తారు. కేరళ దేశమున కథాకళి నృత్యములో ముద్రలకు విశిష్టమైన స్థానమున్నది. మణిపురి నృత్యములాస్య పద్ధతికి చెందినది. ఒరిస్సా రాష్ట్రంలో ఒడిస్సి నృత్యమురీతి పేర్కొనదగినదని, అన్నారు.

ఆ రోజు శ్రీ వేదాంతం సత్యనారాయణ శర్మగారి బృందం, భామాకలాపం, ఉషాపరిణయాన్ని ప్రదర్శించారు. ఈ కూచిపూడి నర్తకునికి లోగడ భారత ప్రభుత్వం వారు సన్మానం చేశారు. సంప్రదాయ సిద్ధమైన కూచిపూడి నాట్యకళను కాపాడుకుంటూ వస్తున్న ప్రముఖుల్లో వీరొకరు.

మన తెలుగువారి నాట్య పద్ధతులకు అఖిల భారత స్థాయిన గొప్ప గౌరవం ఉంది. ఉజ్జయినీలో జరిగిన కాళిదాస్ నాట్యసమారోహ్, 1961 లో విజయనగరం తెలుగు బృందం వారు శ్రీ సంపత్ కుమార్ దర్శకత్వంలో "అభిజ్ఞాన శాకుంతలము"ను నృత్య నాటకముగా ప్రదర్శించి ప్రథమ 'కనక కలశము'ను గెల్చుకున్నది. గత సంవత్సరంలో శ్రీ నటరాజ రామకృష్ణ దర్శకత్వములో 'కుమార సంభవ' గాథను నృత్య నాటకముగా ప్రదర్శించి నాట్య బృందము వారు ప్రథమ బహుమానమును పొందారు. ఈ నృత్యోత్సవములో ప్రదర్శింపబడ్డ బాలసరస్వతిగారి భరతనాట్య ప్రదర్శనము చాలా మందిని ఆకర్షించింది. ఒడిస్సి నృత్యము, దమయంతీజోషిగారి కథక్ నృత్యరీతి, జావేరీ సోదరీమణుల మణిపురి నృత్య ప్రదర్శనములు, ప్రేక్షకుల మన్ననలను పొందాయి. చివ్వరికి ఒక్కమాట మిగిలిపోయింది. ఈ ప్రదర్శనాన్ని తిలకించటానికి జనం తండోప తండాలుగావచ్చి పడ్డారు. మొదటి రోజునే వీరందర్నీ రవీంద్రభారతిలో కూర్చోపెట్టటం పెద్ద సమస్యయిపోయింది. 'ప్యాస్' చూపిస్తున్న వ్యక్తిని లోపలికి రానీయకుండా ఉండటానికి వీల్లేదు. మరి ఇన్ని 'ప్యాస్' లు ఎవరిచ్చారో అర్థం కావటంలేదని, మొదటి గేటులో నిలబడ్డ బాధ్యతగల కార్యకర్త విసుక్కున్నారు. దీనిమూలాన, కొంతమంది రావలసిన వ్యక్తులకు అవకాశం లేకుండా పోయిందని కూడా అనుకున్నారు!

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ అధ్యక్షులుగా శ్రీ పసల సూర్యచంద్రరావుగారికి ఘనమైన సన్మానం జరిగింది. ఈ సంస్థతో వీరికి సన్నిహిత సంబంధాలు మొదటినుంచి ఉంటూనే వచ్చాయి.

---

## ఇంటింటి పజ్యాలు

ఆరుద్ర

### అక్షర రక్షకుడు

ఎవ్వరూ మమ్మల్ని వాట్టం లేదు
నువ్వేనా వాడు నీ సొమ్మేం పోదు
అని దెబ్బలాడుతున్నాయి అలుఁ అలూ
అయినా వీటిని వాడ్డాని కుందా వీలు
నాకు తెలిసినదల్లా ఒక్కటే జ్ఞప్తి

నాపదసంపద దాన్తో సమాప్తి
అలుఁ అలూలు వాడితే అరుఁ అరూఌ
ఆ చేత్తోనే వాడమని పెడతాయి పేచీలు
రు వచ్చినచోట వాడతాను ఋ
లు వచ్చినచోట వాడతాను ఌ
తబుఌ కుబుఌ మంజబుఌ
అని వ్రాస్తే తిడతాఋ నా చదువబుఌ.

★

# రాజధాని కబుర్లు

అందులో వారికి చిన్నప్పటినుంచీ కూడా లలిత కళలంటేనూ, నాటక కళంటేనూ అభిరుచి ఎక్కువ. కేవలం అభిరుచి మాత్రమే కాకుండా, అనేక పాత్రలు నటించారు కూడా. 'నాట్యకళ' అనే ద్వైమాస పత్రికకు సంపాదకులు ఆంధ్రప్రదేశ్‌లోవున్న అనేక సాహిత్య, నాటక, సాంస్కృతిక సంఘాలతో వీరికి సన్నిహిత సంబంధం ఉండటంవలన ఆయా రంగాల్లో వీరిపేరు వినిపిస్తూనే ఉంటుంది. మరి ఈనాడు అధ్యక్ష పదవిలో ఉండటంవలన వీరి నాయకత్వంలో సంగీత నాటక అకాడమీ ఇతోధిక కృషి చేయగలదని, నలుగురూ ఆశాభావం వ్యక్తం చేశారు. సన్మాన సభలో శ్రీ బుర్రా వెంకటసుబ్రహ్మణ్యంగారు ప్రసంగిస్తూ, కలకత్తావంటి మహాపట్నంలో ఒకే నాటకం నెలల తరబడి ఏవిధంగా ప్రదర్శింపబడుతుందో వివరించారు. అదే పద్ధతిలో మన ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరంలో కూడా ఒకే నాటకం, కేవలం ఒక రాత్రితోనే అంతం గాకుండా వరసగా ప్రదర్శింపబడే అవకాశం కనక ఉంటే, ఎక్కువమంది చూట్టానికి అవకాశం ఉంటుందని, దానికి తగిన ఏర్పాట్లు చెయ్యటానికి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు పూనుకుంటే బాగుంటుందనీ అన్నారు. శ్రీ బుర్రా వెంకట సుబ్రహ్మణ్యంగారు సుప్రసిద్ధ న్యాయవాదులవటమే గాకుండా, సాహితీవేత్తలు కూడా. కొంతకాలంపాటు త్రివేణి త్రైమాస పత్రికను ఇంగ్లీషు భాషలో కూడా నడపకలిగారు. ఈమధ్యనే వారిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు అడ్వకేట్ జనరల్‌గా నియమించారు. వీరి సలహాను అకాడమీవారు శ్రద్ధగా పాటిస్తారనుకోవచ్చు.

ఉస్మానియా యూనివర్సిటీలో అమెరికన్ సాహితీ సంస్కృతుల పరిశోధనా కళాశాల నెల కొల్పారు. ఇలాంటి కళాశాల ఇంతవరకు ఆసియా దేశాల్లో ప్రారంభించటం ఇదే మొదటిసారిట! అమెరికన్ చరిత్ర, సాహిత్యాలకు సంబంధించిన అనేక గ్రంథాలు తెప్పిస్తారు పరిశోధకులకు కావలసిన అనేకమైన ఏర్పాట్లు చేస్తారు అమెరికానుంచి ప్రత్యేకంగా విచ్చేసిన ప్రొఫెసర్స్ దీని ఆవశ్యకతను గురించి విశదీకరిస్తూ ఉపన్యాసాలు చేశారు. హైదరాబాదు పట్నం, భారత దేశానికి మధ్యగా ఉంటంవలన వాతావరణం కూడా అనువుగా ఉంటంవలన పదిమంది పెద్దలువచ్చి, పరిశోధనా కార్యక్రమాన్ని కొనసాగించటానికి వీలుగా ఉంటుందనీ అన్నారు. ప్రత్యేకంగా కళాశాలకు, గ్రంథాలయానికీ, భవనాలు నిర్మించటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈలోగా యూనివర్సిటీ భవనాల్లోనే తమ కార్యకలాపాల్ని సాగిస్తూ ఉంటారు కేంద్ర విద్యాశాఖమంత్రి శ్రీ యం సి చాగ్లాగారు విచ్చేసి, అమెరికా, భారతదేశాలు ఒకన్నొకరు అర్థం చేసుకుని వ్యవహరించాలనీ, పరస్పర సహకారంవలన ప్రపంచ పరిస్థితి చాలా మెరుగవుతుందని అన్నారు. అందువలననే అమెరికన్ చరిత్ర సాహిత్యాలను భారత దేశ విశ్వవిద్యాలయాలలో అధ్యయనం చేయవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉందనీ అన్నారు. ఉస్మానియా విశ్వ విద్యాలయ వైస్ ఛాన్సలర్ శ్రీ డి యస్. రెడ్డిగారు మాట్లాడుతూ, హిందూ, ముస్లిం సంస్కృతులు సమ్మేళనం చెందిన, ఆంధ్రుల రాజధానినగరంతో యిలాంటి కేంద్రం స్థాపించటం ఎంతైనా సముచితంగా ఉందని అన్నారు.

బి. ఎల్. ఎన్. ★

**హరికిషన్**

## జరిగిన కథ

జానకిరాం ఎం. ఏ. పాసయినా ఉద్యోగం చెయ్యకపోవటం అతని భార్య గౌతమికే కాక తలిదండ్రులకు కూడా బాధ కలిగిస్తుంది. జానకిరాం అన్న కృష్ణమూర్తి జబ్బు మనిషి. అతని భార్య స్వాతి ఉద్యోగంచేసి ఇద్దరినీ పోషిస్తూ ఉంటుంది. స్వాతిని వివాహంచేసుకోవటంవల్లనే కృష్ణమూర్తి తలిదండ్రులకు దూరమవుతాడు. స్వాతి ట్యూషన్ చెప్పే తాసిల్దారుగారి కూతురు జ్యోతి మేనత్త కొడుకు మురహరి. తల్లిపోయిన తర్వాత జ్యోతిని పెళ్ళిచేసుకొనవలసిందని మేనమామ కేశవరావు మురహరితో చెబుతాడు. విశాఖపట్నంలో పరిచయం అయిన జయలక్ష్మి పట్ల ఆకర్షింపబడుతాడు మురహరి. గౌతమి కోపం వచ్చి పుట్టింటికి వెళ్ళిపోతుంది. కాని అక్కడ తగిన ఆదరణ లభించదు. మురహరి జయలక్ష్మి సానుభూతికి చాలా సంతోషిస్తాడు. జానకిరాం తన అన్న కృష్ణమూర్తి యింటికి వెళ్తాడు అన్నా, వదినెలు చాలా మంచివారని చెల్లెలితోనూ, తల్లితోనూ చెప్తాడు. స్వాతి విషయం తనవద్ద తేవద్దని తల్లి మండిపడుతుంది. నగేంద్ర బాల గౌతమికి తన కథ చెబుతుంది. పరిషత్తులో ప్రయోగించని పీణకు బహుమతి లభిస్తుంది. మురహరి జయలక్ష్మి పెళ్ళిచేసికొనలేకపోతాడు. స్వాతి తాసిల్దారుగారింట్లో సమస్యలను ఎదుర్కొంటుంది. పుట్టింట్లో బాధల నమభవిస్తున్న గౌతమి ఉద్యోగం చేయాలనే నిశ్చయానికి వస్తుంది. జయలక్ష్మి తన వైధవ్యపు గాధనంతా మురహరికి చెపుతుంది. తన ఇంటికి వచ్చిన జ్యోతిని, స్వాతి సముచితంగా సత్కరిస్తుంది. అస్వస్థుడైన మురహరికి, జయలక్ష్మి సేవలు చేస్తుంది. సెలవులివ్వగానే, ఇరువురూ స్వగ్రామాలు చేరుకొన్నా, ఒకరిని ఒకరు కలుసుకోలేకపోతారు... గౌతమి తాను చేసినపనికి చింతిస్తూ, భర్త జానకిరాంకు ఉత్తరం వ్రాస్తుంది. అప్రయోజకుడై పోతున్నాడని, జానకిరాంను తండ్రి మందలిస్తాడు జానకిరాం ఇంట్లో చెప్పకుండా వెళ్లిన నగేంద్రబాలను కల్సుకొని ఆమె ద్వారా అన్ని విషయాలు తెల్సికొంటాడు. తనకు తానుగా గౌతమివస్తే స్వీకరించటానికి సిద్ధంగా ఉన్నాననికూడా చెప్తాడు. జ్యోతి పుట్టినరోజు నాడు వాళ్ళ యింట్లో జరిగిన విందులో మురహరి జయలక్ష్మి ప్రేమించుకున్నట్లు చూచాయగా తెలుస్తుంది. జ్యోతి తల్లి స్వాతిని తమింటికి రావద్దని పరుషంగా మాట్లాడుతుంది.

# 30

జయలక్ష్మి వచ్చేసరికి స్వాతి మంచంమీద పడుకుంది. అప్పటికి రెండు రోజులైంది ఆమె ధారకం తీసుకుని. జ్వరం ఎక్కువగా లేకపోయినా ఎవరు పలకరించినా ఏం మాట్లాడటంలేదు. కృష్ణమూర్తి పక్కనే కూర్చున్నాడు. మందు తెచ్చినా తాగనంటుంది. ఎప్పుడూ శూన్య దృక్కులతో కళ్ళార్పకుండా చూస్తుంది. ఆ చూపులోని అర్థం ఏమిటో కృష్ణమూర్తికి కూడా తెలియదు. పాలు గాని, పళ్ల రసంగాని ఏదీ వద్దంటుంది.

"నీ పట్టుదలతో నన్ను దూరం చేసుకోదల్చుకున్నావా స్వాతీ" అన్నాడు కృష్ణమూర్తి ఆమె పట్టుదలను వారించదలచి ఆ మాటలకు ఒక్క నిట్టూర్పు విడిచి మెల్లిగా నిరాశగా నవ్వుతుంది.

జయలక్ష్మిని చూడంగానే మెల్లిగా లేచి కూర్చుని "వచ్చావా జయా, నువ్వు రావేమో అనుకున్నాను. నాయందు కరుణ ఉంచినందుకు చాలా సంతోషం" అన్నది.

ఈ రెండు రోజులకే పీక్కుపోయిన ముఖమూ, తైలసంస్కారం లేని జుట్టూ, వాడిపోయిన జడా, మాసిపోయిన చీరె,జాకెట్టుతో ఉన్న స్వాతిని చూసేసరికి జయలక్ష్మికి మతిపోయినంత పనయింది.

"వదినెకు ఇంత జబ్బుగా ఉంటే కబురయినా చెయ్యలేదేం అన్నయ్యా. కన్నవారు దూరమైనా ఈ జయలక్ష్మి మాత్రం ఎప్పుడూ దూరం కాదు. ఇట్లాగే చూస్తూ వూరుకుంటే ఈ జబ్బు ఎంత ప్రమాదకరముగా పరిణమిస్తుందో" అన్నది జయలక్ష్మి స్వాతి జుట్టును సరిచేస్తూ ముఖంలోకి తేరిపారజూస్తూ.

"మొన్నటి రోజున జ్యోతి వాళ్లింటికి మామూలుగానే ట్యూషనుకు వెళ్లింది. వెళ్లిన పదినిమిషాలకే వాళ్ళు వద్దన్నారంటూ ఖిన్నురాలై వచ్చేసింది. ఆ రోజున నేను ట్యూషను వద్దన్నారేమో అంత మాత్రంచేత మనం బ్రతకలేకపోతామా అని తేలికగా చెప్పేశాను. కాని స్వాతి హృదయంలో అగ్ని పర్వతం బ్రద్దలయింది. దాని పరిణామమే ఇది. కారణమేమిటో ఎంత అడిగినా చెప్పటంలేదు జయా. నాని నీకయినా చెపుతుందేమో అడుగు." అని ముందు గదిలోకి వెళ్ళాడు కృష్ణమూర్తి.

"నాతో చెప్పవు వదినా. నిన్నెవరయినా అవమానించారా. కాని మాటలేమైనా జ్యోతి తల్లి అన్నదా" అన్నది జయలక్ష్మి.

"ఒకళ్ళు కాని మాటలంటే అవమానంపొందిన వాళ్ల మవుతామా జయా. భగవంతుడే మన నొసట వ్రకగతిని జీవితం గడపాలని రాసినప్పుడు ఎవరో ఏదో అన్నారని కించ పట్టం ఎందుకు. పోనీలే నన్ను గురించి నాకు ఏ బెంగాలేదు.ఒక్క సంగతి చెపుతావా" జయలక్ష్మి కుడిచేతిని తన అరచేతులోకి తీసుకుని అడిగింది స్వాతి.

"నువ్వు అడగబోయే ప్రశ్న నాకు తెలిసినదే వదినా. మురహరిని మభ్యపెట్టి, కాని పన్నతో ప్రోత్సహించి నావెంట తిప్పుకోవటం లేదు. జ్యోతి అతని మేనమామ కూతురని నాకు మొదట్లో తెలీదు. ఒకరి జీవితాన్ని నాశనంచేసి నేను అందలమెక్కి కులుకుదామనే కాంక్ష నాకెప్పుడు లేదు. ఈ రోజుకయినా మురహరి ఆలోచించుకుని తన నిర్ణయాన్ని మార్చుకుని జ్యోతిని చేసుకుంటానంటే నేను మీ అందరికన్నా ఎక్కువగానే హర్షిస్తాను. కాని వదినా అన్ని బాధలూ పడినదానివి. అన్ని అనుభవాలూ పొందినదానివి. నాబోటి నిర్భాగ్యురాలి మనస్సు నువ్వుకూడా అర్థం చేసుకోలేకపోతే, అసలు స్త్రీవై ఉండికూడా స్త్రీ హృదయాన్నే అర్థంచేసుకోగల మానసిక పరిణామం నీలో లేదేమో ననుకోవాల్సి వస్తుంది. ఇంతకు మించినేను చెప్పగలిగేదేమీ లేదు. ఏం చెప్పినా చర్విత చరణమే అవుతుంది. జ్యోతి యందు నాకు న్యూనతగానీ, కోపంగాని ఎన్నడూ లేదు. పసి వయస్సులో పసిడి భావాలు కల కన్నెపిల్ల జ్యోతి. ఆమె సిగ్గు మొగ్గలు తొడుగుతుంది. ఆమె భావాలు తామరకొలనిలోని విచ్చి విచ్చని తామర పువ్వులాంటివి. బావనే ప్రేమించింది. బావనే తన మనస్సులో నిలుపుకుని పసిడి భావాలతో పుత్తడి బొమ్మలా అయి బంగారు పుష్పాలతో పూజించింది. నాబావ నాభర్త కావాలని మనసారా ప్రార్థించి వళ్ళంతా కళ్ళు చేసుకుని బావరాకకోసం ఎదురుచూసేది. ఆమె కలువ కన్నియ. కన్నె ముత్తైదువ. మేనరికంలోని మెత్తని మనసున్ను తన సొమ్ముగా చేసుకున్న కన్నెపిల్ల. రాగాలతో, భోగాలతో, రాణింపజేసి రమణీయకతను సృష్టించగల కలభాషిణి జ్యోతి. కాని వదినా, ఇవన్నీ ఇక్కడికి వచ్చిం తర్వాత తెలుసుకున్న యదార్థ విషయాలు. జ్యోతి మాదిరిగా ప్రేమించే హక్కు నాకులేదు. మేన బావ అని చెప్పుకునే పుట్టరికపు బాంధవ్యం నాకులేదు. తెలి మబ్బులలో తేలిపోతూ, చిరు సిగ్గును తన సొమ్ముగా ఒలకబోస్తూ, ప్రథమ వీక్షణంలోనే ప్రేమించానని కాలానుగుణ్యంగా చెప్పుకునే సొత్తు మాత లేనిదాన్ని. మూడేళ్లుగా చదువుకుంటున్నాము. ముప్ఫై సంవత్సరాల ఎరికగా మనస్సులు విప్పి వళ్ళాడుకుని ఒకరినొకరం అర్థం చేసుకున్నాము. అన్నింటినీ మించి నేను బాల్యంలోనే భర్తను పోగొట్టుకున్న నిర్భాగ్యురాలినని తెలును. ఆ విషయాన్ని నేనే చెప్పాను. అన్నీ తెలిసే నన్ను ఎంచుకున్నాడు మురహరి. మనస్సులు మాట్లాడుకున్నయ్యి. హృదయాలు అన్ని విషయాలు చర్చించుకున్నయ్యి. ఇతదాకా వచ్చాక నేనం చెయ్యాలో నువ్వే ఆలోచించి

## ఎండమావులు

ఒక మార్గం చూపిస్తే ఆ మార్గాన వెళ్లటానికి నాకేం సందేహం లేదు. జ్యోతి నాకు ఈ రోజూతూ చెల్లెలే. ఆమెయందు నాకు ఏ ద్వేషంగాని, కోపం గాని, అసూయగాని లేదు. ఏది ఎవరి కర్తవ్యమో నువ్వు సూచిస్తే అక్షరాలా పాటిస్తాను. ఆ రకంగా నడ్చుకుంటాను. కర్తవ్యం ఉపదేశించటం నీ వంతు. కార్యాచరణ నావంతు. ఇద్దరికీ ఈ స్వాతివదినే శ్రీరామరక్ష." అంటూ ఆమె పాదాలకు నమస్కరించి కన్నీటితో అభిషేకం చేసింది జయలక్ష్మి.

స్వాతి మనస్సు ద్రవీభూతమైంది. ఆమెకు ఇద్దరూ ఒకటే. ఇద్దరూ చెరో కన్ను. ఇందులో ఏ కంటిని ఎందుకు పోగొట్టుకోవాలి? ఒక్క కన్నుతో ఆమె ఏం చెయ్యగలదు? ఎవరిని త్రోసి రాజనకలదు ?

"జయా! ఒకరి ప్రేమను కాదని, ఒకరిని చేపట్టమనీ ఎవరివైపూ నేను బాసటగా నిలబడి సమర్థించలేను. జీవిత ప్రమాణాలు విలాస వస్తువులు కావు, బేరమాడ ఏది బాగున్నదో ఎంచుకోటానికి. ప్రేమరాహిత్యంలో భావ సమైక్యతకు తావులేదు. ఎవరు ఎవరిని ప్రేమిస్తున్నారు. ? ఎవరి ప్రేమ న్యాయ సమ్మతమైనది.? ఒకరి ప్రేమ చట్ట విరుద్ధమైనదని చెప్పటానికి సాహసించటం

జీవితాలతో పందెం వేసినట్లే అవుతుంది. నా జీవితాన్ని పందెం వేసి మీ అన్నయ్యను గెల్చుకున్నాను. కాని ఆ గెలుపు నాది కాదని ఇటీవల మళ్లీ తెల్సుకున్నాను. వ్యక్తిగతంగా పందెం గెలిచినా సంఘానికి సవాలువంటిది ఈ సవాలులో నేను ఓడిపోతానో, అనాగ్రహానికి గురౌతానో నాకే తెలియదు దారితప్పిన జీవితాలు ఎప్పుడూ రాజబాటని చేరుకోలేవనుకోటం మొదట్లో పిచ్చి వూహలుగానే కనిపించినా, కాలక్రమేణా రాచబాటని చేరుకున్నా మళ్లీ ముళ్ల బాటలలోకి లాగబడుతూనే ఉంటయ్యి ఈ అనుభవం క్రమేణా, కాలానుగతంగా తెల్సుకుంటాను'' అన్నది స్వాతి ఈ మాటలు చెబుతుంటే ఆమె ముఖం వెల వెలబోయింది అంతరాంతరంలోని దుఃఖపూరితమైన అన్ని సన్నివేశాలూ ఆమె మానసిక పరిధిలో విన్యాసం చేసినట్లుగా అనుభూతిని పొందింది జీవితమంతా ఉత్తమ విలువలనూ, ఉత్తమ ఆశయాలనూ పుణికి పుచ్చుకుని, నిష్కల్మషమైన జీవితాన్ని గడుపుతున్నా నిశ్చలమైన, నిర్మలమైన కొలనులో ఒక రాయి విసిరినట్లుగా ఉన్నదామె మనస్సు. అందుకామె పడే మానసిక ఆవేదన అంతులేనిది దానికి తోడు ఇప్పుడే కొత్త సమస్య ఉత్పన్నమైనది

స్వాతి భావాలు కొద్దిగా అర్థంచేసుకున్నది జయలక్ష్మి. స్వాతి కూర్చుని మాట్లాడలేక పోయింది మెల్లిగా నడుంవాల్చింది. కాసేపు కళ్లు మూసుకుని పడుకుంది ఆయాసం ఎక్కువైనట్లుగా గ్రహించింది జయలక్ష్మి.

''వదినా, మనస్సులో బాధపడినా, మధనపడినా జరగవలసిన జీవిత సంఘటనలు జరగక మానవు. ఇంతగా నువ్వు మనస్సులో ఎందుకు బాధపడుతున్నావో నాకు అర్థంకావటం లేదు'' అన్నది జయలక్ష్మి.

''జయా, నేను బాధపడను గాని ఒక్క విషయం చెపుతావా'' ఆదుర్దాతో ఆశగా అడిగింది

''ఏమిటది వదినా''

''నన్ను గురించీ మీ కృష్ణమూర్తి అన్నయ్యని గురించీ మీ పెద నాన్న గారింట్లో ఏమనుకుంటారు జయా. కన్నకొడుకునీ పెద్దకొడుకునీ చూడాలనీ, ఆయన ఆరోగ్యం గురించి తెల్సుకోవాలనీ ఆ తల్లి తండ్రుల మనస్సుల్లో ఎప్పుడూ కడుపు తీపి కలగదా జయా!'' అన్నది స్వాతి. ఈ పరిస్థితులో ఈ ప్రశ్న ఎందుకు స్వాతి అడిగిందో జయలక్ష్మికి అర్థం కాలేదు

''నేను ఆ ఇంటి పెద్దకోడల్ని ఎప్పుడూ కాలేనా జయా, నన్ను కోడలిగా చెప్పుకోటానికైనా కనీసం వారు నామర్దాగానే ఎంచుతారా? పోనీ అత్తగారైనా ఎప్పుడూ నా ప్రసక్తి ఎత్తరా? శ్రీలక్ష్మి వదినెకు నేనంటే ఏమాత్రమూ ఇష్టం లేదనుకుంటాను మామగారి దృష్టిలోకి నేనెప్పుడూ రాలేదేమో? ఏం జయా నిజం చెప్పు'' జయలక్ష్మి గడ్డం పుచ్చుకుని బ్రతిమాలుతున్నట్లుగా అడిగింది స్వాతి

స్వాతి మనస్సు ఈ ప్రశ్నలకు సమాధానం వినటానికి ఆదుర్దాతో ఉవ్విళ్లూరుతున్నది జయలక్ష్మి మనస్సు ఏం చెప్పటానికి నిరాకరిస్తున్నది.

''నిన్ను బ్రతిమాలుతున్నాను జయా నిజం చెప్పు. నా మనస్సు అవమానంతో, బాధతో ఎప్పుడో నిండిపోయింది. కొత్తగా నేననుభవించే బాధ ఏమీ లేదు. అత్తమామల, ఆడబిడ్డల అభిప్రాయాలు తెల్సుకోటం కోడలు విధి కదా!'' అన్నది స్వాతి మళ్లీ.

జయలక్ష్మి మనస్సు సుళ్లు తిరిగింది.

''వదినా, వారి భావాలూ, అనుభూతులూ యథాప్రకారంగానే ఉన్నాయి. మార్పేమీ లేదు ఈ భ్రష్టుయోగి అయిన కృష్ణమూర్తి అన్నయ్య కన్నతల్లి మనస్సులో ఎప్పుడూ మెదులుతూనే ఉంటాడు కాని, రాకపోకలకు గాని, కన్న కొడుకు ఆశయాల్ని, మానావమానాల్ని, సహించి కడుపులో పెట్టుకుని ఆదరించే వాతావరణం గాని ఆ ఇంట్లో ఎప్పటికీ రాదేమో కన్నీరు నింపుకుని, కన్న ప్రేమను చంపుకుని జీవచ్ఛవంలా గడపటం కన్నా ఆవిడ చెయ్యగలిగిందేమీ లేదు ఆవేదన అంచులు తట్టినా, ఆప్యాయత పాల పొంగులా ఉప్పొంగినా నీళ్లు చల్లి చల్లార్చ సమర్థురాలు, ఆ ఇంటి సనాతనాచార ధర్మ విశిష్టపరురాలు శ్రీలక్ష్మి తండ్రికి తగిన కూతురు కూతురు బావాలకు నీళ్లు పోసి పెంచే తండ్రి ఇంక నీకా ఇంట్లో తావెక్కడుంటుంది వదినా.''

కుండ పగులగొట్టినట్లుగా చెప్పిన ఈ మాటలు స్వాతి హృదయకుహరాన్నే పగులగొట్టినయ్యి. హృదయావేశంలోని కుమిలింపు మాత్రమే ఆమె సొమ్ము.

''మీ అన్నయ్యకు గుండె జబ్బు తిరగబెట్టిందని వాళ్లకు తెలుసా జయా'' అన్నది స్వాతి

''తెల్సు, అన్నీ తెలుసు జానకిరాం అన్నయ్య ఇక్కడికి వచ్చినప్పుడల్లా అన్ని విషయాలూ చెపుతూనే ఉంటాడు. కాని, వాటిని మనస్సుకు పట్టించుకునే దెవరు ?'' అన్నది జయలక్ష్మి.

''నిజమేనమ్మా జనాభా లెక్కలకు మాత్రమే ఈ అన్నా వదినెలు మనుష్యులు కాని బాంధవ్యానికీ, సంఘానికీ మాత్రం కాదు. నాలోని అవమానాలు ఈ ప్రదేశలోనూ సమసిపోయినయ్యనీ, నేనూ నలుగురిలో తలెత్తుకు తిరగగల స్థానాన్ని రాగలిగానని, అనుకున్నాను కాని ఎలుకతోలు తెచ్చి ఏడాది ఉతికినా, నలుపు నలుపే గాని తెలుపు రాదు, అన్న వేమన సూక్తులు నా విషయంలో యదార్థమే అయింది పోనీలే జయా, వారి భావాలూ, అభిప్రాయాలూ మార్చుకోమని నే నసను మత ప్రమేయమే లేని ఈ లౌకిక ప్రపంచంలో ఎవరి వర్ణాశ్రమ ధర్మాలు వాళ్లవి ఎవరి ఆచార వ్యవహారాలు వాళ్లవి. వాటిని మార్చటం, మార్చబూనటం తగని పని.'' అన్నది స్వాతి నిరాశగా పైకి చూస్తూ.

కృష్ణమూర్తి మళ్లా వచ్చాడు.

''ఏమంటున్నదమ్మా జయా మీ వదిన'' అన్నాడు పక్కమీద కూర్చుని. భర్తని చూసి మెల్లిగా లేచి కూర్చుంది స్వాతి

''పడుకో స్వాతీ కదలకు. మంచినీళ్లు కూడా తాగకుండా ఈ నిరశనవ్రతం ఏ ఆశయాల్ని సాధించటం కోసం స్వాతి'' అన్నాడు కృష్ణమూర్తి.

పేలవంగా మనస్సులోనే నవ్వుకుంది స్వాతి.

''నిరశన వ్రతాలతో, నిషూ రాలతో ఆశయాల్ని సాధించే రోజులు ఎప్పుడో పోయినయ్యండీ. నా మనశ్శాంతికోసమే, నా పాపపరిహారం కోసమే నేను తాపత్రయ పడుతు పడుతున్నాను ఎవర్నీ బాధపెట్టటానికి మాత్రం కాదు'' అన్నది స్వాతి.

''ఏమిటా మాటలు స్వాతి ఇప్పుడు ఎవరేమన్నారు నిన్ను'' జాలిగా అడిగాడు

కృష్ణమూర్తిని చూసి జాలిపడింది స్వాతి

''మీ మనస్సులోని వ్యథలూ, కుమిలింపూ, హృదయానుగతమైన ఆకాంక్షలూ మూటచేసి హృదయంలో దాచిపెట్టుకున్నారు అదే గుండె జబ్బుగా మీ వూపిరితిత్తుల్లో తిష్ట వేసింది. నా వ్యథలూ, కోరికలూ అన్నీ పెనుగాలికి ఎగిరిపోయే దూది పింజల్లా ఎన్నడో పోయినప్పటికీ ఆ దూదిపింజల్ని ఏకి, వడికి, దారంతీసి, బట్టలుగా నేసి నాకే చుట్టబెట్టారు అలాంటి బట్టలు కట్టుకుని నేను ఏ ముఖం పెట్టుకుని తిరిగేది ?'' అన్నది స్వాతి. ఆమె మనస్సులో అత్తమామలూ, ఆడబిడ్డ, తన తల్లిదండ్రులూ, బంధువర్గమూ అంతా మెదిలారు తన వివాహమైన కొది రోజులకే తల్లి పోయింది గూడెంలో తప్ప తాగి కొట్లాటలకు దిగితే నెమరి కణతకూ, తలకూ తగిలిన దెబ్బలవలన ఆస్పత్రిలో మరణించాడు తండ్రి తన తరువాత ఒక చెల్లెలు ఉంటే అది ఎవరితోనో వెళ్లిపోయింది జీవించి ఉన్నది లేందీ కూడా తెలియదు అన్నదమ్ము లెవరూ లేరు మాలపల్లిలోని ఆ గుడిశా, ఆ వాతావరణమూ, ఆ కబురూ మర్చిపోయి పన్నెండు సంవత్సరాలైంది మళ్లా ఈనాటికి ఆ వాతావరణం గుర్తుకొచ్చింది. ఎందుకు గుర్తుకొచ్చిందో స్వాతికి అర్థం కాలేదు. అత్తమామల్ని, ఆడబిడ్డల్ని అప్పుడప్పుడూ ఎక్కడైనా చూసినా వాళ్లతో మాట్లాడే వాతా



# ఎండమావులు

వరణం వాళ్ళెప్పుడూ కలిగించలేదు ఎక్కడయినా ఎదురుపడ్డా చూసీ చూడనట్టుగానే వెళ్ళేవారు. ఈ వివాహంతో పుట్టింటి ఋణం ఆ తీరుగా తీరిపోయింది. అత్తగారిల్లు ఎట్లా ఉంటుందో కూడా ఎరుగదు. తన్ను కన్నవారినీ, తను మెట్టినింటివారినీ దూరం చేసుకుని జీవించ గలుగుతున్నా ఆ మానసిక వధల్ని దూరంచేసే తీరుగా కృష్ణమూర్తి తన సంసార జీవితాన్ని నేర్పుగా వట్టుకొచ్చాడు. మన చేతిలోని వస్తువు జారిపోయినప్పుడు తాత్కాలికంగా బాధపడతాం. తరువాత ఆ విషయమే మర్చిపోతాం. బంధుత్వాన్ని దూరం చేసుకోవలసి వచ్చినప్పుడు మరుపనేది జీవితంలో ఏర్పడక పోయినా, సాంఘిక కట్టుబాట్లకు వెరిచి గుండెను బండరాయిగా మార్చుకుని వ్యధల్ని, అనుభూతుల్ని, అనురాగాన్ని, వాత్సల్యాన్ని ఆ బండరాతికింద భూస్థాపితం చేసి జీవచ్ఛవంలా జీవించగలుగుతాం. కాని జీవితంలో ఏదో ఒకప్పుడు ఆ బండరాతికి సమ్మెటపోటు లాంటి దెబ్బ తగిలి ఆ రాయి బీటలువారి అంతవరకు దాకా అణిగిఉన్న అన్ని రకాల భవ బంధాలూ పెల్లుబికి వచ్చి గత జీవితపు సంపుటాల్ని పేజీలకు పేజీలు తిప్పి ఆ సంఘటనలను మనస్సులో చిత్రీకరిస్తుంటే హృదయానుగతంగా ఆ వ్యక్తి పడే ఆవేదన భరింపరానిది.

ఆనాడు జ్యోతి ఇంట్లో జరిగిన పరాభవమే స్వాతిని ఈ స్థితికి తెచ్చింది

భర్తని చూసి కళ్ళు తుడ్చుకుని ఒక కోరిక కోరింది స్వాతి.

"ఇన్ని ·సంవత్సరాలనుంచి కోరని కోరిక ఒకటి కోరుతున్నాను. అది సర్వే సర్వత్రా అందరికీ కావలసిందే. నా యీ కోరిక తీరుస్తారా" అన్నది స్వాతి దిగులుగా అతనివైపు చూస్తూ.

కృష్ణమూర్తి నవ్వుతూ వూరుకున్నాడు. ఒక్క క్షణం ఆగి "ఏమిటా వింత కోరిక స్వాతీ" అన్నాడు.

"ఏమీ లేదండి. అత్తమామల పాదాలమీద పడి వారిని క్షమించమని ప్రార్థించాలని ఉంది. వారి మనస్సులో ఎట్లా ఉన్నా మన భావంలో నేను వారి పెద్ద కోడలినే కదా. ఒక్కసారి మనసారా, ఆదరాభిమానాలతో 'అత్తయ్యా' అని మీ అమ్మగార్ని పిలిచి సంతోషించటానికి అనుజ్ఞ ఇప్పిస్తారా. మన ఉభయులమూ వారి కొడుకూ, కోడళ్ళుగా నలుగురిలోనూ చెప్పుకునే యోగ్యత లేనేలేదు. కనీసం ఈ చిన్న కోరికనైనా మన్నిస్తారని నా ఆశ. జీవితాలు శాశ్వతం కావు మాట మాత్రం కల కాలం ఉండి తరతరాలుగా నిల్చిపోతుంది. ఏమంటారు" అన్నది స్వాతి బిక్కముఖంతో.

ఆశ్చర్యచకితుడయ్యాడు కృష్ణమూర్తి. అప్రయత్నంగానే అతని కళ్ళు చెమ్మగిల్లినయ్యి. శరీరమంతా కంపించినట్లయింది స్వాతియొక్క ఈ కోరిక అతని నరనరాలనూ ఛేదించివేసినట్లయింది. మానసిక వ్యధతో ఆ బాధలు మనస్సులో ఇముడ్చుకోలేక స్వాతి ఇట్లా మాట్లాడుతున్నదా ? ఇంత కాలం నుంచి ఇరువురి హృదయాల్లోనూ పెరిగి పెద్దదైన వ్రణం నేటికి పగిలి బాంధవ్యమూ, రక్తస్పర్శా అనే చీమూ, నెత్తురును బయటికి చిమ్మిందా ? ఈ బాహ్య ప్రపంచంలోని అన్ని రకాల అనుభవాల్నూ, ఈ పదేళ్ళూ అనుభవించాక

54వ పేజీ చూడండి

# ఉసిరిగకాయ ఊరగాయలు : వడియాలు

బి. పద్మావతి.

ఉసిరిగకాయ, చింతకాయ, మామిడికాయలతో నిలవ పచ్చళ్ళు పెట్టుకునే కాలం ఇది. ఉసిరిగ కాయలు విరివిగా దొరుకుతున్నాయి. ఈ కాలంలో నిలవ పచ్చళ్ళు పెట్టుకోని గృహిణే ఉండదు ఉసిరిగ కాయలను అనేక విధాలుగా ఉపయోగించవచ్చు. దీనిలో విటమిను 'సి' అధికంగా ఉంది. రెండు బత్తాయి కాయలు ఒక్క ఉసిరిగ కాయకు సమాన మంటారు. అంటే ఇది మన శరీరానికి ఎంత ఉపకరిస్తుందో వేరే చెప్పనక్కరలేదు. ఇక దీన్ని గురించిన ఉపోద్ఘాతం వదలి అసలు సంగతి చూద్దాం.

వూరగాయ నిలవ పచ్చళ్ళు అనగానే చాల మంది కాయలవీ బజారు నుండి తెచ్చిన తర్వాత పెట్టే జాడీల సంగతి ఆలోచిస్తారు. ఎటూ పచ్చళ్ళు పెట్టే కాలం గనుక ముందుగా వాటిని కడిగి 3, 4 రోజులు బాగా ఎండలో ఉంచి తర్వాత జాడీని ఇంట్లోనే బోర్లించి పెట్టేయాలి. చెమ్మ లేకుండా జాడీ పొడిగా ఉన్నప్పుడే ఈ పని చెయ్యాలి కాయలు తెచ్చుకున్నప్పుడు పొడిగుడ్డతో జాడీని తుడిచేసి పచ్చళ్ళు పెట్టుకోవచ్చు. అంత శ్రద్ధ తీసుకుంటేనే పచ్చళ్ళు ఏడాది పొడుగునా బూజు పట్టకుండా, పురుగు పట్టకుండా ఉంటాయి. మనం పెట్టే డబ్బూ, పడే శ్రమా వృథాకావు.

రెండోది పసుప్పొడి. వూరగాయ చెడిపోకుండా ఉండేందుకు పసుప్పొడి ముఖ్యం. ఏ మాత్రం పసుప్పొడి గాని, ఉప్పుగాని తగ్గినా వూరగాయ చెడిపోతుంది. అందువల్ల ఇంట్లో కొట్టిన పసుప్పొడి నిలవ పచ్చళ్లకు శ్రేష్ఠం. అదీ కాకుంటే పసుపు కొమ్ములు కడిగి ఎండబెట్టి మిషనుకు వేయించిన పొడియైనా జల్లించి వాడినా ఫర్వాలేదు. కొందరు ఇవి రెండూ కాక అంగడి పొడి వాడుతుంటారు. దీన్ని ఎంత వేసినా వూరగాయ పసిమి తిరగదు సరికదా నిలవ ఉండడం కూడ అంతంత మాత్రంగానే ఉంటుంది

ఉసిరిగ కాయకు ఇనుము తగిలితే నల్లగా పోతుంది. కాబట్టి పొన్నులేని రోకలి వాడాలి. లేదా పొన్ను రోకలినే తిప్పి దంచడమైనా చేయాలి.

## ఉసిరిగకాయ ఉప్పు తొక్కు

శేరు ఉసిరిగ కాయలు, $\frac{1}{4}$ శేరు ఉప్పు, $\frac{1}{2}$ పలం పసుప్పొడి.

ఉసిరిగ కాయలు తేగానే కడిగి ఎండలో ఆరబోయాలి. రెండు మూడు ఎండలు ఎండితే కాయ తెల్లబడుతుంది. కడిగి పొడిగా ఉన్న బండమీద వాలుగేసి కాయలుంచి శుభ్రమైన గుండ్రాయితో వీటి నెత్తిపై కొట్టితే ఉసిరిగ కాయ పలుకులు పలుకులుగా విచ్చుకుంటుంది. గట్టి విత్తనం తీసేసి పై మెత్తటి బద్దలు విడిగా బుట్టలోకి తీసి ఉంచుకోవాలి. వీటిని రోట్లో వేసి ఉప్పు పసుపు వేయకుండా మెత్తగా దంచి జాడీలో అదిమి మూతపెట్టి రెండు రోజులు అలాగే ఉంచాలి. ముక్క మెత్త బడుతుంది. దీన్ని మళ్ళీ రోటిలో వేసి ఉప్పు, పసుప్పొడి వేసి ముక్క మెదిగే వరకు దంచితీసి జాడీలో నిలవ ఉంచుకోవాలి. తడి చెయ్యిగాని, తడిరోలు గాని ఉపయోగించ కూడదు. తర్వాత మళ్లీ ఒకసారి మూత తీసి చూడడం అవసరం. బాగా వూరి తేనెలాగ రసం పైకి తేలి ఉంటుంది. కదిలించకుండా మూతపెట్టి తెల్లటి బట్టను జాడీ మూతికి వాసెనకట్టు కట్టి ఉంచితే దుమ్ము, ధూళి పడకుండా ఉంటుంది. పచ్చడి చేసుకోవాలనుకున్నప్పుడు చెమ్మలేని గరిటెతో కొస్త తీసికొని, బాణట్లో మరింత నూనెవేసి తగినన్ని మిరపకాయలు, ఆవాలు, మెంతులు ఇంగువ తిరగ మోత వేయించుకుని, నాలుగు పచ్చి మిరపకాయలు చేసి బండమీద నూరుకుంటే కమ్మగా ఉంటుంది. ఇది ఒక విధం. తడి ఆరిన కాయలను రోట్లోవేసి దంచి పొట్టునంతా చేట లోనికి చెరిగి గింజలు తీసిపారేసి ఈ పొట్టును మళ్ళీ మెత్తగా రోట్లో దంచి జాడీలో అదిమి పెట్టాలి. మూడో రోజున ఉప్పు, పసుప్పొడి వేసి దంచి జాడీలో అదిమి పెట్టి మూత బెట్టాలి. ఈ రెండు విధాల్లో ఎలా చేసినా తడి తగలనంత వరకూ చెడిపోదు. పచ్చడి నల్లబడదు.

## ఉసిరిగ వడియాలు

వడియాలు అనగానే నూనెలో వేయించుకుని తినేవి అనుకునేరు. కొందరు పచ్చడి ఇష్టపడరు. మరి కొందరికి అంటే అమ్మమ్మలు, నాయనమ్మల వంటి వారికి మడితో పెట్టిన పచ్చడిగాని పనికిరాదు. ఏకాదశి, ముక్కోటి, శివరాత్రి లాంటి పుణ్యదినాల్లో పారణ చేసేప్పుడు అప్పటి కప్పుడు పచ్చడికి మడితో పెట్టినపోయినా ఈ వడియాలు పనికి వస్తాయి. ముఖ్యంగా అలాంటి దినాల్లో ఉసిరిగ పచ్చడి వాడాలంటారు.

పై ఉప్పు తొక్కుకు లానే కాయలు ఆరబోసి రెండవసారి దంచేప్పుడు ఉప్పు వెయ్యకుండా, పసుప్పొడి మాత్రం వేసి ముక్క మెత్తబడేవరకు దంచి బత్తాయి కాయంత సైజున ముద్ద తీసుకుని పీట మీద వడలాగ తట్టి మధ్య చిల్లి చేయాలి.. వీటిని వరుసగా రెండు రోజులు ఎండలో బెట్టాలి. తర్వాత అట్లకాడతో వీటిని పైకి లేవదీసి తిరగ తిప్పి ఎండలో బెట్టాలి. తర్వాత కూడ వడియం గట్టిపడేవరకు ఎండలో పెడుతూ బాగ ఎండిన తర్వాత వీటిని ఒక్కొక్కటే దారంలోకి ఎక్కించి భద్రపరచాలి. మనకు కావలసినప్పుడు ఈ వడియాల్ని రోట్లో దంచి పుల్లటి పెరుగులో నాన బెట్టుకోవాలి. ఉప్పుతొక్కులాగే తగినన్ని ఎండు మిరపకాయలు, ఆవాలు, మెంతులు, ఇంగువ, నూనె వేసి పోపు వేయించి, వడియాల్లో ఉప్పు వెయ్య లేదు కాబట్టి తగినంత ఉప్పు చేర్చి పచ్చడి నూరుకుంటే చాల బాగుంటుంది.

## ఉసిరిగ పొట్టు

ఉసిరిగకాయలు కడిగి వారం రోజులు ఎండలో ఆరబొయ్యాలి. ఇవి బాగా ఎండితే వాటికవేపగిలి పై పొట్టు వూడి వస్తుంది. బాగా ఎండిన తర్వాత డబ్బాలో పోసి వుంచుకుంటే పై ఒడియాలకు మల్లే వీటిని కూడా పచ్చడి నూరుకోవచ్చు. లేదా పొట్టు దంపి తలనూనె కాచుకునేప్పుడు ఈ పొడి వేసి కాచుకోవచ్చు.

## ఉసిరిగకాయల పచ్చిపచ్చడి

ఇది ఎక్కువ రోజులు నిలవ వుండదు. అయినా రెండు పూటలు నిలవ వుండేట్లు మన మామూలు పచ్చళ్లకు వలె చేసుకోవచ్చు. బాణట్లో నూనె వేసి కడిగిన ఉసిరి కాయలను వేసి బాగా వాడ్చాలి. వీటిని బండమీద పెట్టి కొట్టి గింజలు తీసేసి పొట్టును పై పచ్చళ్లకు వలె నూరుకుంటే అదీ బాగావే వుంటుంది.

## తిరగమోత ఉసిరిగకాయలు

ఇవి మజ్జిగ అన్నంలో నంచుకునేందుకు పనికి వస్తాయి. ఎక్కువ రోజులు నిలవ వుండవు. ఉసిరి కాయలు కడిగి అక్కడక్కడ కత్తిపీటతో గాట్లు పెట్టాలి. బాణట్లో నూనెవేసి నాలుగు ఎండు మిర్చి, ఆవాలు చిట్లించి కడిగిన ఉసిరి కాయలను వేసి మూత బెట్టాలి. కొంత సేపటికి కాయలు మెత్త బడుతాయి. జాడీలో తగినంత ఉప్పు, స్పూనుడు మిరప పొడి, చిటికెడు పసుప్పొడి, వేసి చల్లారిన కాయలను ఇందులో వేసి మూత బెట్టాలి. బాగా వూరి కాయలు నంచుకునేందుకు బాగుంటాయి. పిల్లలయితే వూరికే తీసేసుకుని తినేస్తుంటారు.

## ఉసిరిగకాయ ఆవకాయ

పెద్ద ఉసిరిగ కాయలలో ఆవకాయ వేసుకుంటారు. ఇది చాలా బాగుంటుంది. పైగా ఎన్ని రోజులున్నా చెడిపోదు. తెచ్చిన వాటిలోనే కొంచెం పెద్దసైజు కాయలు ఏరి వుంచుకుని కడిగి ఆరిన తర్వాత కత్తిపీటతో వీటికి నాలుగయిదు చోట్ల గాట్లు పెట్టాలి. మామిడికాయ ఆవకాయకు లాగే వీటికి కూడా ఉప్పు, కారం, ఆవపిండి ఇవి మూడు సమపాళ్లలో వేయాలి. మెంతులు, ఇంగువ పొడి, కొద్దిగా పసుప్పొడి వేసి వీటిని బాగా గుచ్చెత్తాలి. తర్వాత కొద్దిగా నూనె పోసి తడిపొడిగా కలుపుకుని వాలుగేసి ఉసిరికాయలు పళ్లెంలో వేసుకుంటూ గుచ్చెత్తి శుభ్రమైన జాడీలో వేయాలి. చివర మిగిలి పోయిన పిండిని కూడా వేసేసి, నూనెపోసి మూత బెట్టాలి. ఈ ఆవకాయ నాలుగైదు రోజులకు బాగావూరి ఘుమ ఘుమలాడుతూ ఘాటుగా

# వనితాలోకం

కూడా వుంటుంది. కాయకు గాట్లు పెట్టినందున వుప్పూ కారం ఎక్కి, కాయలోని పులుపు వూట లోకి దిగి ఆవకాయ పుల్ల పుల్లగా కూడా వుంటుంది. కొంతమంది కాయలుగానే వేసేస్తారు. మరి కొందరు బాణట్లో కాయలు వాడ్చి చల్లార్చిన తర్వాత ఉప్పూ, కారం ఆవపిండి పోసి, తిరగమోత (ఆవాలు, మెంతులు) ఇంగువ పొడి వేసి నూనె కాచి పోస్తారు. ఇదీ ఇంకొక రకమే అయినా మొదట రకమంత ఖచ్చితంగా నిలవ వుండే అవకాశం లేదు. కాయలుగానే వేస్తే ఉప్పూ, కారం ఎక్కదు. మొదటి పద్ధతిని ఆవకాయ పెట్టి చూడండి.

## ఉసిరిగకాయలతో తైలం

ఉసిరికాయలు — సేరు
గుంటగలగరాకు — పళ్ళెడు
పొన్నగంటి ఆకు — పళ్ళెడు
కొబ్బరి నూనె — ¼ సీ

ఉసిరికాయలను పిన్నులేని రోకలితో దంచాలి. వచ్చిన వరకే గింజలు తీసేస్తూ మెత్తగాదంచి కళాయి పాత్రలోకి రసం తీయాలి. పిప్పి మళ్ళీ రోట్లో వేసి దంచి నీళ్ళు చేర్చి రసం తీయాలి. అలా సేరు ఉసిరిగ రసం తీసి వుంచుకోవాలి. ఆకులు రెండింటిని కడిగి రోట్లో వేసి మెత్తగా దంచి దీన్ని కూడా రసం తీసి వుంచుకోవాలి. ½ సేరు రసం వచ్చేవరకూ నీళ్ళు చల్లుతూ దంచి రసం తీసి ఉసిరిగ రసంతో పాటు దీన్ని కలిపి, ¼ సీసె కొబ్బరి నూనెను అందులో పోసి కలియ బెట్టి, రెండు మూడు రోజులు కదిలించ కుండా మూతబెట్టి వుంచాలి. తర్వాత ఆ గిన్నెను అలానే కుంపట్లో పెట్టి సన్నటి సెగన నూనె కాచాలి నీరంతా ఇగిరాక నూనె మాత్రం వుండిపోతుంది చిటపటమని చప్పుడు తగ్గాక దించి పెట్టి చల్లార నిచ్చి శుభ్రమైన సీసాలోకి వంచేసి గట్టిగా మూత బెట్టాలి. వేరేగా నూనె తెప్పించుకుని దీన్ని కొద్దిగా అందులో కలిపి తలకు రాచుకుంటే మాడుకు చలవ చేస్తుంది. కండ్లకు కూడా చలవ. ఇది వూరే కొద్దీ సువాసనగా కూడా వుంటుంది. ★



రాణి ఎలిజబెత్ ఈ మధ్యనే మగబిడ్డను కన్నది. బకింగ్‌హాం రాజభవనం నుంచి విండ్సర్ కోటకు వెడుతుండగా ఏప్రిల్ 4న తీసిన ఛాయాచిత్రం ఇది.

# వ ని తా వా ణి

## మధ్యప్రదేశ్‌లో వింత ఆచారాలు

తేది 28—2—64 ఆంధ్ర సచిత్ర వార పత్రికలో "మధ్యప్రదేశ్‌లో వింత ఆచారాలు" శీర్షికతో ప్రచురితమైన వ్యాసం విపులంగా చదివిన మీదట కొంత వింతగా తోచింది. రచయిత్రి శ్రీమతి ఓలేటి సత్యవతీదేవి విషయసేకరణ పూర్తిగా చేసి వ్రాసినట్లు తోచదు.

"గంగా జమున" చలనచిత్రానికి మాటలు వ్రాసిన శ్రీ వజాహత్ మిర్జా లక్నో నివాసి, ఆయన వాడిన భాష ఉత్తరప్రదేశ్‌లో గోరఖ్‌పూర్, మైన్‌పురి, ఇటావా, బరేలీ జిల్లాలకు సంబంధించిన 'పూర్బీ భాష'—చత్తీస్‌గడి మాత్రం కాదు. చత్తీస్‌గడి (చత్తీస్‌గడ్— ముప్పదియారు దుర్గములు) భాష వాడుకలో వుండే ప్రదేశాలు రాయపూర్, దుర్గ్ బిలాస్‌పూర్, రాయఘడ్ మొదలగు జిల్లాలు హిందీలో అటువంటి భాషను "బోలి" అంటారు. తెలుగులో నైతే దేశీయము, ఆంగ్లంలో 'డైలాక్ట్' అంటారు. వ్యాకరణ సూత్రాలచే పాటింపబడవు.

తదుపరి అతిథి ఇంటికి రాగానే గృహిణి వెళ్ళి అతని పాదాలు కడిగి ఆయన మెడుం చుట్టూ చెయ్యి వేసి లోనికి తీసుకువచ్చే ఆచారం 'బుందేల్ ఖండ్' (జబల్పూర్, ఝాన్సీ, మండలా, సాగర్ జిల్లాలు) ప్రదేశంలో జరుగుతున్నది. రచయిత్రి ఈ ప్రదేశములను సూచిస్తూ మరింత విపులంగా వ్రాసి ఉండవలసింది. పాఠకులు గ్రహించగలరని ప్రార్థన.

పమిరి సాంబశివరావు (ఛింద్వాడా)

## వ ని తా వా ణి

"వనితాలోకం" శీర్షికతో బాటు "వనితా వాణి" శీర్షిక కూడా ఎంతో ప్రయోజనకరంగా నున్నది. పలు విషయాల మీద అభిప్రాయాలను వెలిబుచ్చు కొనుటకు "వనితావాణి" శీర్షిక ఎంతో దోహద మిచ్చుచున్నది.

అందువల్ల నేకోరేది ఏమనగా, "వనితావాణి" శీర్షికకు కనీసం ఒక పేజీ అయినా కేటాయించ వలసిందని కోరుతున్నాను. ఆ శీర్షికలో కేవలం "వనితాలోకం" వ్యాసం మీదనే కాక, స్త్రీలకు సంబంధించిన ఇతర అంశాల మీద చర్చకు అవకాశం ఇవ్వగలరని నమ్ముతున్నాను

కె విజయలక్ష్మి (విశాఖ)

## మా క్యాంప్ అనుభవాలు

శ్రీమతి యం. సుగుణ అక్కయ్య వ్రాసిన "మా కాంపు అనుభవాలు" చాలా బాగున్నది అక్కడి పరిస్థితులన్నీ కళ్లకు కట్టినట్లుగానే ఉన్నది ముఖ్యంగా, మాకు కూడా అలాంటి అనుభ వాలే లోగడ జరిగి ఉండటం వల్ల, ఆ వ్యాసం చదివి ఆనందించకుండా ఉండలేక పోయాము. రచయిత్రికి, నా హృదయ పూర్వక నమస్కార ములు చెప్తాను.

యస్. స్వర్ణలత (హైదరాబాదు) ★



**అతను వారి సౌందర్యాన్ని ఆరాధిస్తాడు.**
**వారి కుటుంబమంతా సౌందర్యవంతులు.**

అలాగే ఎప్పుడు అవుతుంది. తల్లి, కూతురు కలిసి ఎప్పుడు కనిపించినా, అందరూ తదేక దృష్టితో చూస్తూ వారి సౌందర్యాతిశయమును గురించి గుసగుసలాడతారు..."అక్క చెల్లెళ్ళు" అని ఎవళ్ళో ఒకళ్ళు తప్పకుండా అంటారు. ఎందు చేతనంటే ఆ తల్లి ఇంకా, ఆకర్షణీయమైన సౌందర్యముతో వుంటుంది. కూతురికి తల్లి యొక్క సౌందర్య రహస్యము తెలియును: ఆమె ఎల్లప్పుడు 'హేజలైన్' స్నో వాడును. దానంతట అది లేక దాని మీద పౌడర్ అద్దినగాని, 'హేజలైన్' స్నో మీ రూపమును కాపాడి అందాన్ని పెంపొందిస్తుంది.




# 'హేజలైన్' స్నో సౌందర్యమును నిలబెట్టును.

('హేజలైన్' కోల్డ్ క్రీమ్ మరియు 'హేజలైన్' టాల్కమ్ పౌడర్ కూడ దొరుకును.)



**బరోస్ వెల్కం & కంపెనీ (ఇండియా) లిమిటెడ్,**
పి. ఒ. బాక్స్ 290, బొంబాయి.1.

BI-BW-19 TEL.

తో తీసుకుని కాలిబాట వెంట నడవటం ప్రారం భించాడు.

ఎక్కడో ఏదో పక్షి అరుస్తున్నది. చల్లనిగాలి విసురుగా వీస్తున్నది. కీచురాళ్ల నిస్వనం నిర్వి రామంగా, కర్ణకఠోరంగా వినిపిస్తున్నది. ఆకాశం మేఘావృతమై నిండు కుండలా ఉంది. ఇంతకు ముందు ఎర్రగా రక్తకాంతులతో ప్రకాశించిన నక్షత్రం కూడా ఇప్పుడు మబ్బుల మాటున చిక్కుబడిపోయింది. కాలిబాట కుడివైపున దూరంగా కనిపిస్తున్న ఎత్తయిన చెట్ల గుంపు, ఏదో భయంకర మృగం కూర్చుని ఉన్నట్టుగా ఉంది. రాజారావుకు అటు చూస్తే వొళ్లు జలదరించింది.

కొద్ది దూరం నడిచిన తర్వాత అతడు భయంతో కెవ్వుమన్నంత పని చేశాడు. కాలికి ఏదో చుట్టుకున్నది. అతడు వొంగి దాన్ని చేతితో విదిలించబోయాడు. అది అతని చేతికి చుట్టుకున్నది. అతడు నెమ్మదిగా గుండె దిటవు చేసుకుని దాన్ని కళ్లకు దగ్గరగా ఉంచి చూశాడు. అది పాము కుబుసం. పొడుగైన సిల్కు గుడ్డ పేలికలా ఉంది. అతడు తనలో తను నవ్వుకుని దానిని పక్కకు విసిరివేసి మళ్లీ నడవటం ప్రారం భించాడు. కొద్ది గజాలు నడిచి జేబులో నుంచి సిగరెట్టు తీసి కాల్చుకున్నాడు ఆ వెలుతురులో చూస్తే పై ట్రేడ్‌మార్కు కాయితం చింపి వేయబడిన ఆ అగ్గిపెట్టెలో మరి రెండు పుల్లలు మాత్రమే ఉన్నాయి. సిగరెట్లు ఫరవాలేదు. నిండు పెట్టెలో తానిప్పటికి మూడు మాత్రమే కాల్చాడు.

అతని కెదురుగా ఆకాశంలో పైనుంచి క్రింది వరకూ పెద్ద వెలుగురేఖ గీచినట్టు మెరుపు మెరిసింది. నల్లని ఏనుగుల వలె ఉన్న మబ్బులు ఆకాశరాజ్యంలో కొలువుదీరి 'మన ప్రతాపం ఎప్పుడు ప్రదర్శించాలి ?' అనే విషయంమీద సమాలోచనలు జరుపుతున్నట్టున్నాయి. చల్లని గాలి ముందునుంచే తన ప్రయత్నం ప్రారం భించి కత్తిలాగా చురుకుగా వేగంగా వీస్తున్నది.

రాజారావు మనస్సులో ఇప్పుడివేవీ లేవు. అతడు యంత్రవతుగా కాలిబాట వెంట నడిచి పోతున్నాడు. ఆ నడక యిప్పు డంత బాధగా లేదు. బయట చలిగాలి కత్తిలాగా తన ప్రతాపం చూపుతూ వీస్తున్నప్పటికీ అతని మనసుతో వెచ్చగా ఉంది. అందుకు కారణం వరలక్ష్మి. ఆపిల్ల ఇప్పు డతని మనసులో బంగారపు బొమ్మలా మెదలుతున్నది. ఇంతవరకూ జరిగిపోయిందేదో జరిగిపోయింది. కాని యిక అలా వీలులేదు. వర లక్ష్మి తనది కావాలి. ఎప్పుడో ఏదో సందర్భంలో తన తల్లి వర్ణించి చెప్పిన వరలక్ష్మి రూపు తన మనసులో హత్తుకుపోయింది. ఆమె దివ్యసుందరి వలె వెలుగులు చిమ్ముతూ తన మనసులో అత్యంత మనోహరంగా నిలబడి ఉండగా బయటి ప్రపంచం లోని క్షుద్రమైన చలిగాలి వొడిపోక ఏంచేస్తుంది?

రాజారావు గర్వంగా వూపిరి పీల్చాడు. 'వరలక్ష్మి తనది' అనే భావం అతనికి ఎంతో సంతృప్తి కలిగిం చింది అతని నడక వేగం హెచ్చింది. హుషారుగా ఋూల వేస్తూ త్వర త్వరగా నడవసాగాడు.

* * *

అతడు అగ్గిపుల్ల వెలుతురులో చేతిగడియారం చూసుకుని "పదిన్నర .... అంటే నాలుగు మైళ్లూ గంటన్నరలో నడిచా మన్నమాట" అనుకున్నాడు.

## గాలివానకథ ప్రారంభం :

అతడిప్పుడు వూరు చేరుకుని దేవాలయం ముందు నిలబడి ఉన్నాడు. అంత చీకటిలోనూ దేవాలయం గోడమీద ఉన్న ఎరుపు తెలుపు చారలు కనిపిస్తూనే ఉన్నాయి. లోపలి నుంచి ఎవరిదో దగ్గు వినిపిస్తున్నది.

రాజారావు ముందుకు అడుగు వేయబోయిన వాడల్లా చివాలున ఆగిపోయాడు. అతని ముంజేతి మీద పెద్ద వర్షపు చినుకు ఒకటి పడింది. మరి కొద్ది క్షణాలలోనే తన నెవరో తరుముకుని వచ్చి నట్టు హఠాత్తుగా పటపట భీకరంగా వర్షం పడటం ప్రారంభించింది. అతడు తటాలున గుడి లోపలికి పరుగెత్తి మంటపంలో తలదాచు కున్నాడు. అయినా ఈ కొద్ది గజాలు పరుగెత్తి వచ్చే లోపలే వర్షం అతని తడిపివేసింది. ఆ కొప్పె పటిలోనే కంకరరాళ్లతో కొట్టినట్టయింది.

అతడు మంటపంలో నిశ్చలంగా నిలబడి పైనుంచి పడుతున్న వర్షపు ధారల వంక చూస్తూ ఉండిపోయాడు. మంటపంలో ఉన్న చిన్న దీపపు ప్రమిద వెలువరిస్తున్న మందమైన కాంతిలో కింద కొంత మేర కనిపిస్తున్నది కొద్ది నిమిషాల వానకే మండటపం ముందు నీళ్లు నిలిచాయి. ఇంకా వర్షం దారుణంగా చప్పుడు చేస్తూ కుంభ



పొలిగా పడుతూనే ఉన్నది. ఇప్పట్లో అది తగ్గే సూచన లేవీ కనిపించటంలేదు.

రాజారావు స్తంభాని కానుకుని కూర్చున్నాడు. అతనికి నిద్ర రావడం లేదు. నిజానికి పరాయి చోట్ల అతడికి ప్రాణాంతకంగా ఉంటుంది. అసలే కొత్త వూరు.... అర్ధరాత్రివేళ .... కటిక చీకటి.... పైనుంచి దారుణమైన వాన.... ఇన్నిటితో అతని మనసు కకావికలైంది. ఒకవేళ వర్షం తగ్గినా తనకు తనవారి ఇల్లు తెలియదు. ఎవరినైనా వాకబుచేసి కనుక్కుని వెళ్లాలి. ఈ అర్ధరాత్రి వేళ తనకు ఎవరా సహాయం చేయగలరు ? ఇంతకు ముందు ఈ దేవాలయం లోపలి నుంచి ఎవరిదో దగ్గు వినిపించింది. ఇప్పు డిక్క డెవ్వరూ లేరు. అదేమి చిత్రమో !

రాజారావు జేబులో నుంచి సిగరెట్టు పెట్టె తీశాడు. చివరి సిగరెట్టు ఒకటి మాత్రం మిగిలి ఉంది. మిగిలినవన్నీ అయిపోయాయి. అగ్గిపెట్టె లేదు. అది దోవలోనే అయిపోయింది. అతడు చింతతో ఒక్క క్షణం అలాగే కూర్చున్నాడు. తర్వాత అతని దృష్టి గూటిలో వెలుగుతున్న ప్రమిద మీద పడింది. విసురు గాలికి అవసోపాలు పడుతూ మంద మందంగా వెలుగుతున్న దది. బహుశా కొంతసేపటికి ఆరిపోతుందేమో !

అతడు చుట్టూ చూశాడు. ఎవ్వరూ లేరు. ఏ అలికిడీ లేదు. ఒక్క క్షణం ఆగి నెమ్మదిగా లేచి గూటి దగ్గరికి వెళ్లి సిగరెట్టు ముట్టించుకో బోయాడు. కాని అంతలోనే అది అతన్ని హఠాత్తున్నే చేసి, ఒక విసురుగాలి అలకు లొంగి ఆరి పోయింది.

అతడు 'ఉస్సు' రని నిట్టూరుస్తూ వెను దిరిగి ఆగిపోయాడు. తా నింతకు పూర్వం కూర్చున్న స్తంభానికి ఎదురుగా ఇప్పు డెవరో కూర్చుని ఉన్నారు. అతడు ముందుకు అడుగు వేస్తూనే 'ఎవరది ?' అన్నాడు. అటువైపు నుంచి కూడా అదే సమయంలో అదే ప్రశ్న వచ్చింది. ఆ మనిషి మోకాళ్లచుట్టూ గుడ్డ కప్పుకుని కూర్చుని ఉన్నాడు.

రాజారావు ముందుకు వచ్చి తన సంచి పక్కన కూర్చుని "నేని వూరికి కొత్తవాణ్ణి. ఇంతకుమును పెప్పుడూ ఇక్కడికి రాలేదు ..." అన్నాడు.

అవతలి వ్యక్తి 'ఓహో' అని మాత్రం అని వూరుకున్నాడు. ఇంకేమీ మాట్లాడలేదు. రాజా రావుకు అత డిప్పుడు మరింత స్పష్టంగా కనిపి స్తున్నాడు. అతడు ముదుసలి.... అరవై ఏళ్ల వయస్సుండవచ్చు. అయినా దృఢకాయుడు. గడ్డమూ, మీసాలూ బాగా పెరిగి ఉన్నాయి. అతని కన్నులు చాలా చురుకుగా చూసే లక్షణం కలవి. అతడు ఒక్కసారి గడ్డం చేత్తో నిమురుకుని కప్పు కున్న గుడ్డను సరిగా సర్దుకున్నాడు.

తర్వాత కొద్దిసే పాగి అతడు "ఎవరి ఇంటికి వెళ్లాలి మీరు ?" అని ప్రశ్నించాడు. అతని కంఠస్వరం చిత్రంగా ఉంది. తుప్పు పట్టిన ఇనుప గొలుసులను కదిలించినట్టున్నది.

రాజారావు ఆ ప్రశ్న విని సర్దుకుని కూర్చుంటూ "రాఘవయ్య గారని .... వైద్యు డున్నాడే .... వారి ఇంటికి వెళ్లాలి...." అన్నాడు.

అది వింటూనే అవతలి వ్యక్తిలో విచిత్ర మైన సంచలనం కనిపించింది. ఒక్క క్షణం ఆగి చిత్రమైన కంఠస్వరంతో 'మీకు తెలియదా?' అని అడిగాడు.

రాజారావుకు అర్థంకాలేదు. అర్థంకానట్టు గానే చూసి "ఏమిటి తెలియడం?" అని అడిగాడు.

ఆ వ్యక్తి మాట్లాడలేదు. రాజారావు వంక తీక్షణంగా చూస్తూ అలాగే కొద్దిక్షణాల సేపు నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

రాజారావు మళ్లీ "ఏమిటి? చెప్పరేం?" అని అడిగాడు. అది విని అవతలి వ్యక్తి నెమ్మదిగా గొణుగుతున్నట్టు "మీకు తెలియదూ? ఆయన యిటీవలే చచ్చిపోయారు." అన్నాడు.

రాజారావు ఆశ్చర్యంతో తలఎత్తి "ఏమిటి? చచ్చిపోయాడా ఆయన?" అతని గొంతు ఒణికింది. అవతలి వ్యక్తి ఒక్క క్షణం ఆగి "చచ్చిపోవడం కాదు,

ఆయన్ను ఎవరో చంపేశారు. దారుణంగా చంపేశారు అన్నాడు. రాజారావు మొహంలో విపరీతమైన ఆశ్చర్యం ప్రస్ఫుటమైంది ఆ వ్యక్తి, అతని ఆశ్చర్యం గమనించాడు

రాజారావు ఆందోళనతో కూడిన కంఠస్వరంతో "ఏమిటది? ఆయన్ను చంపేశారా? ఎవరు? ఎందుకు?" అని ప్రశ్నల వర్షం కురిపించాడు.

ఆ వ్యక్తి గంభీరంగా "అవును. ఆయనను హత్య చేశారు. అదీ పరమ దారుణంగా చేశారు. మీకు తెలిసే ఉంటుంది. ఆయన యీ ప్రాంతంలో ప్రసిద్ధి పొందిన వైద్యుడు. ఎక్కడెక్కడి నుంచో ఏవేవో మూలికలు సంపాయించి తెచ్చి వైద్యం చేస్తూ ఉండేవాడు. ఆ హస్తవాసి ఎటువంటిదోగాని ఎటువంటి మొండి రోగమైనా ఆయన పేరు వినబడితే ఆమడ దూరం పారిపోయేది ఆయన ఒక్కొక్కప్పుడు తనకు కావలసిన మూలికలకోసం చీకటి రాత్రులలో ఎంతెంతో దూరం జనసంచారం లేనిచోట్ల నడిచిపోయేవాడు. మొన్ననూ అలాగే వెళ్ళాడు అలా వెళ్ళిన వాడు తిరిగిరాలేదు. దానితో అందరికీ ఆదుర్దా కలిగి, వెదికితే ఇక్కడికి మూడు మైళ్ల దూరంలో ఎవరూ, ఎన్నడూ వెళ్లని ఒక చోట చచ్చి పడి ఉన్నాడు ఎవరో ఆయన కొడవలితోనే ఆయన కంఠం తెగనరికి చంపేశారు. శవమూ, దాని పక్కన కొడవలీ కనిపించాయి. ఆయన ప్రాణాలు వదిలేటప్పుడు చేతిలో పచ్చని కొమ్మలు కొన్ని ఉన్నాయి. ఆ చేతులలాగే బిగుసుకు పోయి ఉన్నాయి. అని చెప్పాడు

రాజారావు అంతావిని స్థాణువైపోయాడు. అది చూసి ఆ వ్యక్తి "నిజమే! ఎవరికైనా అటువంటి మంచి మనిషి పోయాడని విన్నప్పుడు బాధ కలుగుతుంది అందునా యిది దారుణమైన హత్యకావడం మరింత విచిత్రం.. ఇంతవరకూ ఆ వ్యవహారం ఆనుపానులు ఏదీ లేదు పోలీసులు వచ్చి పంచాయితీ జరిపి కేసు నమోదు చేసుకుని వెళ్ళారు. కానీ నాకు నమ్మకంలేదు. ఆ హంతకుడు దొరుకుతాడని నాకు ఏకోశానా ఆశలేదు. ఎందుకంటే హత్య జరిగిన చోట గాని ఆ ప్రాంతాలలోగానీ ఏ విధమైన గుర్తులూ లేవు....." అన్నాడు.

బయట వర్షం తగ్గలేదు. సరిగదా, మరింత విజృంభించింది. కొద్ది క్షణాల సేపు ఆ యిద్దరి మధ్యా నిశ్శబ్దం రాజ్యం చేసింది. చివరకు రాజారావు నూతిలో నుంచి మాట్లాడుతున్నట్లు "అయితే ఆ దారుణం ఎవరు చేసి ఉంటారో వూహించలేమా?" అన్నాడు

ఆ వ్యక్తి "అంటే," అని అడిగాడు.

రాజారావు "అంటే ఏంలేదు ఎవరైనా ఆయన మీద పగ తీర్చుకునేందుకుకో లేకపోతే ఆయనను చంపినదువల్ల ఏదైనా లాభం కలిగితేనో అటువంటి పని చేసి ఉంటారు. ఇప్పుడల్లా అనుమానించ తగిన వారెవరూ లేరా?" అని అడిగాడు.

ఆ వ్యక్తి కొద్దిసేపాగి మందహాసం చేశాడు. "అవును.... అటువంటి అనుమానం గావడం సహజమే. కాని యిక్కడ అందుకు ఆస్కారం లేదు. ఆయన మీద పగబట్టిన వారెవరూ లేరు. కాకపోతే పడని వాళ్లుండటంలో ఆశ్చర్యం లేదు. మనలో ఎవరూ అజాత శత్రువులు కారుగదా! ఆయనకూ మనలాగే హితులూ, పడని వారూ ఉన్నారు. అయితే యింత దారుణంగా పగ తీర్చుకోవలసిన అవసరం ఆయన పరమ విరోధులకు కూడా ఉండదని నా ఉద్దేశ్యం....ఉదాహరణకు యీ వూరి మునసబుగారున్నారు. ఒకప్పుడు ఇద్దరూ అతి సన్నిహితులు. అయినా సంవత్సరం క్రిందట వారిద్దరికీ చెడింది మాటా మాటా పెరిగింది. ఒకరితో ఒకరు మాట్లాడుకోవడం మానేశారు. ఈ హత్య తర్వాత మునసబుగారు ఎంతో ఆందోళన పడి వారి యింటికి వెళ్ళి దగ్గరి బంధువులకన్నా ఎక్కువగా సహాయం చేశాడు......"

రాజారావునెమ్మదిగా తనలో తాను గొణుక్కున్నట్టు "ఏమో! ఎవరూ అనుమాన పడకుండా ఉండేందుకు నలుగురిలో అలా నటిస్తున్నాడేమో!" అన్నాడు. ఆ వ్యక్తి వినిపించుకున్నట్టు లేదు. మళ్ళీ "ఇక ఆయన మరణంతో లాభంపొందే వారున్నారా అంటే — ఏమో చెప్పలేము. అటువంటి మహత్తర హస్తవాసి కలిగిన వైద్యుణ్ని చంపుకుంటే ఒరిగేదేమీ లేదు.. ఇక వారికి 'నా' అన్న వారెవరూ దగ్గరలో ఉన్నట్టు లేదు...ఆయనకు ఒక చెల్లెలున్నట్లు ఆమె అన్నగారి మాట వినక బాంధవ్యం కూడా ఒదులుకుని తనదారిన పోయినట్టు విన్నాను. వారికీ వీరికీ చాలా సంవత్సరాలనుంచి రాకరాకపోలు కూడా లేవుట..... .." అని చెప్పాడు

వర్షం తగ్గింది చూరు చినుకులు మాత్రం పై నుంచి బొట్టు బొట్లుగా యింకా పడుతూనే ఉన్నాయి. ఆ యిద్దరూ వ్యక్తులూ నిశ్శబ్దంగా కూర్చున్నారు. రాజారావు చేతిలోని సిగరెట్టు నలిపి విసిరి దూరంగా పారేశాడు. కొన్ని నిముషాల తర్వాత అతడెంతో వ్యథతో నిట్టూర్చి "అయ్యో ఎంత పని జరిగి పోయింది!" అనుకున్నాడు

ఆ వ్యక్తి "అవును. చాలా దారుణమైన విషయమే జరిగిపోయింది. అన్నట్టు యింతవరకూ అడగుదామనుకుంటూనే మరిచిపోయాను. మీరెవరో చెప్పారు కారు." అన్నాడు.

రాజారావు నడుం వాలుస్తూ "నే నాయన మేనల్లుణ్ని......అంటే యిందాక మీరు చెప్పారే... ఆమెకు ఒక్కగానొక్క, కొడుకును....." అని చెప్పాడు.

ఈసారి ఆశ్చర్యంపోవడం అవతలి వ్యక్తి వంతు అయింది. అతడు కొన్ని నిముషాలాగి "వర్షం తగ్గి పోయిందికదా! వారి యిల్లు చూపిస్తాను..వస్తారా?" అని అడిగాడు

రాజారావు మాటువలకలేదు. అటువంటి గాఢమైన మనస్సితో మునిగిపోయాడు.

* * *

అతనికి మెలకువ వచ్చి కళ్ళు తెరవగానే ఎదురుగా ఆ వృద్ధుడు కనిపించాడు. అతడు తనవంకకే చూస్తూ ఉండటం కూడా అతడు గమనించాడు. తర్వాత ఆవులిస్తూ గడియారం చూసుకున్నాడు. అయిదు గంటలయింది.

ఆలయం ఆవరణలో బాగా నీళ్ళు నిలిచి ఉన్నాయి. రాత్రి అంత దారుణమైన వర్షం పడిందన్న మాట! పక్షులన్నీ రెక్కలు టప టప కొట్టుకుంటూ హడావిడిగా ఆహార సంపాదనలో బయలుదేరి పోతున్నాయి.

రాజారావు సంచి చేతిలోకి తీసుకుని వృద్ధుడి వంక చూశాడు. అతడు లేచి "వస్తారా? వారి ఇల్లు చూపిస్తాను...." అన్నాడు

రాజారావు మెట్లు దిగుతూ జాలిగా "నేను గంపెడాశతో యిక్కడికి బయలుదేరి వచ్చాను. మామయ్యను చూసి 'గతమంతా మరచి పొమ్మని ఎన్నెన్నో చెప్పాలనుకున్నాను. నిజానికి మామధ్య పాత మనస్పర్థలకు కారణమైన మా అమ్మ ఎలాగా పోనే పోయింది 'ఇక అనవసరమైన పట్టుదలలూ, భేషజాలూ ఎందుకు? జరిగి పోయిందేమో జరిగి పోయింది....' అని ప్రాధేయ పడుదామనుకున్నాను. మామయ్యను నేనెప్పుడూ చూడక పోయినా మా అమ్మ అప్పుడప్పుడు చెప్పినదాన్ని బట్టి ఆయన ఆమె విషయంలో పైకి అలా కఠినంగా యిష్టం లేనట్టు ఉండేవాడే తప్ప లోలోపల మాపట్ల ప్రేమాభిమానాలతో ఉండేవాడని కూడా నాకు తోచింది. అందువల్లనే యిప్పుడూ ఆయనను చూడకపోయినా యీ వూరెప్పుడు రాకపోయినా, నాకాయనపట్ల అభిమానం ఉండేది. సరే..., యిక ఎలాగూ దాటి పోయాడు....అత్తయ్యనూ, వరలక్ష్మిని అయినా చూసి పలకరించి యీ దీనావస్థలో నాదరి నాదుకోకపోతే ఎలా?" అన్నాడు

చల్లని గాలి విసురుగా వీస్తున్నది. సూర్యబింబం ఉదయిస్తున్నది. ఎర్రని ఉల్లిపొర వంటి వస్త్రం మడతలలో దాచి ఉంచబడిన పెద్ద వజ్రం వలె సూర్య బింబం జాలార్ద్రమైన మేఘ సమూహంలో ఉదయిస్తున్నది. పలుచని కాంతులు ప్రాగ్దిశనంతటినీ ఎర్రగా స్ఫురింపచేస్తున్నాయి. గత రాత్రి దారుణ



# అసురసంధ్య

వర్షానికి తడిసి పొడైపోయిన తమ గూళ్లలోనే ఉండి శకుంత సంతానం రొదచేస్తున్నది.

వీధి మలుపులో ఒక వ్యక్తి ఎదురై వారిద్దరినీ ఎగాదిగా చూశాడు. రాజారావు వెంట ఉన్న వృద్ధుడా వ్యక్తికి నమస్కరించాడు. ఆయన ఆజానుబాహువు. చేతిలో కర్ర ఉంది. కళ్లలో ఎర్రని జీరలు మనిషి లోని కాఠిన్యాన్ని చెప్పక చెబుతున్నాయి. ఆయన వృద్ధుణ్ణి కళ్ళతో పలకరించాడు. కళ్ళతోనే ప్రశ్నలు వేశాడు. వృద్ధుడు రాజారావును చూపించి "రాఘవయ్యగారి మేనల్లుడు వీరు ...నిన్న రాత్రి ఆలయంలో వర్షంలో చిక్కుబడిపోయారు. ఇల్లు చూపించేందుకు తీసుకువెడుతున్నాను ..." అన్నాడు. తర్వాత రాజారావు వంక తిరిగి అతడు "వీరు ఈ వూరి మునసబుగారు......" అని పరిచయం చేశాడు.

రాజారావు ఏమీ మాట్లాడలేదు. మునసబు ఒక ఒక్కసారి గొంతు సర్దుకుని "మిమ్మల్ని గురించీ, మీ అమ్మగారిని గురించీ రాఘవయ్య అప్పుడప్పుడు మాతో చెబుతూ ఉండేవాడు. "పాత మనస్పర్థలు యింకా ఎందుకు? చక్కగా కలిసి మెలిసి ఉండరాదా? అని నేను కొన్ని సార్లన్నాను కూడా అయినా ఆయన కూడా మహా పట్టుదల మనిషి. మనసు అనుకోవాలేగాని బ్రహ్మదేవుడు దిగి వచ్చినా తన పట్టుదల మార్చుకునే వాడు కాదు నిజానికి నాకూ ఆయనకూ యిటీవల అట్టే స్నేహం లేదు ఒక విషయంలో తగవు వచ్చి ఆయన నాతో పల్లెత్తి మాటాడకుండా భీష్మించుకుపోయాడు. అయితే అటువంటి మనుషులతో వ్యవహరించడం నాకు బాగా తెలుసుననుకోండి. ......ఏది ఏమైనా ఆయన మంచి వైద్యుడు.. అటువంటి వైద్యుణ్ణి పోగొట్టుకుని వూరునష్టపడిందనే చెప్పాలి. అంతే గాకుండా అది భయంకరమైన హత్యకావడం వల్ల వూళ్లో అందరికీ హడలుగా ఉంది రాత్రిళ్లు బయటికి రావడానికీ, పొలం పనులకు పోవడానికీ జనానికి భయంగా ఉంది. తోడు లేకుండా ఎవరూ ఎటూ కదలటం లేదు.. ..." అంటూ ఆగి "అన్ని సంగతులూ మిమ్మల్ని నిలబెట్టి మాట్లాడివేశాను. రండి....వారి యింటికి పోదాం మిమ్మల్ని అక్కడ విడచి నా పని మీద నేను పోతాను" అంటూ వెనుదిరిగాడు.

రాజారావు పరిశీలనగా చూశాడు 'మునసబు తొణుకూ బెణుకూ లేకుండా మాట్లాడ గలమనిషి' అని అనిపించింది. అతడు నిట్టూర్చాడు.

వారు ఒక యింటి ముందు ఆగారు. అది ఒక పెద్ద పెంకుటిల్లు. వాకిట్లో ఆవరణ ఉంది. ఒక వైపు చుట్టు పాక ఒకటి ఉంది.

మునసబు "ఒక్క క్షణం ఉండండి. నేను వెళ్ళి ముందు చెప్పి వస్తాను." అని వీరిద్దరినీ ఆవరణలో నిలబెట్టి "సుభద్రమ్మా" అని పిలుస్తూ లోపలికి వెళ్ళాడు.

రాజారావు చిత్రమైన అనుభూతిని పొందుతున్నాడు. ఎన్నో ఏళ్ల తర్వాత రక్త సంబంధీకులను కలుసుకుంటున్న ఆనందం అతనిలో కలిగి మ...

47 వ పేజీ చూడండి

**24-4-1964 శుక్రవారము మొదలు**
**30-4-1964 గురువారము వరకు**

### మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఫలితం తక్కువైనా చేతినిండా పని మాత్రం ఉంటుంది. ఏ వ్యవహారమూ ఎంతో వ్యయ ప్రయాసలు పొందిన తరువాత గాని సాధించలేరు. వృత్తి వ్యాపారాల్లో వారాంతంలో కొన్ని అనుకూలమైన మార్పులు జరుగగల సూచనలు ఉన్నాయి. స్థిరాస్తి వ్యవహారాల్లో ఉన్న అనిశ్చిత పరిస్థితులు తొలగిపోతాయి. వారం ప్రారంభంలో కొంత అనవసరమైన ఖర్చు చేయవలసి రావడం వలన డబ్బుకు కొంత ఒత్తిడి రావచ్చును. రాజకీయాల్లో ముమ్ముందు బాగా రాణించుటకు అవకాశాలు ఇప్పుడు ఏర్పడుతాయి. అధికారుల వలన అనుకూలత లభిస్తుంది. బంధువులకు సంబంధించిన వ్యవహారాల్లో కొన్ని వూహించని మార్పులు వచ్చి మీకు ఆందోళన కల్గించవచ్చును. మిగిలిన వ్యవహారాలు ఎలాగ ఉన్నా ఆరోగ్యం విషయంలో జాగ్రత్త వహించాలి. వారాంతంలో అనారోగ్య సూచనలు.

* * *

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

వృత్తి వ్యాపారాలు ఒడుదుడుకులు లేకుండా సాగిపోతాయి. భాగస్థులతో కలిసి చేసే వ్యవహారాలు కొంతకాలంపాటు వాయిదా వేయడం మంచిది. మీరు ఇదివరకు నిర్లక్ష్యం చేసిన వ్యవహారాలకు ఇప్పుడు ప్రాముఖ్యత రావడం వలన కొంత పశ్చాత్తాపం పొందవలసి వస్తుంది. ఉద్యోగస్థులకు అనుకూలంగా మార్పులు రాగల సూచనలు ఉన్నాయి. ఆర్థిక వ్యవహారాలు అంత అనుకూలంగా ఉండవు. రావలసిన డబ్బు కూడా అందక ఇబ్బంది పడతారు. వారం మధ్యలో కొన్ని అనవసరమైన సందేహాలు వచ్చే పరిస్థితులు ఏర్పడతాయి. దానివలన మీరు సాహసించి ఏపనీ చేయలేరు. కుటుంబ పరిస్థితుల్లో మార్పులు జరుగవు. శుభకార్యాల విషయంలో మీ ఆలోచనలు ఇంకా ఒక దారికి రావు. సాహిత్య కళా రంగాల్లో మీ కృషికి ఆటంకాలు రావచ్చును. 28, 29 తేదీల్లో సంతోషం.

* * *

### మిథునం :

(మృగశిర 3, 4 పా. ఆర్ద్ర పునర్వసు 1, 2, 3 పా.)

అన్ని విధాలా మీ ఆలోచనలు ఫలించే సమయం. వృత్తి వ్యాపారాలలో మీరు ఎదురుచూడని మార్పులు జరిగి అభివృద్ధికి దారి ఏర్పడుతుంది. వ్యాపారస్థులకు ఆకస్మిక ధనలాభం కలుగుతుంది. సాహసిక వ్యాపారాల్లో కూడా కొంత లాభించగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగస్థులకు తమ ఆలోచనలు అమలు జరుపడానికి అవకాశాలు లభించడం వలన అధికారుల ఆదరణ పొందుతారు. కోర్టు వ్యవహారాల్లో మాత్రం అభివృద్ధి కన్పించదు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. వారాంతంలో స్వల్ప అనారోగ్యం చేయవచ్చును. కుటుంబ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. సాంఘికంగా హోదా లభిస్తుంది. అన్ని రకాల వ్యక్తులతో వ్యవహరించవలసి వస్తుంది. ప్రయాణాలోచనలు వాయిదా వేయడం మంచిది.

* * *

| కు | ర బు గు | శు | రా |
|---|---|---|---|
| శ | వారఫలం | | |
| | | | |
| కే | | | చం |

## వారఫలం

**మహేష్**

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష )

మీకు తెలియకుండానే వృత్తి వ్యాపారాల్లో కొన్ని మార్పులు వస్తాయి. వాటివల్ల ప్రస్తుతం ప్రయోజనం లేకపోయినా తరువాత వాటి ఫలితం అనుభవిస్తారు. అధికారుల వలన జరుగవలసిన పనులు విశేషమైన శ్రమ లేకుండా నెరవేరుతాయి. ఏదో డబ్బు అందుతూ ఉండడంవలన ఆర్థికంగా ఇబ్బంది పడవలసిన అవసరం ఉండదు. ఇంతవరకు కృషిచేస్తున్న బంధువుల కార్యాల్ని పూర్తిచేయ కలుగుతారు. ఆరోగ్యం బాగానే ఉంటుంది గాని, నిర్లక్ష్యం చేయడం తగదు. సాంఘిక వ్యవహారాల్లో మీరు పదిమంది దృష్టినీ ఆకర్షిస్తారు. బాధ్యతతో కూడిన పనిని నిర్వహించగల సూచనలు ఉన్నాయి. అన్ని వ్యవహారాలూ బాగా ఉన్నా మానసికంగా ఇంకా శాంతి లభించదు. అన్నివిధాలా యోగించే సమయం.

* * *

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

సులభంగా జరుగవలసిన పనులకు గూడా ఆటంకాలు రావడం వలన చికాకు కలుగుతుంది. వృత్తి వ్యాపారాల్లో అనుకూల వార్తలను వింటారు. ఉద్యోగస్థులకు వెంటనే ఏమీ ప్రయోజనం లేకపోయినా వారి కృషి అధికారుల దృష్టిని ఆకర్షిస్తుంది. వ్యాపారస్థులకు సమయానికి డబ్బు అందక తాత్కాలికంగా ఇబ్బంది కలుగుతుంది. స్థిరాస్తి వ్యవహారాల్లో ఇంతవరకూ ఉన్న ప్రతికూల పరిస్థితి తొలగిపోతుంది. ఆరోగ్యం వారాంతం నుంచి బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో మార్పులు రావు గాని, పిల్లలకు కొంచెం అనారోగ్యం చేయవచ్చును. సాంఘిక కార్యక్రమాల్లో కొంత ఒత్తిడి రావడం వలన కొంత శ్రమా ప్రతిష్టా కలుగుతాయి. పుణ్య కార్యక్రమాల్లో పాల్గొంటారు. మఘా నక్షత్ర జాతకుల ఆరోగ్యం మిగిలినవారి కంటే బాగా ఉంటుంది. 24, 25 తేదీల్లో ధనలాభం, గౌరవం.

**ఈ వారము ధరలు**

ధాన్యం ధరలో కొంచెం హెచ్చు తగ్గులు రావచ్చును. కందులు, పెసలు మొదలైన అపరాల ధరలు నిలకడగా ఉండి వారాంతంలో కొంచెం పెరుగుతాయి. బెల్లం ధర కొంచెం పెరుగుతుంది. నూనె, నువ్వుల ధర పెరిగి తరువాత తరుగుతుంది. బట్టల ధరలు పెరుగుతాయి.

* * *

### కన్య :

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ఈ వారం సంతృప్తికరంగా ఉంటుందని చెప్పడానికి అవకాశం లేదు. వృత్తి వ్యాపారాల్లో అకస్మాత్తుగా కొన్ని చిక్కులు ఏర్పడి ధన నష్టం కాగల సూచనలు ఉన్నాయి. అధికారులతో అభిప్రాయ భేదాలు వస్తాయి. ఇంతవరకు మీకు అనుకూలంగా ఉన్నవారు కూడా వ్యతిరేకులతో చేతులు కలపడం వలన మీకు మనశ్శాంతి లేకుండా పోతుంది. కోర్టు వ్యవహారాల్లో శత్రు ప్రాబల్యం పెరుగుతుంది. క్రొత్త వ్యవహారాలు ప్రారంభించి భాగస్థులతో కలసి వ్యాపారం చేయడానికి ఇది ఎంతమాత్రము సమయం కాదు. ఆరోగ్యం విషయంలో శ్రద్ధ చాలా అవసరం. కుటుంబ వ్యవహారాలు మామూలుగా ఉంటాయి. రాజకీయాల్లో కూడా ఒడుదుడుకులు రావచ్చును. ప్రయోజనం లేని ప్రయాణాలు చేయవలసి వస్తుంది. ఈవారం మీ ఓర్పుకు, నేర్పుకు పరీక్షా సమయం.

* * *

### తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)

మీరు ఇంతవరకూ పొందుతున్న మానసికాందోళన నుంచి కొంత విముక్తి లభిస్తుంది. వృత్తి వ్యాపారాల్లో స్నేహితుల సహాయం వలన కొంత అభివృద్ధిని సాధిస్తారు. ఆర్థికంగా ఇంతవరకూ ఉన్న ఒత్తిడి కూడా చాలవరకు తగ్గుతుంది. ఉద్యోగస్థులకు తమ వ్యవహారాల్లో ఉన్న అనిశ్చిత పరిస్థితి తొలగిపోయి భవిష్యదభివృద్ధికి మార్గం ఏర్పడుతుంది. వ్యాపారస్థులకు నూతన వ్యాపారాల్లో స్వల్ప లాభం వస్తుంది. ఇదివరకు మీరు ప్రయత్నంచేసి విరమించిన కార్యక్రమాలకు మరల ప్రాముఖ్యం వస్తుంది. రాబోయే సహాయాన్ని ఆశించి పెద్ద ప్రయత్నాలు చేయడం ఇంక మంచిదికాదు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబంలో శాంతి, సౌఖ్యం ఉంటాయి.

## వారఫలాలు

ప్రేమ వ్యవహారాల్లో కొన్ని సమస్యలు రావచ్చును. 24, 25 తేదీల్లో అనవసర వ్యయం, చికాకులు.

* * *

### వృశ్చికం :

(విశాఖ 4–వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఈ వారం గత వారం కంటె కొంచెం బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ప్రయోజనం గల పనులు కొంచెం శ్రమమీదనైనా పూర్తిచేయు గలుగుతారు.. భాగస్తులతో కలసి చేసే వ్యాపారాల్లో రాణించగల సూచనలు ఉన్నాయి. మీ పనులతోపాటు స్నేహితుల పనులు కూడా చూడ వలసి రావడం వలన విశ్రాంతి ఉండదు కోర్టు వ్యవహారాల్లో ఇంతవరకూ గల వ్యతిరేకత తొలగి పోతుంది. ఉద్యోగస్తులకు అనుకూలంగా చిన్న చిన్న మార్పులు రావచ్చును. అన్ని వ్యవహారాల్లోను అనుకూలత ఉన్నా అశ్రద్ధ పనికిరాదు. ఆరోగ్యం బాగానే ఉంటుంది. సాంఘికంగా మీ మాటకు విలువ పెరుగుతుంది. వృత్తి రీత్యా కొత్తవారిని కల్సుకొంటారు. దానివలన ప్రయోజనం ఉంటుంది. ప్రేమ వ్యవహారాల్లో అభివృద్ధి, ప్రోత్సాహం లభిస్తాయి, 29, 30 తేదీల్లో ధనలాభం, సంతోషం.

* * *

### ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

ఈవారం చిత్రంగా ఉంటుంది. మీరు ప్రయత్నించిన పనులకు ఆటంకం, అనుకోని పనులు అనుకూలంగా మారటం జరుగుతాయి ప్రతి పనిలోను మీకు నకారణంగా సందేహాలు కలిగి ప్రతిష్టంభన యేర్పడగల సూచనలు ఉన్నాయి. మీరు ఏమాత్రం తొందరపడినా ఆర్థికంగా నష్టం వస్తుంది. సాధ్యమైనంతవరకు ముఖ్యమైన వ్యవహారాలు వాయిదా వేయడం మంచిది. ఉద్యోగస్తులకు రోజూవారీ పనిలోకూడా కొన్ని చిక్కులు యేర్పడతాయి. మీరు యింతవరకు సాధించిన కార్యాల్లోకూడా యిబ్బందులు రావచ్చును. వారాంతంలో అనవసరమైన వ్యయం చేయవలసి వస్తుంది. సంతానానికి అనారోగ్యం చేస్తుంది. రాజకీయాల్లోమాత్రం కొంచెం అనుకూలంగా ఉంటుంది. మూలా నక్షత్రం జాతకులు మిగిలిన వారికంటే జాగ్రత్తగా ఉండాలి.

* * *

### మకరం :

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా,
శ్రవణం, ధనిష్ఠ 1,2 పాదాలు.

ఈవారం సామాన్యంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఒడుదుడుకులు లేకుండా సాగిపోతుంది. మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలకు యీ వారంలో ప్రయోజనం లభిస్తుంది. వృత్తిలో ఏర్పడిన చికాకులు క్రమ క్రమంగా తగ్గు ముఖం పడతాయి. వారాంతంలో మీరు రాదనుకొన్న డబ్బు చేతికి వస్తుంది. సహాయం చేస్తామని వాగ్దానం చేసిన వ్యక్తులు నమ్మల్చి వదిలివేస్తారు. కాని మీ స్వయంకృషివల్లనే మీ పనులన్నీ నెరవేర్చుకొవ

గలుగుతారు. వస్తువులు పోయే ప్రమాదం ఉంది. కాబట్టి జాగ్రత్తగా ఉండడం మంచిది. విద్యారంగంలో మీ బుద్ధి చురుకుగా పనిచేస్తుంది. కుటుంబ విషయాలు అనుకూలంగా ఉంటాయిగాని బంధు వ్యవహారాలు యింకా ఒకదారికి రావు ప్రయాణం చేసి కార్యసాధన చేయగల సూచన ఉన్నది. పుణ్య కార్యాలు నేరవేరతాయి.

*　　*　　*

**కుంభం :**

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం,
పూ. భాద్ర 1, 2, 3 పా.)

ఆదాయం పెరగకపోయినా ఆర్థికంగా యింత వరకు ఉన్న ఒత్తిడి వారాంతానికి తగ్గుతుంది. వృత్తి వ్యాపారాల్లో ఉన్న అనిశ్చిత పరిస్థితి తొలగిపోయి అభివృద్ధికి అవకాశం యేర్పడుతుంది. వ్యాపారంలో మీరు చేసే నూతన ప్రయత్నాలవల్ల వెంటనే ప్రయోజనం లేకపోయినా మీరు నిరుత్సాహం పొందనవసరం ఉండదు. భాగస్వాములతో చేసే వ్యవహారాల్లో కొన్ని భేదాభిప్రాయాలు వచ్చి ముఖ్యమైన పనులు ఆగిపోవచ్చును. ఉద్యోగస్తులకు కొంత శ్రమ కల్గినా అధికారుల ఆదరణ లభిస్తుంది. కుటుంబంలో స్వల్ప విషయాలకు మాట పట్టింపులు రావచ్చును. శుభకార్యాల విషయంలో స్వల్పమైన అభివృద్ధిని సాధిస్తారు. విలువైన వస్తువులు కొంటారు. కొంతమంది బంధువులు సకాలంలో తోడ్పడి మీకు కొంత విశ్రాంతిని కలిగిస్తారు. కుటుంబంలో పెద్దవారికి అనారోగ్యం చేస్తుంది.

*　　*　　*

**మీనం :**

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

ఈవారం సాధారణంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీకు యిష్టం లేని పనులు కొన్ని చేయవలసి వస్తుంది. మీకు తోడ్పడే వ్యక్తులకు కొన్ని చికాకులు రావడంవలన మీకు సహాయం చేయలేకపోతారు. దానితో మీరుకూడా కొంత ఇబ్బంది పడవలసి వస్తుంది. పైకి మీతో అనుకూలంగా మాట్లాడే వ్యక్తులు కొంతమంది మీకు హాని చేయడానికి ప్రయత్నిస్తారు. వారం మధ్యలో మానసికాందోళన కలిగించే వార్తలు వింటారు. స్థిరాస్థి వ్యవహారాల్లో కొంత ప్రోత్సాహం లభిస్తుంది. ఆరోగ్యం వారాంతం నుంచి బాగా ఉంటుంది కుటుంబంలో భేదాభిప్రాయాలు రావచ్చును. గాని దానివల్ల యే కార్యక్రమమూ ఆగిపోదు. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది రాజకీయంగా పలుకుబడి పెరుగుతుంది. 29, 30 తేదీల్లో వస్తు ప్రాప్తి, సౌఖ్యం. ★

# జన్మదినఫలం

## ఏప్రిల్ - 24

ఈ సంవత్సరం బాగానే ఉంటుందని చెప్పవచ్చును. వృత్తి వ్యాపారాల్లో ఇదివరకు మీరు చేసిన కృషికి ఫలితాన్ని యిప్పుడు పొందుతారు. సంవత్సరం మధ్యలో నూతన వ్యాపారాలు ప్రారభిస్తారు. భాగస్తులతో కలసిచేసే వ్యాపారాల్లో అంత ప్రోత్సాహం లభించదు. ఆర్థికంగా అప్పుడప్పుడు ఒత్తిడి వచ్చినా మొత్తంమీద సంతృప్తికరంగా ఉంటుంది. స్త్రీ మూలంగా కలహం రాగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో భిన్నాభిప్రాయం కలిగినా చికాకులులేకుండా సర్దుకుపోతూ ఉంటాయి. రాజకీయాల్లో మాత్రం ప్రతిపక్షాల ఒత్తిడి తీవ్రంగా ఉంటుంది. దూర ప్రయాణాలు చేయవలసి ఉంటుంది. విద్యార్థులు కృతార్థులు కాగల సూచనలు ఉన్నాయి. వస్త్ర వ్యాపారులకు, యింజనీర్లకు మంచి సమయం.

## ఏప్రిల్ - 25

గత సంవత్సరం మీ వృత్తి వ్యాపారాల్లో కలిగిన చికాకులు క్రమంగా తొలగిపోయి భవిష్యత్తు మీద విశ్వాసం యేర్పడుతుంది. అధికారులవల నెరవేరవలసిన పనుల నెరవేరి వ్యాపారస్థులు లాభాలు పొందుతారు. వ్యాపార విస్తరణకై భారీ ప్రయత్నాలు చేయడానికి మంచి సమయం. ఉద్యోగస్తులు ఉన్నతస్థానం కోసం ప్రయత్నం చేయవచ్చును. ఇంతవరకు మీపట్ల వైముఖ్యం చూపిన వ్యక్తులుకూడా మీ అభిప్రాయాన్ని ఆమోదిస్తారు. స్థిరాస్థి వ్యవహారాల్లో అంతగా ప్రోత్సాహం కనిపించదు. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయడానికి వీలులేదు. కుటుంబ వ్యవహారాలు ఒడుదుడుకులు లేకుండా జరిగిపోతాయి కాని పెద్దవారికి అనారోగ్యం చేసి కొంచెం ఆందోళన కలిగిస్తుంది. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు వ్యవసాయిదారులకు మంచిసమయం.

## ఏప్రిల్ - 26

మీరు యెంత జాగ్రత్తగా ఉన్నా వృత్తి వ్యాపారాల్లో యేవో చికాకులు వస్తూ ఉంటాయి. ఆర్థికంగా ఆట్టే నష్టంలేకపోయినా ఆందోళన మాత్రం తప్పదు. తగినంత కారణం కన్పించకపోయినా మీకు ప్రతి వ్యవహారంలోను అనుమానాలు కలగడం వలన సాహసించి యేపనీ చేయలేరు కాని తరువాత మీ అనుమానాలు నిజమని రుజువు కాగలవు. ఉద్యోగస్తులకు స్థాన చలనమునకు సూచనలు ఉన్నాయి. అవకాశము ఉంటే తప్పించుకొనుట మంచిది. సంవత్సరము మధ్యలో జీర్ణ సంబంధమైన అనారోగ్యం చేయవచ్చును. శుభకార్యాల విషయంలో బంధువుల తోడ్పాటు లభిస్తుంది. సాంఘిక కార్యక్రమాలలో పేరుకురాని శ్రమ పొందతారు. ప్రేమ వ్యవహారాల్లో ప్రోత్సాహం లభిస్తుంది. విద్యార్థులు శ్రమపడి చదువ వలసి ఉంటుంది.

## ఏప్రిల్ - 27

వృత్తి వ్యాపారాల్లో మీకు యిష్టం లేని పరిణామాలు కల్గుతాయి కాని వాటి వల్ల మున్ముందు ప్రయోజనం ఉంటుంది. మీరు ఇదివరకు జరిపిన వ్యవహారాల్లో చికాకులు ఏర్పడి మీకు నష్టం రావచ్చును. కాని సమయానికి కొంతమంది మిత్రులు తోడ్పడగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగస్తులు తమకు సంబంధించిన విషయాలకుకూడా అధికారుల ఆగ్రహానికి గురి అవుతారు. కొన్ని ముఖ్యమైన కాగితములు కాని వస్తువులుకాని పోయే సూచనలు ఉన్నాయి. వృత్తిరీత్యా చేయవలసిన దూర ప్రయాణాలు వాయిదావేయడం మంచిది. సాంఘిక కార్యక్రమాల్లో మీ స్థానాన్ని నిలుపుకొంటారు. కాని పెద్ద ప్రోత్సాహం లభించదు. సత్పురుషుల సహవాసం లభిస్తుంది. సెప్టెంబరు అక్టోబరు నెలల్లో స్వల్ప ధనలాభం.

## ఏప్రిల్ - 28

ఈ సంవత్సరం అప్పుడప్పుడు కొన్నిచికాకులు కలిగినా మొత్తంమీద సంతృప్తికరంగాఉంటుంది.వ్యాపార విస్తరణకు మీరు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. కానీ యెవరినీ యెక్కువగా నమ్మి వ్యవహరించడానికి వీలులేదు. శత్రువులవల్లకంటే మిత్రులవల్ల మీరు నష్టపోయే అవకాశము ఉంది. ఆదాయం పెరిగినా ఆర్థికంగా తాత్కాలికమైన యిబ్బంది కలుగుతుంది. ఉద్యోగస్తుల శక్తి సామర్థ్యాలు గుర్తింపబడడం వలన పురోభివృద్ధికి మార్గం యేర్పడుతుంది. ఆరోగ్యం గత సంవత్సరంకంటే బాగా ఉన్నా అప్పుడప్పుడు రక్తసంబంధమైన అనారోగ్యం చేయవచ్చును. కోర్టు వ్యవహారాల్లో యింతవరకు ఉన్న వ్యతిరేకత తొలగిపోతుంది. శుభకార్యక్రమాలవల్ల కొంత శ్రమకల్గుతుంది. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## ఏప్రిల్ - 29

ఈ సంవత్సరం అన్నివిధాలా అనుకూలంగా ఉంటుంది. వృత్తివ్యాపారాల్లో ప్రోత్సాహం లభిస్తుంది. నూతన వ్యాపారాల్లో ధన లాభం కలుగుతుంది. అధికారులవలన జరుగవలసిన పనులు శ్రమలేకుండా నెరవేరుతాయి. ఉద్యోగస్తులు ఉన్నతస్థానము పొందుటకు పూర్తిగా అవకాశాలు ఉన్నాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో కొన్ని మార్పులు రావచ్చును. మీరు యిప్పుడు రాదనుకొంటున్న డబ్బు చేతికి వస్తుంది. సంవత్సరాంతంలో కొంత ప్రయోజనంలేని శ్రమ పొందవలసి వస్తుంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుందికాని నిర్లక్ష్యం చేయ తగదు. కుటుంబంలో శుభకార్యాలు జరుగుతాయి. రాజకీయాలు అనుకూలంగా ఉన్నా వాటి మీద మీకు ఆసక్తి తగ్గుతుంది. విద్యార్థులకు క్లాసువచ్చుటకు అవకాశం ఉన్నది. నటీనటులకు మంచి సమయం.

## ఏప్రిల్ - 30

ఈ సంవత్సరం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. ప్రతిపనీ యెంతో శ్రమ మీదగాని సాధించలేరు. వృత్తివ్యాపారాల్లో ఆదాయం పెరగదు. గాని ఒడుదుడుకులు వస్తూ ఉంటాయి. వృత్తిలో కొత్తవారి పోటీ విశేషంగా ఉంటుంది. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు రాణించవు. సాహసముతో కూడిన వ్యాపారాల్లో నష్టం రావచ్చును. సంవత్సరాంతంలో అన్ని వ్యవహారాలోను అనుకూలమైన మార్పులు వస్తాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది కాని మానసికంగా విశ్రాంతి లభించదు. కుటుంబ వ్యవహారాలు సక్రమంగా నెరవేర్చుతారు. కొంత అనవసరమైన వ్యయం చేయవలసివస్తుంది. విలువైన వస్తువులు కొంటారు. ప్రేమ వ్యవహారాల్లో అనుకూలత ఉంటుంది. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు. ★

"వసంతమ్మగారూ! విశాలమ్మగారిని పెళ్ళోరు సూడ్డానికి వస్తున్నారంట. అమ్మగారు మిమ్మల్ని వోసారి అర్జెంటుగా రమ్మంటుండారు."

పనిమనిషి రామి కేకతో చేతిలో పుస్తకం వదిలేసి యివతలకు వచ్చింది వసంత.

"ఎప్పుడొస్తున్నారే రామీ?"

"ఇయ్యాలేనండి. సందేళకి దిగుతారంట."

"విశాల ఏంచేస్తుంది?"

"ఏటి సేత్తారండి? అమ్మగారితో వాదు లాడుతా కూసున్నారండి. ఆయమ్మ, సెప్పిన మాటలయిన రండసలు. మీరు సెబితే యింటారని ఉన్నఫళంగా పిల్సుకురమ్మనారండి మా అమ్మగోరు."

"నే వస్తున్నాన్లేవే. నువ్వెళ్ళు." రామి మాట లకు నవ్వుకుంటూ అంది వసంత.

"విశాల చిన్నప్పటినుంచీ ఒక్కలా ఉంది. చిలిపి తనం, పెంకితనం ఎక్కువ దానికి. అదంటే ప్రాణం వాళ్ల అమ్మగారికి.

చిన్నతనపు రోజులన్నీ గుర్తుకొచ్చాయి వసంతకి. విశాల, పద్మ, తనూ, ఒకటి, రెండేళ్ల తేడా వయస్సుల్లో. విశాల చిలిపిగా ఎంత అల్లరి చేసేదో, పద్మ అంత ముభావాంగా,గంభీరంగాఉండేది ఎప్పుడూ. నిండుకుండ తొణకదు.

విశాల గలగలా పారే సెలయేరయితే, పద్మ నిండుగా ప్రవహించే ప్రవాహం.

"మీ ముగ్గురికి ఇంత పొత్తు ఎలా కలిసిందర్రా" అనే వారందరూ. అప్పుడే తన పెళ్లయి పదేళ్లవు తోంది. విశాలా, పద్మా అదృష్టవంతులు. పద్మ యూనివర్సిటీలో ఆనర్సు చదువుతోంది. విశాల డిగ్రీ కోర్సయినా పూర్తిచేసింది. తనచదువు స్కూల్ ఫైనల్‌తోనే పూర్తయింది అతి కష్టంమీద.

బామ్మ పట్టుదలతో పన్నెండేళ్ల వయస్సులోనే తన పెళ్లయి పోయింది ఆనందరావుతో.

అమ్మను చూసిపోదామని పుట్టింటికి వచ్చిన వసంతకు ఆనందరావు కళ్లతో మెదిలాడు. అతను చూడటానికి వచ్చిన రోజు తనకింకా బాగా జ్ఞాపకం ఉంది.

"పెళ్లి చూపుల ఘట్టంతో మొదలవుతుంది ఆడపిల్లల బ్రతుకుల్లో మొదటి మలుపు. అది ఒక విషమ పరీక్ష వాళ్ల పాలిట" అనుకుంది వసంత.

"చిన్నతనపు ఛాయలు విడిపోని అమాయకపు రోజుల్లో ఒకే ఒక పెళ్లికొడుకు తనని చూడటం, పెళ్లవటం జరిగిపోయింది.

వసంత, మనసులో జ్ఞాపకాల పుటలు వెనక్కి తెరచుకున్నాయి.

'అమ్మాయీ! ఓ..... వసూ! ఎక్కడికీ వెళ్లకు, చప్పున మొహం కడుక్కుని రా, జడవేస్తాను."

అమ్మ కేక, లోపల్నించి గట్టిగా వినిపించింది అప్పుడే స్కూల్ నుంచి వచ్చిన వసంత చేతిలో పుస్తకాలు విసుగ్గా అలమైరాలో పడేసి స్నానాల గదికి దారితీసింది. చిర చిరలాడుతూ. "పుస్తకాలు యింట్లో పడేసి ఆడుకోటానికి వస్తానని "విశాల, పద్మా వాళ్లకు మాట యిచ్చింది తను. తనకోసం ఎదురుచూస్తు ఉంటారు వాళ్లు. అమ్మ ఎప్పుడూ ఇంతే. ఏదో ఒకటి ఘోరమా యిస్తుంది. యివ్వాళ మీనాక్షినీ, శాంతినీ దొంగని చెయ్యాలని ఎంతను కుందో! ఆ మీనాక్షి మరీ నాలుగు రోజుల్నుంచీ తప్పించుకు తిరుగుతోంది. దొంగవకుండా!"

పరికిణీతో మొహం తుడుచుకుని వెళ్లి అమ్మ ముందు కూర్చుంది అమ్మలు జడకు.

"తొందరగా జడవెయ్యవే అమ్మా. నేను ఆడుకుందుకు వెళ్ళాలి. శాంతా వాళ్లంతా అప్పుడే చేరుకుని ఉంటారు."

"యివ్వాళ ఒద్దు అమ్మాయీ మనింటికి చుట్టాలు వస్తారిప్పుడు. నువ్వెక్కడికి వెళ్ల కూడదు." దువ్వెనతో పాపిడి సరిచేస్తూ అంది అమ్మ.

అమ్మ మాటకు తిరుగుండదని తెలుసు వసంతకు.

"అయినా చుట్టాలు రావటానికి, తను ఆడుకుందుకు సంబంధం ఏమిటో! ఆ, వచ్చే చుట్టాలు తనతో ఏం మాట్లాడతారు. అమ్మా— నాన్నగారూ అన్నయ్య యింతమంది ఉండగా తనతోనే పనేమిటి వాళ్లకి. అయినా వేళా, పాళా లేకుండా యిప్పుడే రావాలా వాళ్ళు?" విసుక్కుంది వసంత.

"ఈ పాటికి విశాలా వాళ్లంతా మీనాక్షీ వాళ్ల దొడ్లో మామిడిచెట్టు క్రింద ఆడుతూ ఉంటారు. దొంగ ఎవరయారో! దొంగకు చిక్కకుండా చెట్లు చాటునుంచి పరుగులు పెడుతుంటే ఎంత సరదాగా ఉంటుంది!"

"నల్ల ట్రంకులో ఉన్న పెద్దంచు కంచిపట్టు పరికిణీ, నీలి రంగు జాకెట్టూ వేసుకుని, లేత గులాబి రంగు సిల్కు పావడా వేసుకో."

కొత్త రిబ్బను జడ చివర ముడేస్తూ అంది అమ్మ.

"ఎప్పుడో పండగలకేగాని వేసుకోనివ్వని పట్టు పరికిణీ చుట్టాలు వచ్చినంత మాత్రాన వేసు మంటుంది అమ్మ ఎందుకో. యిప్పుడా పట్టు పరికిణీ వేసుకోకపోతే ఏం?"

విసుక్కుంటూనే కట్టుకుంది వసంత.

"అమ్మా......ఒక్కసారి పరిగెట్టుకుంటూ వెళ్లి వస్తానే విశాలా వాళ్ళింటికి"

బుగ్గల్ని చేతులోకి తీసుకుని బొట్టు సరి చేస్తున్న అమ్మ చురుగ్గా చూసింది వసంత కళ్ళ ల్లోకి కోపంగా.

కళ్ళల్లో నీళ్లు నిలిచాయి వసంతకు

"యిల్లారా తల్లీ....మాట". వరండాలో మంచం మీద పడుకున్న బామ్మ పిలుపు వినిపిం చింది.

"నాతల్లి కదూ! యివాళ ఒక్క రోజు యింట్లో ఉండమ్మా. ఆ అబ్బాయి చూడటానికి వస్తున్నాడా మరి. అలా వెళ్ళి పోకూడదు తల్లీ." తన మెళ్లో ఉన్న బంగారు గొలుసు వసంత మెళ్లోవేస్తూ అంది బామ్మ.

వసంతకి ఆశ్చర్యం వేసింది. "ఎవరో అబ్బాయి తనని చూడటానికి రావటం ఏమిటీ! ఎందుకు చూడటం!?"

వసంత మొహంలో మారుతున్న రంగుల్ని చూసి లోలోపలే నవ్వుకుంది బామ్మ.

"ఎవరు బామ్మా? రావటం. ఏ అబ్బాయి మాట నువ్వు చెప్పేది?!"

"పెళ్లివారు తల్లీ...నిన్ను చూడటానికి వస్తు న్నారు. ఈ ఒక్క రోజూ అమ్మని విసిగించక యింట్లో ఉండమ్మా. వాళ్ళు యింకో గంటలో వస్తారట." వసంతకి నచ్చ చెప్తూ అంది బామ్మ.

"ఏమిటీ పెళ్లివారా! వస్తారంట. తనకి అప్పుడే పెళ్లేమిటి!" వసంత గుండెలు దడ దడలాడాయి.

"బామ్మా.....నాకేమిటో భయంగా ఉంది."

"పిచ్చి పిల్లా....భయందేనికమ్మా. ఆడపిల్లయి పుట్టాక పెళ్లి, అత్తవారింటికి వెళ్లటం, బాధ్యతలూ . .... ఏవీ తప్పవు తల్లీ. అందుకే అంటారు 'ఆడపిల్లయి పుట్టేకంటే అడవిలో మ్రానై పుడితే మేలు' అని. ఎన్నేళ్ళు పెంచితేనేం ఒకయ్య చేతిలో పెట్టేదాకా తల్లితండ్రుల భారం తగ్గదు కదా తల్లీ. అక్క వెళ్లలే, మీ బావతో. పెళ్ళయిన తర్వాత రేపు నీవు అంతే."

ఒళ్లో దూరి పడుకున్న వసంత తల నిమురుతూ బుజ్జగించింది బామ్మ.

బామ్మ దగ్గర్నుంచి లేచి దొడ్లో జాజి పందిరి క్రింద ఉన్న పట్టె మంచం మీద పడుకుని ఆలో చనల్లో మునిగిపోయింది వసంత.

"విశాలా, పద్మా వాళ్లేవరికీ అవని పెళ్లి తన కెందుకు అప్పుడే. వాళ్లందరి కంటే పెద్దదై పోతుందప్పుడు. తనొక్కతే విడిగా అయినట్లు నిస్తుంది. అక్కయ్య సంగతేమైంది! పెళ్లవగానే చదువు మాన్పించేశారు. బామ్మ, అమ్మా కలిసి తప్పమ్మా పెళ్లయిన పిల్లలు, అలా పదిమందిలో తిరక్కూడదు" అంటూ "చదువుకుంటా అని గోల పెట్టే అక్క నోరు నొక్కేసారు. ఆడు కుందుకు వెడ్తే "పెళ్లయిన పిల్లలు అలా గంతులు పెట్టచ్చా?" అంటూ గదిమే వారు. ఏడాదయినా తిరక్కుండా బావ, అక్కని తీసుకెళ్లటానికి వచ్చి 'ససేమిరా' పంపితీరాలని కూర్చున్నాడు. అక్కయ్య ఎంత ఏడ్చిందనీ వెళ్లిపోతూ! "పెళ్లయిన తర్వాత ఒకింటికి వెళ్లక తప్పదమ్మా "ఆడ పిల్ల అల్లా కంట తడిపెట్టరాదు" అంటూ వోదార్చింది బామ్మ. తనకీ పెళ్లయితే అలాగే వీళ్లందర్నీ వదిలి వెళ్లి పోవాలి కాబోలు! అమ్మో! బామ్మ పక్కలో పడు కోకపోతే తనకి ఒక్కనాటికీ నిద్దురే పట్టదు. విశాల, పద్మా, అమ్మా నాన్నగారూ.... వాళ్లంతా కన్పించకపోతే తనుండగలదా! ఊహూ......ఏమైనా సరే. పెళ్లి చేసుకోకూడదసలు..........."

చల్లగాలికి ఎప్పుడు నిద్ర పట్టిందో తెలి యదు వసంతకి.

"అమ్మలూ... .వోసేవ్...... వో వసంతా. లేమ్మా వాళ్ళొచ్చేశారు. త్వరగాలే."

వసంతకు ఒక్కసారి నిద్రలో కూరుకు పోతున్న కళ్లను బరువుగా తెరచి మళ్లీ మూసుకుని ఒత్తిగిలి పడుకుంది. విదియనాటి వెన్నెల జాజి పందిరి క్రింద నుంచి వసంత చెంపల్ని మృదువుగా తాకి మెడమీద నుంచి పాల నురగలా జారుతోంది. సన్నటి గాలి ముంగుర్లతో ఆడుకుంటుంటే, పట్టుపావడాలో పాలరాతి బొమ్మలా మెరిసిపోతూ అమాయకంగా, నిద్రపోతున్న వసంతని తృప్తిగా చూసుకుంది అమ్మ ఒక్క క్షణం.

" నా చిట్టి తల్లి బంగారపు బొమ్మ." అను కుంది ఒక్కసారి.

"లేమ్మా! వసూ. వాళ్లొచ్చారు. ఎటుగాని యీ నిద్దేమిటే తల్లీ యింకా ఎనిమిది గంట లయినా కాలేదు."

నిద్రలో వసంతను లేపాల్సి వచ్చినందుకు

40వ పేజీ చూడండి

# సంపెంగపొదలు



సి. ఆనందారామం

## జరిగిన కథ

గిరి, హరి, హరి చెల్లెలు దుర్గ బాల్య స్నేహితులు. హరి, ఉమల మధ్య అనురాగం నెలకొంటుంది. గిరి చూపే భాతృవాత్సల్యాన్ని, దుర్గ హర్షించ లేకపోతుంది. దూరపు బంధువు శంకర్‌ను గిరి తన ఇంటికి ఆహ్వానిస్తాడు. గిరి సలహాపై దుర్గ శంకర్‌ని హృదయ పూర్వకంగా ప్రేమిస్తుంది. వారిద్దరు వివాహం చేసు కొంటారు. హరంటే ఇష్టంలేనట్లు ఉమ ప్రవర్తిస్తుంది. హరి కృంగిపోతాడు. శంకర్, దుర్గల వైవాహికజీవితంలో చెలరేగిన కలతలను సరిదిద్దటానికి గిరి ప్రయత్నం చేస్తూ వుంటాడు. దుర్గ చిన్ననాటి స్నేహితుడు ప్రసాద్ ఆమె సంసారంలో కలతలు రేపటానికి ప్రయత్నిస్తాడు. గిరి హరినిగురించి నచ్చచెప్పటానికి ఉమవద్దకు వెళ్తాడు. దుర్గ మనశ్శాంతికోరకు పుట్టింటికి వెళ్తుంది. తనను ధిక్కరించి వెళ్లినట్లు భావించి శంకర్ ఉగ్రుడౌతాడు.

## 23

పుట్టింటికి వచ్చిన దుర్గకు రెండు మూడు రోజులవరకూ స్వర్గంలో ఉన్నట్లు అనిపించింది. కానీ, నాల్గవ రోజు నుంచీ, ఏమీ తోచలేదు. ఏదో దిగులూ, వెలితీ ఆమెను క్రమ్ముకుంటున్నాయి. గిరి తనకు కనబడకపోవటం, ఆ దిగులును, మరింత అధికం చేసింది. దగ్గిర— దగ్గిర ఎనిమిది నెలలవుతుంది గిరిని చూసి, ఇంతకాలం కనబడకుండా ఎన్నడూ లేడు. వంట్లో కులాసాగా లేదా! ఎందుకో గిరి ప్రస్తావన తేగానే హరి అన్నయ్య మండి పడుతున్నాడు. తల్లి నడుగుతే, తనకు తెలియదంది. ఒకసారి తనే వెళ్ళి చూసివద్దామని బయల్దేరింది దుర్గ— అది గమనించి హరి "ఎక్కడకూ ?" అన్నాడు.

దుర్గ అమాయకంగా, "గిరి దగ్గరకు అన్నయ్యా! నాకు కనిపించి ఎనిమిది నెలలవుతూంది. ఎలా ఉన్నాడో చూసి వద్దామని అంది.

"ఏం ? బెంగ పెట్టుకున్నావా ?" కఠినంగా అన్నాడు హరి.

అతని స్వరంలోని కాఠిన్యానికి తెల్లబోయింది దుర్గ—

"అవును. నాకేం తోచటం లేదు. ఎనిమిది నెలల క్రిందట, నా దగ్గరకు వచ్చి తేజ్‌పూర్ వెడుతున్నానని చెప్పాడు. అంతే మళ్ళీ కనబడలేదు."

"ఏమిటీ ? గిరి తేజ్‌పూర్— వెళ్ళాడా ? !" హరి గర్జించాడు. హరి ముఖంలో వ్యక్తమవుతున్న ద్వేషానికీ, కసికీ, దుర్గ వణికి పోయింది. ఆమెకు ఏమీ అర్థం కాలేదు. అన్న ముఖంలోకి చూస్తూ నిలుచుండి పోయింది.

"దుర్మార్గుడు— నీచుడు— నమ్మక ద్రోహి —నిలువెల్లా విషం. రోగ్— నా దగ్గిరా, వీడి ఆటలు ? స్నేహంలో ప్రాణం పెట్టినట్లే ద్వేషంలో ప్రాణం తీస్తానని తెలియదు—

నిజంగా హంతకుడిలాగే ఉన్నాడు హరి— దుర్గ భయంగా, "ఎవరిని గురించి అన్నయ్యా??" అంది—

హరి విసురు దుర్గ మీదకు తిరిగింది.

"ఎంత సంగనాచివితల్లీ అసలా వెధవని మళ్ళీ మా ఇంట్లో ఎందుకడుగు పెట్టనిచ్చావ్ ? నువ్వు వాడిని పెళ్ళి చేసుకోనందుకు చాలా సంతోషిస్తున్నాను— కానీ, కానీ, ఈ చనువెందుకూ ? వాడు.... వాడు స్వార్థపరుడు— నీ సంసారంలో కలతలు రేపి నీ మనసుని బలహీనం చేసి, నిన్ను లోంగ దీసుకోవాలని చూస్తున్నాడు. ఇక్కడ ఉమ దగ్గిర ప్లాన్ వేస్తున్నాడు. ఇప్పుడర్థ మవుతూంది. వాడి కౌటిల్యమంతా— ఛండాలుడు ! వాడి మూలంగానే, నా ఉమ నాకు కాకుండా పోయింది. ఇది కాకుండా తేజ్‌పూర్ కూడా వెళ్ళొచ్చాడు. మనందరి జీవితాలూ నాశనం చేస్తేనే కాని, ఈ రాక్షసుడికి నిద్ర పట్టదులా ఉంది. తీయని చిరునవ్వుతో మెత్తని మాటలతో ఒక్కొక్కళ్ళనీ బుట్టలో వేసుకుని అందరి గొంతుకలూ కోస్తున్నాడు."

దుర్గ చెవులు మూసుకుంది. ఆందోళనతో ఆమె స్వరం కంపించింది "కాదు ! అన్నయ్యా ! నువ్వు పొరపడుతున్నావ్ ! గిరి...."

"షటప్ !" దుర్గ మాటలు పూర్తి కాకుండానే విరుచుకు పడ్డాడు హరి.

"అతని మీద నీకు పెరిగిన వ్యామోహంలో నువ్వు సరిగా ఆలోచించ లేక పోతున్నావు. నాకు సరిగ్గా ఏడెనిమిది నెలల క్రిందట, ఉమ దగ్గిర నుండి ఒక ఉత్తరం వచ్చింది. తనకు నన్ను వివాహం చేసికోవటానికి ఏమీ అభ్యంతరం లేదనీ, కాని తన ఉద్యోగానికి మాత్రం ఈ వివాహం ఆటంకం కాకూడదనీ వ్రాసింది. నాకేం తెలుసు. ఇదంతా ఈ వెధవ పన్నాగమని ? నా మీద ప్రేమతోనే, ఉమ ఇలా వ్రాసిందనుకుని "నీ ఉద్యోగం వల్ల మన ఇద్దరికీ సుఖంలేదు. నువ్వక్కడ తేజ్‌పూర్‌లోనే ఉండ దల్చుకుంటే, మనం పెళ్ళిచేసుకునీ ప్రయోజనం లేదు— కావాలంటే, ఇక్కడే ఉద్యోగం చేయవచ్చు" అని సమాధానం వ్రాశాను. మళ్ళీ ఉమ దగ్గర నుండి ఉత్తరమే లేదు— నా మీద అభిమానంతో మొదటి ఉత్తరం వ్రాస్తే కదా, మళ్ళీ సమాధానం వ్రాయటానికి ? ఈ దరిద్రుడు అక్కడకు వెళ్ళి చెప్పిన ఉపాయం ఇది— నా సమాధానం ఎలాగో ఇలా ఉంటుందని వాడికి తెలుసు— నా నోటితోనే కాదని పించుకుని ఉమను స్వాధీనం చేసుకోవాలని వాడి ఎత్తు. ఛీ ! ఇట్లాంటి నీచుడిని, చిన్న తనం నుంచీ, ప్రాణ స్నేహితుడుగా చూసాను. వీడి కోసం ఏం చెయ్యమన్నా సంతోషంగా భావించాను. నా దురదృష్ట దేవత వీడిరూపంలో నా నెత్తిమీద ఉందని తెలిసికోలేక పోయాను."

దుర్గ ఏమీ మాట్లాడలేక పోయింది. ఆమె అంతరాత్మ గిరి ఉత్తముడని గోల పెడుతోంది. కానీ, చికాకులతో కలత పొంది, తన ప్రణయ వైఫల్యానికి క్షోభించే హరికి, అసలు విషయం ఎలా అర్థమవుతుంది ?

"దుర్గా ! సీరియస్‌గా చెపుతున్నాను. ఇక మీదట నువ్వా గిరిపేరు ఎత్తినా, వాడిని కలను కోటానికి ప్రయత్నించినా, నీకూ, నాకూ, ఏం సంబంధ ముండదు. అన్నగా నా మీద నీకే మాత్రమైనా గౌరవముంటే, ఆ గిరిని పూర్తిగా మర్చిపో! నా కోపం కొద్దీ చెప్పటం లేదు. నీ మేలుకోరి చెపుతున్నాను."

దుర్గ లోపలకు పోయి, సోఫాలో కూలబడింది. క్షోభతో ఆమె హృదయం కుమిలి పోయింది—తన అశాంతిని భరించలేక ఇక్కడకు వస్తే, ఇక్కడ ఇది !—

"శంకర్ పైపైకి కసికొద్దీ, ఏదో తనను గురించి అవమానకరంగా మాట్లాడినా, అతని అంతరంగంలో తన మీద ఏ అవిశ్వాసమూ లేదు. గిరికీ, తనకూ మధ్య గల అనుబంధం విషయంలో అతడేనాడూ అసహనాన్ని చూపించలేదు,

అన్నయ్యా రెండాకు లెక్కువ చదువుకున్నాడు. తనను నిజంగానే అనుమానిస్తున్నాడు. చిన్నతనం నుంచీ తమ ముగ్గురి నడుమ, పెంపొందిన ఆత్మీయత క్షణంలో మరిచిపోయాడు. మొదటి నుంచి గిరి తన నెంతగా అభిమానించే వాడో తెలిసీ, ఈ నాడు గిరిని గురించి తేలికగా మాట్లాడగలి గాడు ! ఏం మనుష్యులూ ? ఎందుకింత త్వరగా అపోహలు పెంచుకుంటారు ?

"ఏం ఆడజన్మ ? తానొక మగవాడై ఉంటే, హరి అన్నయ్య తననిలా నిర్బంధించ గలిగే వాడా? స్వార్థ పరులైన మొగవాళ్ళతో నిండిన, ఈ సభ్య సమాజంలో, ఆడదానిగా జన్మించటం కంటే, సభ్యత అనే మాటకు అర్థం తెలియని ఆటవిక జాతుల్లో జన్మించటం వెయ్యిరెట్లు నయం"

## 24

ఆ ఉత్తరం చదువుతూనే తల తిరిగి క్రింద పడి పోయింది దుర్గ— సావిత్రమ్మ ఆ వేదన కంతు లేదు. ఎంతో అపురూపంగా పెరిగిన దుర్గ దెబ్బ మీద దెబ్బ, సహించవలసి రావటం ఆమాతృ హృదయం భరించలేక పోతూంది. హరి గాభరా చెప్పక్కరలేదు. ఆందోళనతో అతని మనసు పని చెయ్యటమే మానుకుంది చికాకుగా వూరికే అటూ, ఇటూ తిరుగుతూ, తల్లి మీద విసుక్కున్నాడు.

"వూరికే అలా, ఏడుస్తూ కూర్చుంటే ఏమవుతుందీ ? కొంచెం కాఫీ పెట్టు తోవలకు వెళ్ళు— నేను దుర్గను మంచం మీద పడుకో బెడ్తాను." అన్నాడు. సావిత్రమ్మ కంగారుగా వంట గదిలోకి వెళ్ళింది హరి దుర్గ ముఖం మీద కొంచెం చన్నీళ్ళు జల్లి, రుమాలుతో ముఖం తుడిచాడు. దుర్గ కళ్ళు కొంచెం తెరిచి, వెంటనే నీరసంగా రెప్పలు వాల్చింది— హరి ఆమెను లేవదీసి మంచం మీద పడుకోబెట్టాడు.

ఆ ఉత్తరం, రామేశ్వరమ్మ వ్రాయించింది శంకర్‌కు ముందర కొంచెం జ్వరం తగిలి, అది క్రమంగా మశూచికంలోకి దింపిందని— తల్లి అందించిన కాఫీ త్రాగి దుర్గ "అమ్మా ? నా సామాను లన్నీ, సర్ది పెట్టావా ?" అంది నీరసంగా.

హరీ ! సావిత్రమ్మా, కూడా గతుక్కుమన్నారు.

"అంటే ? !" అన్నాడు హరి తీక్షణంగా—

"తొమ్మిది నెలలూ కూడా నిండాయి. నువ్వక్కడికి ఎలా వెళ్తావమ్మా !" అంది సావిత్రమ్మ ప్రాధేయ పూర్వకంగా !

దుర్గ దృఢంగా, "కాదమ్మా ! వెళ్ళాలి." అంది.

హరి కోపంగా "బొత్తిగా జ్ఞానం లేకుండా మాట్లాడతావేం ? ఇవాళో రేపో ప్రసవించే సమయంలో, రైలు ప్రయాణం చేసి అక్కడకు వెళ్తావా ? వెళ్ళి మాత్రం నువ్వేం చేయగలవు ?" అన్నాడు.

దుర్గకు ఎక్కడ లేని ఆవేశమూ వచ్చింది.

"వెళ్తాను ! వెళ్తాను ! అక్కడకు వెళ్ళి, ఏం చెయ్యలేక పోయినా, సరే ! దారిలో చచ్చినాసరే ! నువ్వు నేను నీ చెల్లెల్ని కాననుకున్నాసరే ! నన్నాయన రానీయక పోయినాసరే ! నే నక్కడికి వెళ్ళిపోతాను. నన్నెవరూ ఆపలేరు."

ఎర్రబారిన కళ్ళతో తడబడే— అడుగులతో దుర్గ తానే తన పెట్టె దగ్గరకు వెళ్ళింది. సావిత్రమ్మ అడ్డుతగిలి, "నువ్వుండు, నేను సర్దుతాను. నన్ను కూడా రమ్మంటావా ? నిన్నొక్క దాన్నీ పంపటానికి భయంగా ఉంది" అంది.

"అంతకంటేనా అమ్మా ! హరి అన్నయ్య ఏమైనా అంటాడేమోనని కాని."

"ఇట్లాంటి సమయంలో ఏమంటాడూ ?" అని ఆవిడ హరి వంక చూసింది— హరి మాట్లాడ కుండా అక్కడి నుంచి వెళ్ళి పోయాడు.

వెక్కివెక్కి ఏడుస్తూ తన గుండెల మీద వాలి పోయిన దుర్గను ఆప్యాయంగా నిమిరాడు శంకర్ అతనికి దృఢంగా తెలుసు— తన అస్వస్థత గురించి వింటే, మరణ శయ్యమీద ఉన్నాసరే, దుర్గ లేచి వస్తుందని—

"మీకు నా మీద నిజంగానే, ఇంత కోపం వచ్చిందా ? ఇన్ని రోజుల వరకూ, నా కెందుకు తెలియపరచటం లేదూ ?" అంది దుర్గ బాధగా.

"ఇలా ముంచుకు వస్తుందని నేమా అనుకో లేదు దుర్గా ! మామూలు జ్వరమనుకున్నాను."

శంకర్ బాధగా మూలిగాడు. దుర్గ అతని బాధ చూసి సహించలేక పోయింది. మన్నని అతని శరీరం నిండా పెద్ద పెద్ద పొక్కులు సందులేకుండా వ్యాపించి ఉన్నాయి. జ్వరంతో వళ్ళు పేలిపోతూంది.

దుర్గ భయంతో వణికింది తన ప్రవర్తనలో ఏమైనా, లోపముందా ? ఆ కారణంగా, భగవంతుడు తననిలా శిక్షింప దలచుకున్నాడా ? దుర్గ ఆర్తయై భగవంతుడిని మనసులోనే ప్రార్థించు కుంది. "నా కెంతటి ఘోర శిక్షలనైనా ఇయ్యి— ఎంతటి వేదననైనా కలుగజెయ్యి— కానీ, నా మాంగల్యాన్ని మాత్రం నాకు దూరం చేయకు. ఇందుకు ప్రతిఫలంగా నా దగ్గర నుండి ఏమైనా తీసుకో ! నన్నే తీసుకుపో !"

దుగ్గరకు శంకర్ అస్వస్థత తప్ప ఇంకోటేమీ మనసులో లేదు బాధతో మూలిగే అతని కంఠ స్వరం తప్ప ఇంకేమీ వినిపించటం లేదు తాను నిండు మనిషినన్న మాటే మర్చి పోయింది. తనకు కష్టమే కలుగుతూందో, సుఖమే కలుగుతూందో ఆమెకు తెలియటంలేదు. అందరూ కోరగా కాసేపు నిద్రపోవడానికి కనులు మూయగానే, శంకర్ బాధతో మూలిగినట్లయి, వెంటనే లేచి శంకర్ దగ్గర కూర్చునేది.

దుర్గ తపన, శ్రమ ఫలించాయి. మశూచికం తిరుగు ముఖం పట్టింది. శంకర్ మృత్యువు నోటి నుంచి బయట పడ్డాడు — అందరూ హమ్మయ్య అనుకున్నారు.

సరిగా నిద్రపోకుండా తన దగ్గర కూర్చున్న దుర్గను చూసి శంకర్ "నాకు తగ్గింది కదా ! నువ్వు విశ్రాంతి తీసుకో ! కాసేపు నిద్రపో !" అన్నాడు—

"ఫరవాలేదు." అంది దుర్గ సంతృప్తిగా నిట్టూరుస్తూ.

"ఎందుకు ఫరవాలేదు ? నువ్వు శ్రమ పడితే పడ్డావు కానీ, నా పాపను శ్రమపెడితే వూరుకోను"

దుర్గ హృదయం పులకించింది. ఇది చాలు— ధనమక్కర్లేదు. హోదాఅక్కర్లేదు. ఏమీ అక్కర్లేదు. ఈ మాత్రపు ఆప్యాయత చాలు—

శంకర్‌ను మశూచి విడిచి పెట్టినా, దాని ఛాయలు మాత్రం శంకర్ ముఖం మీద నిలిచి పోయింది. అతడు కృంగి పోయాడు.

"దుర్గా నేనెంతో వికారంగా ఉన్నాను కదూ !" అన్నాడు.

ఆ దీన స్వరానికి దుర్గ కడుపు తరుక్కు పోయింది శంకర్ అతిశయాని కంతకూ, మూలమైన అతని రూపం దెబ్బతింది. ఈ దెబ్బకు శంకర్ తట్టుకో గలడా ?

"ఏం లేదు. ఏవో రెండు మచ్చలు ముఖం మీద ఉంటే మాత్రమేం ? మీ కళ్ళలోని తేజస్సు ఎక్కడకు పోతుందీ ? నాకిది వరకటికీ, ఇప్పటికీ, ఏం తేడా కనుపించటం లేదు. ఇప్పుడే, ఇంకా ఆకర్షణీయంగా ఉన్నారు. ఇంకా మనం అదృష్ట వంతులం ఏ, కన్నో, కాలో పోకుండా ఇలా బయట పడ్డాం"

ఈ సమాధానంతో శంకర్‌కు కొంత స్వాంతన కలిగింది. "నేను వికారంగా ఉంటే, నన్ను ఇదివరకులా ప్రేమించగలవా ?" శంకర్ మళ్ళీ అడిగాడు. ఈ ప్రశ్న దుర్గ మనసుకు కొంచెం కష్టం కలిగింది

"అంటే, నేను మీ రూపాన్ని చూసి మిమ్మల్ని ప్రేమిస్తున్నాననా ?"

ఇది పూర్తిగా అబద్ధం కాకపోయినా, పూర్తిగా నిజం కూడా కాదు సృష్టికర్త మానవులకు ప్రసాదించే అపురూపమైన వరాలలో రూపం ఒకటి అని ఒప్పుకుంటాను స్త్రీ పురుషుల పర స్పరాకర్షణలో దీనికి ప్రధానమైన స్థానం ఉన్న విషయం కూడ యదార్థమే ! కానీ మనం ఒకరిని ప్రేమించ గలిగినపుడు వాళ్ళు అందంగా ఉన్నా, లేక పోయినా, మంచి వాళ్ళయినా, చెడ్డవాళ్ళయినా, మనను, అభిమానించినా, ద్వేషించినా, మన ప్రేమ నాశనం కాదు అందరి విషయమూ, ఏమో, నా అనుభూతిలోకి వచ్చేది మాత్రం ఇదే !"

శంకర్ దుర్గ చేతిని ఆప్యాయంగా నొక్కి "నా అదృష్టాన్ని చాలా ఆలస్యంగా గుర్తిస్తున్నాను దుర్గా !" అన్నాడు.

దుర్గ సంతృప్తిగా నిట్టూర్చింది

## 25

దుర్గ మొగపిల్లవాడిని ప్రసవించింది. శంకర్ స్వయంగా, గిరికీ, ఉమకూ, హరికీ, టెలిగ్రాంలు ఇచ్చాడు. గిరి, ఉమ, తమ శుభా కాంక్షలు టెలిగ్రాం ద్వారా తెలియ పర్చారు. హరి తనే వచ్చాడు. జానకి ఈ వార్త తెలియగానే, వెంటనే వచ్చి, హాస్పిటల్‌లో ఉన్న దుర్గనూ, పండు లాంటి పసివాడినీ చూసి నవ్వుతూ "ఆ రోజుల్లో ఒక పతివ్రత తన భర్త సౌఖ్యం కోసం సూర్యుణ్ణి ఆపుచేసిందట! ఈ నాడు మా దుర్గ సృష్టిని వాయిదా వేసింది ఇంచుమించు పదకొండు నెలలు మోసావు— ఇంత నీరసంగా, కన్నావేం ?" అంది.

దుర్గ నీరసంగా నవ్వింది "ఈ మాత్రంగా ఉంటేనే గండ మయింది. ఇంకా ఉంటే అడగాలా ?" అంది.

జానకి తాను తెచ్చిన రాగూ బొమ్మ పిల్లవాడి

తరువాయి పేజీ చూడండి

# వాపసి

ఆర్ఫియస్

నిద్ర లేచాడు మూర్తి. ఆవలించాడు. వాచీ చూసుకున్నాడు.

"పదకొండుం బావే!" అనుకున్నాడు.

కొంచెం తలనొప్పి ఇంకా మిగిలి ఉన్నట్లనిపించింది. కళ్లు వాచిఉన్నాయి.

"వెధవది—విస్కీ త్రాగకుండా ఉండాల్సింది" అనుకున్నాడు. రాత్రి రెండున్నర దాకా తన గదిలో జరిగిన కాండ తల్చుకున్నాడు. ఆలీ, బాబు, మైక్, చాంగ్, శర్మ, డాక్టర్ మిత్రా— తనూ.... రెండున్నర దాకా బంగాళాదుంపల చిప్స్ తింటూ, జీడిపప్పు మింగుతూ, మధ్యమధ్య సాండ్ విచ్‌లు— అందులో గ్రామఫోను మీద పాటలు! రవి శంకర్ 'ఈవెనింగ్ మెలోడీ' నుంచి బిథోవెన్ 'మూన్ లైట్ సోనాటా' దాకా.. ఛలోక్తులు... ఎదురుగా టేబులు మీద మూడు ఖాళీ సీసాలు— కన్పించాయి.

లేచి నిల్చుని వాటిన్ని తీసి అవతల ఉంచాడు.

మరో సీసా— చిన్న బీర్ సీసా కన్పించింది. అడుగున కొంచెం మిగిలి ఉంది. అదీ అవతల పెట్టాడు. ఎలెక్ట్రిక్ హీటర్ మీద కాఫీకి నీళ్ళుంచాడు తర్వాత. దంతధావనం, క్షురకర్మ, ముఖప్రక్షాళనం కానిచ్చాడు.

కాఫీ త్రాగుతూ కూర్చున్నాడు.

"మరో అరవయి గంటలు— తర్వాత...." అనుకున్నాడు.

తర్వాత—

లండన్— పారిస్— రోమ్— బొంబాయి— సిగరెట్ వెలిగించాడు మూర్తి ఆలోచిస్తూనే..

తర్వాత—

హైద్రాబాదు! భాగ్యనగరం! కోటీ! చిక్కడపల్లి!



పన్నెండువేల మైళ్ళు ! సప్త సముద్రాల అవ తల— భరతఖండం—

డ్రాయర్లోంచి విమానం టిక్కట్లు తీసుకుని చూచాడు. లండన్‌లో ఇండియాదాకా టిక్కట్లు తయారుగా ఉంటాయి. 'హే' మార్కెట్‌లో.... కాఫీ తాగడం అయిపోగానే సూట్‌కేస్‌లోకి సామాన్లు సర్దడం మొదలు పెట్టాడు. థీసిస్ కాపీలు రెండు.... మూడేండ్ల శ్రమఫలితం— తన్ను ఒక్క సారిగా 'మిస్టర్' నుంచి 'డాక్టర్ మూర్తి'గా మార్చేసి విద్యాధికుల్లో అగ్రశ్రేణికి త్రోసిన పరికరం ఇది !

ఫోటో ఆల్బమ్ తీస్కున్నాడు.... తను రోమ్‌లో తర్వాత ఇక్కడా తీస్కున్న ఫోటోలు— బోటులో డెక్ టెన్నిస్ ఆడుతూ మంచులో నడుస్తూ, ఎండా కాలంలో రంగురంగుల షర్ట్లలో, వసంత ఋతువుతో ఎర్రబారిన మేపుల్ చెట్ల ఆకుల మధ్య ! స్నేహితులు. .. న్యూయార్కులో— నయాగరా వద్ద— ఉన్నట్టుండి ఆగిపోయాడు మూర్తి.

ఎదురుగా ఫోటో తనకేసి చూడసాగింది.— చక్కటి పెదవులు తన్ను చూచి మందహాసం చేశాయి.. ఇంద్ర ధనస్సు లాంటి నిడుపాటి కను బొమల క్రింద వెన్నెల చిందుతూ— నీలి కళ్ళు తన్ను పలకరించాయి..

ఆల్బమ్ ఒక్కసారిగా బరువయిపోయింది. అవతల ఉంచేశాడు మూర్తి. మోయలేక... చేతులు కాక, మనసే బలహీనమయి పోయింది. తూలుతూ పోయి పడక మీద కూర్చున్నాడు.. మాల.. మాల.. వవసంత సుమలిల....

* * *

ఆ రోజు తనకింకా ఎంతో జ్ఞాపకం...... ఇండియా— కెనడా సంఘం వారి దీపావళి పార్టీ రోజది... తను ఒక వైపు నిలబడి అందర్నీ చూస్తూ ఉన్నాడు. హిందీ, బెంగాలీ, అరవం విని పిస్తున్నాయి. తనకు కొత్త ఇంకా.

"హలో" అని విన్పించింది ప్రక్కన. తిరిగి చూచాను.

ఆరడుగుల ఎత్తున, స్ఫురద్రూపి, చెయిచాపి కరచాలనం చేశాడు.

"నాపేరు మూర్తి" అన్నాడు మూర్తి.

"నా పేరు రాయ్.... మీది మద్రాసా ?" అన్నాడతను.

"కాదు. నేను హైద్రాబాద్ వాసిని."

"అది నిజాం సంస్థానం కదూ ?"

"ఒకప్పుడు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్.... మాది అసలు కోస్తా ప్రాంతం."

"నా కంత పరిచయం లేదు మన దేశంతో.. నేనిక్కడ| స్థిరవాసం ఏర్పరచుకున్నాను. పది పన్నెం డేడ్లాయి పోయింది."

"అలానా...." అన్నాడు మూర్తి. ఎవరో పిలిచా రతన్ని.

"క్షమించండి" అంటూ అతను అవతలికి పోయాడు.

పార్టీ అయిపోయింది కార్లు బయలుదేరాయి. మూర్తి బయటికి నడిచి బస్‌కోసం బయలు దేరాడు,

"హలో" అని విన్పించింది ఎవరో పిలవడం. కార్లోంచి ఎవరో పిలుస్తున్నారు. కారు దగ్గరకు



చేశావు ! నిజం .... అంతా మర్చిపో ! పారిస్‌లో నా పేరుచెప్పి గుక్కెడు షాంపెన్ ఆచమనం చేయి..... సర్వపాప పరిహార్థం ! బై — గుడ్‌లక్—" అన్నాడు శర్మ.

కరచాలనం చేశాడు మూర్తి, శర్మ, మైకెల్‌తో. మైక్ మూర్తిని కౌగలించుకుని చెంపల మీద ముద్దిడుకున్నాడు. "భగవంతుడు నీకు మేలు చేస్తాడు" అన్నాడు గ్రీక్‌లో.

మూర్తి చెయ్యి ఊపుతూ విమానం వైపు నడిచాడు.

విమానం మరింత విషాదంగా అరిచింది ——

* * *

బాబు గడియారం చూచుకున్నాడు. రెండు యాభై. ఈపాటికి పోస్టుమెన్ వచ్చి ఉండాలి. తనకేమయినా వచ్చాయో లేదో ? ఒక్కసారి రూముకుపోతే బాగుంటుంది" అనుకున్నాడు

ఎదురుగా ఆయిల్ పంపుశబ్దం చేయసాగింది. మెర్క్యురీ డిఫ్యూజన్ పంపులో పాదరసం చిందులు తొక్కింది. అటూ ఇటూ చూచాడు బాబు. "సాయంత్రందాకా ఇదికాదు. మరి— అంతేకాబోలు.." అనుకున్నాడు విసుగ్గా వి. పి. పి. వేపు చూస్తూ. రికార్డు గుర్రుమంది.

ప్రతిరోజూ ఇలాగే దినానికొకసారి ఆశ శిఖరా లందుకుంటుంది. మరుక్షణం అగాధం.. లేదా అంతకు మించిన ఆకాశం. ఒక్క చిన్న కాగితం ముక్క, నాలుగు పంక్తులు ఎంత భేదం తెస్తాయి. తన పర్సు తెరిచి, చూచుకున్నాడు. నాలుగు నెల్ల ముందు తీసిన ఫోటో, తను సూటుతో నీటుగా నిల్చున్నాడు. ప్రక్కన తలవంచుకుని, సిగ్గు దొంతరల మధ్య నుంచి చూస్తూ శారద.... బుగ్గన చుక్క.

గాఢంగా నిట్టూర్చాడు. తల్చుకుంటే వెంటనే రెక్కలు కట్టుకుని ఎగిరిపోవాలనుంది. మళ్ళీ, మూడేండ్లకు కాబోలు... తిరిగీ.. ఆ క్షణాలు మళ్ళీ....

శారద జాబు వ్రాసి నెల కావస్తోంది ! ఎందుకని వ్రాయలేదు ? తను ఎంతగానో చెప్పాడు పల్లెటూరు— యాభై అయిదు నయాపయిసా ఏర్‌మెయిలు లెటర్లు దొరకవు.. తనతో తీసుకు పొమ్మని.. మర్చి పోయి ఉంటుంది. మొట్టమొదట తను వెళ్ళేరోజున తన అడ్రసు వ్రాసి ఇచ్చిన కవరు మీదే వ్రాసింది. తనకు కంఠతా వచ్చు.

"నాకు మీలాగ కవిత్వం వ్రాయడం రాదు.. నా జాబులు మీకు సంతృప్తినివ్వలేక పోవచ్చు. మీ ప్రయాణం ఎలా జరిగింది ? ఆ రోజు నేను చాలా ఒంటరిగా అయిపోయాను.. మీ ఫోటో చూస్తూ కూర్చున్నాను. మరి, నా ఫోటో మీతో మాట్లాడుతోందా ? ఒంటరిగా కూర్చున్నప్పుడు మీరు జ్ఞప్తికి వస్తారు. ఏమిటేమిటో ఆలోచనలు వస్తాయి. అనుకోకుండా కళ్ళ వెంట నీళ్ళు వస్తాయి.. కాని, అశుభం అని నాకు తెలుసు.'

'మీరు త్వరగా రండి.. నాకు మళ్ళీ మీతో మాట్లాడాలని ఉంది అప్పటిలాగా. ప్రతిరోజూ రోజులు లెక్కవేస్తున్నాను. కాని తరగడం లేదు. మీ ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకొమ్మని ప్రార్థిస్తూ మీరు వ్రాసింది చదివి అన్నయ్య తెలుగులో చెప్పాడు. అంత చలిలో వాళ్ళందరూ ఎలా ఉంటారు ?.."

అమాయకత్వం, మమతా, ఆరాధనా— వందల వేల మైళ్ళు దూరం చేయలేని సాన్నిహిత్యం తలపుల్లో చేరువయ్యే మనసు..

తనసలు పెండ్లి వద్దన్నాడు ఇక్కడికి వచ్చే ముందు. అమ్మా నాన్నారూ ఒప్పుకోలేదు.. తను శారద నంతకు ముందెప్పుడో ఒకసారి చూచా డంతే జూన్‌లో పెండ్లి చూపులూ, జూలైలో వివాహం ఆగస్టులో అజ్ఞాతవాసం....

వాటి మధ్య ఇరవయి రోజులు గగన విహారం, మబ్బుల్లో తిరిగా రిద్దరూ... శారదను ఆ కొద్ది రోజుల్లో తను పూర్తిగా అర్థం చేసుకున్నాడు. ఆధునిక సమాజం ఇంకా మసిపూయని హృదయం.. ఆప్యాయతా అనురాగమూ, సౌమ్యతా తప్ప మరేదీ చొరని మనస్సు..

ఆమె పుట్టి పెరిగిన పల్లెటూరి లాంటి స్వచ్ఛమైన శారద !

"మిస్టర్ బాబూ, లెటర్స్ ఫర్ యు.." అన్నాడు తోటి సహాధ్యాయి ఆలీ.

తను ఇంటి చిరునామా, కాలేజి చిరునామా రెండూ ఇచ్చాడు. కాని ఎప్పుడూ ఇంటికే వ్రాసేది శారద !



**జాబొక్కటి విడగొట్టుకుంటూ వెళ్ళి చూశాడు.**

**రెండు ఉత్తరాలు !** ఒకటి నాన్నగారి అక్షరాల్లా ఉన్నాయి !

**రెండోది !** మరింకెవరు! చదువుకున్నాడు త్వర త్వరగా..

"...**మీకు** వ్రాయటంలో ఆలస్యం అయి నందుకు క్షమించ వలసిందిగా ప్రార్థిస్తున్నాను. **ఇక్కడి వచ్చే రోజు ఈ జాబులు తెచ్చుకోటం మర్చి పోయాను. అవి వచ్చేసరికి ఇంత ఆలస్యం అయింది. నేను ఆరోగ్యంగా** ఉన్నాను. నాన్నగారూ, **అమ్మా, అమ్మమ్మా మిమ్మల్ని అడిగారు....**"

నెమ్మదిగా నడుచుకుంటూ తన రూమువేపు నడిచాడు బాబు. క్షణం పాటు కూడా దృష్టి జాబు నుంచి తీయకుండా. అతని అడుగులు తేలిగ్గా పడ్డాయి...

*    *    *

**జాబు** చదువుతూ బాబు నడిచి పోవడం **చూచి శర్మ** నవ్వుకున్నాడు.

"**ఈ** 'గృహస్థు'**లకి** జాబులు తప్ప మరోటి **అక్కర్లేదు !**" అన్నాడు ఫోను చేస్తూ.

"**హలో**, మిస్ ఫ్లీగర్—హలో— గుడ్‌మార్నింగ్" **ఇంగ్లీషులో** అన్నాడు

"**హలో**, షెర్మా, ఏమిటి విశేషాలు" అంది **అవతలి** కోమల కంఠం.

"మరేముంది.. చిన్న వార్త ముందు చెప్పి, **తర్వాత** అసలు సంగతి చెప్తాను నిన్న."

"అసలు సంగతి చెప్పు ముందు."

"నీకు తెలీదేమిటి ! వారం రోజులు మనసూ **శరీరమూ** కరిగేలా శ్రమించిన మాబోటి వారికి మరింకేం కావాలి ! కంపెనీ, నైస్ కంపెనీ" అన్నాడు **శర్మ.**

"అదా ! దానికేం.. మీ ఇండియన్లెవరూ దొరక లేదా ?"

"ఇండియన్లా ! భోజనానికైతే వెడతాను.. **కానీ**, వారాంతంలో విహార సమయం మాత్రం స్వదేశీయులతో గడిపినంత ఘోరం హిట్లర్ **కూడ** చేసి ఉండడు !"

"అదుగో.. నేను జెర్మన్ అనా, అలా అంటావు!" **చిరుకోపం** సంప్రదించింది

"నో నో.. కాకపోయినా నీవు ప్రపంచం మీద **దండయాత్ర** సాగిస్తే ఎదురు నిలిచే యోధు **లెవరున్నారని !** నేనే ఇండియాకు రాజు నయి ఉంటే **అది నీ చేతుల్లో** ఉంచేసేవాడ్ని !"

"చాల్చాలు.. మరి అసలు సంగతి చెప్పవుగా !"

"**విను..** శుక్రవారం.. ఎల్లుండి సాయంత్రం.. **వీలవుతుందా** ?"

**ఇంత** సాగపెట్టాను. ఆఖరికి తెగదేమో ?

"ఎల్లుండా ? నాకు వీలుకాదేమోనని భయంగా **ఉంది**.. మా బంధువులు ఆల్బర్టా నుంచి వస్తారు.. **నీవు ముందుగా నాతో** చెప్పవల్సింది."

**ఒక క్షణం మాట్లాడలేదు** శర్మ..

"**నెరజాణవి నీవు !**" అన్నాడు తెలుగులో ఫోను **లోకి.**

"ఏమిటీ ? నీ భాషలో మాట్లాడకు.."

"**మరేం** లేదు.. 'ప్రయత్నించలేవా ? అన్నాను" **అన్నాడు** శర్మ వెంటనే.

"సారీ.. మరో సారి.."

"నీ శ్రొద్ధం.. నీవు కాకపోతే.." అనుకున్నాడు.



"**ఒకే. బై..**" **ఫోను ఉంచేశాడు.**

ఆలోచించాడు. మారియన్ మధురంగా తప్పించుకుంది

మరి, శుక్రవారం సాయంత్రం ఏం చేయాలి తను ? ఫోను తీస్తున్నాడు

"**నెంబరు డయల్ చేశాడు.**"

"**హల్లో.. నేను.. శర్మని.. క్లారా ? హలో..**"

"**అవును..**"

"**నేను.. జ్ఞాపకం ఉందా ?**"

"ఉండకేం.. నా చేయి చూసి చెప్తానని తప్పించుకున్న ఇండియన్‌వి."

"ఓ, దానికేం.. ఆ ! ఎల్లుండి సాయంత్రం డాన్స్ ఉంది. నిన్ను అడుగుదామనుకున్నాను."

"చేయి చూస్తావా ?"

"దానికేం అన్నానుగా.. కాని దక్షిణ ఏం ఇచ్చు **కుంటావు ?**"

"**ఏం కావాలి ?**"

"ఎల్లుండి సాయంత్రం చెబుతాను.. మరి, సాయంత్రం ఏడు గంటలకి

వస్తాను.. ఓకే ?"

"ఓ కే. బై."

"బై"

ఏదో ఒకటి.. కొంచెం మళ్ళీ హస్త సాముద్రికం కొంచెం హిందూ మతం గురించీ, కొంచెం వర్ణా శ్రమ ధర్మాలూ, కాశీ నగరం, గాంధీ మహాత్ముడూ— చదువుకోటం మంచిది పోయేముందు..

ఈ తెల్లవాళ్ళకి మనకంటే ఎక్కువ తెలుసు నని తను తెలుసుకున్నాడు మొదటి వారంలోనే. అందుకనే ఎక్కడయినా చిక్కుపడితే అది 'ఆప ద్ధర్మ సూత్రాల్లో వ్రాయబడ్డాయని' తప్పించుకో వచ్చని కూడా **అర్థమయింది.**

"అంటే" అనేవారు పాపం, వాళ్ళు.

"దాన్ని తర్జుమా చేయలేము సంస్కృతం"

ఆ పేరే ఉచ్చరించడం రాని వారికిది నిజంగానే తోచడంలో తప్పేముంది ?

"ప్రపంచంలో దేన్ని గురించో ఓదాన్ని గురించి తెలీని వాళ్ళుండబట్టే నాలాంటి వాళ్ళు బ్రతికి పోతున్నారు !" **అనుకున్నాడు శర్మ**.. గది వేపు నడుస్తూ.

"**శర్మాజీ, లెటర్స్**" **అన్నాడు బాబు, ఆనం** దంగా.

"నీ ముఖం చూస్తే తెలీదూ.. **మీ ఆవిడేమం** టుంది ! ప్రాణేశా, వెంటనే తిరుగు టపాలో వచ్చేయి అందా !"

బాబు నవ్వాడు. జాబు అందిస్తూ శర్మకి, శర్మ జాబు తీసుకున్నాడు చిరునామా కోడి గీకినట్లుంది.

"ఇది ప్రేమలేఖే నాకు తెలుసు.. తమ్ముడో బావగారో, లేకపోతే ఖచ్చితంగా నాన్నగారో ఓ వంద రూపాయలు పంపమని వ్రాసి ఉంటారు" అనుకున్నాడు చదువబోతూ

"వూ ! తమ్ముడే.. అయితే ఫర్వాలేదు.. చిన్న డిమాండు !"

"మేమంతా క్రికెట్ టెస్ట్ మాచికి పోవాలను కుంటున్నాము. ఇంకా నెలరోజులుంది. నీవు నాకు ఇరవయి అయిదు రూపాయలు పంపించు.

**మా ఫ్రెండు దగ్గర తీసుకుంటాను సహాయానికి రాకపోతే.. అమ్మా నాన్న బాగా ఉన్నారు. అన్న** య్యకు మళ్ళీ ట్రాన్స్ఫరు వచ్చేలా ఉందిట. నాన్న గారు అదే అన్నారు.. నీవు పంపిన మంచు ఫోటోలు చాలా బావున్నాయి. స్టాంపులు పంపించు.. నాన్నకు చెప్పకు.."

"క్రికెట్— స్టాంపులు— ఫోటోలు.. ఫరవా లేదు.. అయిదు డాలర్లతో సరిపుచ్చాడు.."

**తనిక్కడ బంగారం పోగు చేస్తున్నాడని వాళ్ళ అభిప్రాయం....** సగానికి సగం ఎగిరి పోతోంది **తిండికి. తను వంట చేసుకోలేడు** బాబు, ఆలీ లాగా.. ఎవరు చేతులు కాల్చుకుంటారు ? తలనొప్పి. తినడం ఫర్వాలేదు.. అన్నీ కడుక్కుంటూ కూర్చోవాలి. తర్వాత.. అంట్లు ! గదిలో జర్నల్ మీద తలపెట్టు కూర్చున్నాడు.. ఈ జాబు లెప్పుడూ ఇంతే.. అన్న య్యకు బదిలీ.. అంటే మళ్ళీ మొదలు.. **ఈసారి తను ఉండడు**.. నాన్నగారి వందా పదిహేను **రూపాయల్లో తమ్ముడూ, అమ్మా, నాన్నగారూ, చెల్లాయీ, వచ్చే పోయే బంధు సముదాయం, ఇత్యాదులు.**

"భగవాన్, త్వరగా నాలుగు రిజల్ట్సు వచ్చేలా చేయి ! ఈ పనేదో ముగించుకుని వెళ్తాను **అమెరికాకి.. చేతిలో కొంత డబ్బన్నా మిగుల్తుంది అక్కడ**.. నాన్నగారికి నెలకో వందయినా పంప వచ్చు.." అనుకున్నాడు.

ఎన్ని డాన్సులలో చేసినా ఎంత బీరునీళ్ళు త్రాగినా, ఈ బాధ్యత వదలదు. మరో విషయాన్ని అనుకుని బాధలు మర్చి పోవడం, నీడనుంచి తప్పించుకోడం లాగా జన్మలో వీలుగాదు.. ఇదిలా సాగాల్సిందే ప్రతి క్షణం—

తను వచ్చిన క్రొత్తలో ఎంతసేపూ ఇంటి పిచ్చే చుట్టుకునేది తనకు. ఈ క్రొత్త భోజనం, రుచీ పచీ లేని తిండి— సాయంత్రం ఆరు గంటలు కొట్టక మునుపే డిన్నర్,—

అన్నిటికంటే ముఖ్యంగా స్నేహితులు. **ప్రతి** శుక్రవారం సాయంత్రం ఏమీ తోచేది కాదు. ఎంత సేపని చదువుకుంటూ ఒంటరిగా కూర్చో డం? ఆ తర్వాత ఒకసారి ఇంటర్నేషనల్ హౌస్‌కు పోయాడు తను. అక్కడా ప్రతివాడూ 'డాన్స్' చేయడం నేర్చుకుంటున్నాడు. **ఎవర్తో మాట్లాడ డం ?**

**తను** ఓ మూలగా ఏ పత్రికో చేతపుచ్చుకుని **అంత** మందిలో మరింత ఒంటరిగా కూర్చోడం. దినాలు గడిచేకొద్దీ తను ఈ పద్ధతికి అలవాటు పడలేదని తెలిసి వచ్చింది.

ఆ తర్వాత— తనూ డాన్స్ నేర్చుకోడం మొద లెట్టాడు.

ప్రప్రథమంగా సిగ్గేసేది తనకే. ఎవరో తెలీని యువతుల్ని నృత్యాని కాహ్వానించడం తనకు చాలా కష్టంగా ఉండేది. తర్వాత డాన్సు చేసేంత సేపూ ఎక్కడో చూచేవాడు. నెమ్మదిగా తన్ను తాను పరిచయం చేసుకోవడం, పేరూ వూరూ చెప్పుకోడం, ఆ తర్వాత మాట్లాడడం వచ్చాయి.

రెండు మూడు నెల్లయేసరికి తనలో మార్పు తనకే తెలిసి వచ్చింది. తను డాన్సు బాగా చేయడమే కాక అత్యంత సహజంగా ఎదుటి యువతితో ఛలోక్తులాడడం, 'కాఫీ'లకు ఆహ్వానించడం,

ఆ తర్వాత టెలిఫోనులో గంటల కొద్దీ [illegible] వాగడం అలవాటయ్యాయి.

తనకు తెల్సిన కొంచెం హస్త సాముద్రికం వగైరాలు తన 'పలుకుబడి'కి బాగా తోడ్పడ్డాయి.

ఇన్ని జరిగినా ఒక్కరోజు అనుకోకుండా 'ఘోరంగా' తయారయేది.

నాన్నగార్నించో, అన్నయ్యో, ఎవరో ఒకరు 'ప్రేమలేఖలు' వ్రాసేవారు. తనూ, అవసరం కాబట్టి, మరోలా అనుకుంటారని, నెలకో ముక్క వ్రాసి పడేసేవాడు. పోనుపోను అదో అలవాటయింది. మొదటి వారంలో జాబు గీకి పడేయటం.. పెద్ద వ్రాసేదేమీ లేక పోయినా.

తను ఇంటి బాధ్యతలు తప్పించుకుంటున్నాడా అంటే అదీ నిజం కాదు. తను ప్రతి నెలా ఇరవయ్యో ముప్ఫయ్యో డాలర్లు పంపించుతూనే ఉన్నాడు. 'దేశ సేవ' అనే వాడు తను ఎవరన్నా అడిగితే...

తను రెండేళ్ళలోనూ బాగా మారిపోయాడు. సిగరెట్లు తను వారానికో పాకెట్టు త్రాగేది ఇప్పుడు దినానికొకటయింది. మద్యం ముఖం చూడని తను ప్రస్తుతం "యాభై సెంట్ల కోక్"— బీర్‌కు మారుపేరు— ప్రతి రోజూ త్రాగకుండా ఉండ లేక పోతున్నాడు. ఎంత పని ఉన్నా తన టెలిఫోను ద్వారా ఎవరో ఒక తెలిసిన 'గర్ల్'ని పార్టీకో, డాన్సుకో 'మూవీ'కో తీసుకు పోతున్నాడు పిలిచి.

"నేను ఇండియాకు తిరిగి పోగలనా ?" అనుకునే వాడు

ఆ ప్రశ్నే అతన్ని వేధించేది.

ఈ స్వేచ్ఛ, ఈ వాతావరణం తనకు నచ్చాయి. తన్నెవరూ అడిగేవాడు లేడిక్కడ. తనెవ్వరికీ జవాబులు చెప్పనక్కర్లేదు—

తిరిగి ఇండియాకు పోతే ?

మళ్ళీ అదే ఇల్లు.. అన్నయ్యా, పిల్లలూ నాన్న గారు. తమ్ముడు.

బాధ్యత ! తను దేన్ని సహించలేడో అవి— శర్మ లేచి నిల్చున్నాడు— దాహంగా ఉంది రగాంకు పోయి కొంచెం గొంతు తడి చేయుందే పనిసాగదు.

దుస్తులన్నీ వేసుకుని నడిచాడు బయటికి..

బయట చల్లగా ఉంది. జోరుగా చలిగాలి ముఖం మీదకు కొట్టింది. ఇలా ఎన్నాళ్ళో సాగదు. ఈ కల అంతం కాక మానదు..

ఒక్కసారిగా దిగులుండి [illegible] వస్తుంది. తను ఎంత ప్రయత్నించినా, నవ్వు కున్నా వీలుకాదు..

చలిగాలికి చేతులు బిగుసుకు పోసాగాయి. చెవులు ఎర్రబారి నొప్పిపుట్ట సాగాయి.

కళ్ళల్లో నీరు చేరింది.. విదిలించుకున్నాడు వాటిని కోపంగా.

"చలి— చలిగాలికి నీరు కార్తోంది— అంతే!" అనుకున్నాడు వేగం హెచ్చింది— గాలి మరీ ఉధృత మయింది—

డాక్టర్ మిత్రా పైప్ పొగాకుతో నింప సాగాడు. ఎదురుగా టేబిల్ మీద పుస్తకాలు చిందర వందరగా పడివున్నాయి "వీటన్నిటినీ సర్దాలి రేపు" అనుకున్నాడు పొగ పీల్చుతూ. ప్రతిరోజూ అంతే. ఒక క్షణం గది అంతా చెక్కుచెదరకుండా శుభ్రంగా వుంటుంది. మళ్ళీ చూసేసరికి పుస్తకాలు, దుస్తులు, కాగితాలు, గది నిండా వుంటాయి. వాటిని మళ్ళా యథాస్థానానికి చేర్చటం ..... మళ్ళీ మొదలు.

45 వ పేజీ చూడండి



దగ్గిరపెట్టి కాస్సేపు కూర్చుని వెళ్ళిపోతుంటే, గేటు దగ్గిర హరి ఎదురయ్యాడు. తనను చూసి చిరునవ్వు నవ్విన హరికి, సమాధానంగా తనూ నవ్వి "మీ రొక్కరే వస్తున్నారేం ?" అంది.

"అదేం ప్రశ్న ? నేనింకా పెళ్ళి చేసుకోలేదు"

"అది తెలుసు, నేను గిరిని గురించి అడుగుతున్నాను. దుర్గ ప్రసవించిందనే వార్త తెలిస్తే ఆయన రాకుండా ఎలా ఉండగలిగారూ ?"

హరి ముఖం గంభీరంగా మారిపోయింది.

"మీరు కూడా దుర్గ విషయంలో ఇలా

# సంపెంగ పొదలు

31 వ పేజీ తరువాయి

అవమాన కరంగా మాట్లాడతారని అనుకోలేదు"

జానకి తెల్లబోయింది

"అవమానకరం ఏమిటీ ?"

"మీకంతా తెలిసే, ఇలా మాట్లాడటంలో అర్థ మేమిటి మరి ! ?

"ఏమిటి, అంతా తెలియటం ?"

"మీరు అమాయకత్వం నటించనక్కర్లేదు. ప్రసాద్ నాకంతా చెప్పాడు."

ఇప్పటికి జానకికి విషయం అర్థమైంది. గిరి ఈ మధ్య అసలు కనుపించక పోవటానికి కూడా కారణం తెలిసింది

"హరి గారూ ! మీరు కాస్త సావకాశం చూసుకుని ఒక సారి మా ఇంటికి రండి. మీతో చాలా విషయాలు మాట్లాడాలి."

హరి, ఆశ్చర్యంగా చూసాడు.

"దయచేసి తప్పకుండా రండి— నేను మీకంతా

తెలుసుకుంటున్నాను. ఏమీ తెలియదని ఇవాళ తెలిసింది."

హరికి కుతూహలం కలిగింది. "ఏమిటో?" అన్నాడు.

"ఇక్కడకాదు. స్థలమూ, సమయమూ కూడా అనువైనవికావు మాట్లాడటానికి— మా ఇంటికి రండి— మరచిపోవద్దు. అశ్రద్ధ చేయవద్దు."

అని జానకి వెళ్ళిపోయింది—

హరి లోపలకు వెళ్ళి దుర్గను పలుకరించి అల్లుడిని ముద్దు పెట్టుకున్నాడు.

గిరిని గూర్చి అడగాలని నాలుక చివరి వరకూ వచ్చినా ఆగిపోయింది దుర్గ—

"గేటు దగ్గర జానకి కనుపించింది" అన్నాడు హరి.

"అవును ఇప్పుడే, నా దగ్గర నుంచి వెళ్ళింది"

"ఎందుకో, వాళ్ళింటికి రమ్మని మరి, మరి చెప్పింది. నాతో చాలా మాట్లాడాలిట!"

దుర్గకు కొంచెం ఆశ్చర్యం కలిగించింది. బహుశా ఉమ విషయం కావచ్చుననిపించింది.. అయినా, తానేమీ, మాట్లాడక వూరుకుంది.

హరి వెళ్ళిపోయాక శంకర్ వచ్చాడు.

"దుర్గా! నేను గిరి దగ్గరకు వెడుతున్నాను" అన్నాడు.

దుర్గ మనసు, ఆనందంతో పొంగి పోయింది

"నీకు కష్టం కలిగించ వద్దని ఎన్నివిధాలు గానో నచ్చ చెప్పాడు గిరి నాకు. నేను కూడా అతని మాటలు పాటించాలనే అనుకున్నాను. కానీ, ఎందు కనో అంతా అలా అయిపోయింది. బహుశా, ఈ కారణం వల్ల గిరికి, నా మీద కోపం వచ్చి ఉండవచ్చు— నేనే వెళ్ళి బ్రతిమాలి తీసుకు వస్తాను గిరి రాకపోతే, ఈ సంతోషమంతా సంతోషంగానే లేదు నాకు"

దుర్గ తన కళ్ళతోనే సంతోషమూ, ఆంగీకారమూ, కృతజ్ఞతా తెలియ పరచుకుంది.

శంకర్ పొత్తిళ్ళలో పసివాడిని చేతులలోకి తీసుకుని వెంటనే భయంగా పడుకో పెట్టేశాడు. దుర్గ హాయిగా నవ్వింది— రైలుకు టైమవు తూందని శంకర్ వెళ్ళిపోయాడు.

తన ఇంటికి వచ్చిన హరిని సాదరంగా ఆహ్వానించింది జానకి— ఒక ప్లేటులో బిస్కట్లూ, ఏపిల్ ముక్కలూ, అరటిపళ్ళూ పెట్టి మంచినీళ్ళూ కాఫీ కప్పూ దగ్గర పెట్టింది.

హరి మొహమాటంగా "ఇప్పుడివంతా ఎందుకూ? మీరేదో మాట్లాడతానంటే వచ్చాను." అన్నాడు.

జానకి నవ్వింది. "ఇప్పుడు మాత్రం మాట్లాడ వద్దన్నానా? తింటూ మాట్లాడుకోవచ్చు."

హరి ఇంక వాదించక, సంగతేమిటన్నట్లు చూశాడు.

"ప్రసాద్ అన్నయ్య మీతో ఏం చెప్పాడు?"

"మీరు చెప్పిందే చెప్పాడు."

"నే నసలు, ఏం చెప్పలేదు. అన్నయ్యే, నాతో ఏదో చెప్పబోతుంటే, నేను చెప్పనియ్యలేదు. నాకు చెప్పబోయింది. బహుశా, మీకు చెప్పి ఉంటాడు."

హరి ఆశ్చర్యంగా "ప్రసాద్, కంత అవసర మేమొచ్చింది?" అన్నాడు.

"అవసరం ఏం లేదు. ఉడుకుమోతుతనం— ఒక రకం తిక్క. తమ తిక్కవల్ల ఎదుటి వాళ్ళకు అపస్మ కలుగుతుందని గుర్తించలేని తెలివితక్కువ— కాకపోతే మూర్ఖత్వం, మీ బావగారి సంగతి మీకు తెలుసుగా! ఆయనకు దుర్గ మొగవాళ్ళతో మాట్లాడటం ఇష్టం ఉండదు. అందుకని దుర్గ అన్నయ్యలు అమ ఇంటికి రావద్దని చెప్పింది తోటి స్నేహితుడైన గిరి, అంత ఆత్మీయంగా చూడ బడటమూ, తనను ఇంటికి రావద్దనటమూ. ప్రసాద్ మనసులో ఈర్ష్యను కలిగించి ఉండాలి అందుకనే మీతో అలా మాట్లాడాడు."

"మరి చుట్టు ప్రక్కల వాళ్ళంతా అను కుంటున్నారట! శంకర్ ఇంట్లో ఉండని సమయంలోనే, గిరి వస్తాడట!"

"చుట్టు ప్రక్కల వాళ్ళు అనుకునేటంత వెర్రిగా గిరి కానీ, దుర్గకానీ, ఏ నాడూ ప్రవర్తించ లేదు— సరే! ఇప్పుడు మీరు మా ఇంటికి వచ్చారు మా ఆయన ఇంట్లో లేరు అంటే మీరు .."

నవ్వుతూ ఆగిపోయింది జానకి

హరి ముఖం ఎర్రబడగా "ఛ!" అన్నాడు.

"దుర్గ విషయమూ అంతే! హరిగారూ! అయినా, మీరీ విషయాన్నింతగా సాగదీస్తున్నారు. మీకు మొదటి నుంచీ అన్ని విషయాలూ తెలియవు కాబోలు! తెలిస్తే ప్రసాద్ కాదు. బ్రహ్మ చెప్పినా, దుర్గా, గిరిలను గూర్చి మరోకలా భావించేవారు కాదు."

"మీరు తెగ వూరిస్తున్నారు అసలు విషయం చెప్పకుండా!" విసుగ్గా అన్నాడు హరి—

"శాంతించండి! దుర్గ మొదట్లో తాను గిరిని ప్రేమించా ననుకునేదట— కానీ, గిరి, ఆమె మనసులో ఉన్నది వాత్సల్యం కానీ, ప్రేమకాదని, తాను కూడా ఆమెను చెల్లెలిలాగ అభిమానిస్తానని నచ్చచెప్పి, తానే ప్రోత్సాహపరచి శంకర్‌తో వివాహం జరిపించాడట! ఇక శంకర్‌కుగానీ, దుర్గకు గానీ, గిరి పట్ల ఏదో భావ మెందుకొస్తుందీ? అదీ గాక శంకర్‌కు మొదటి నుంచీ, గిరి అండగా నిలబడి అతనిని ఆదుకున్నాడు. గిరి వ్యక్తిత్వం పట్ల శంకర్‌కు ఎంతో గౌరవం— ప్రపంచంలో ఎవ్వరినీ గౌరవించని శంకర్ గిరిని గౌరవిస్తాడు ఎవ్వరినీ విశ్వసించని వాడు, గిరిని మనసారా విశ్వసిస్తాడు. అతని మాట వేదమనుకుంటాడు. అట్లాంటి గిరికీ, సాధారణ స్నేహితుడైన ప్రసాద్‌కూ పోలిక ఏమిటి?"

"మీకీ సంగతులన్నీ ఎలా తెలుసూ? దుర్గ చెప్పిందా? నాతో చెప్పలేదేం?"

"మీకు చెప్పటానికి మొహమాటం పడి ఉండవచ్చు. నాకీ సంగతులన్నీ దుర్గ చెప్పింది. ఉమ ఉత్తరాలవల్ల కూడా తెలిసాయి."

"ఉమ మీకు ఉత్తరాలు కూడా వ్రాస్తుందా?" ఆశ్చర్యంగా అడిగాడు హరి.

"అవును నేనూ, దుర్గా, ఉమా, చిన్నతనంలో విడిపోయాం ఉమ మళ్ళీ నాకు కాలేజీలో కలిసింది. పి యు. సితో మానేసి నేను పెళ్ళి చేసుకున్నాను. ఉమ మెడిసిన్‌లో చేరింది. ఆ ఒక్క సంవత్సరంలోనే చాలా ఆత్మీయులమయ్యాం మేం విడి పోయిన దగ్గర్నుంచీ, ఎప్పుడూ ఉత్తరాలు వ్రాసుకుంటూనే ఉన్నాం ఈ సంగతి దుర్గకు కూడా తెలుసు.

"అయితే ఉమ మెడిసిన్ వదలటానికి కారణం తెలుసా?" సందేహంగా అడిగాడు. హరి

"తెలుసు. ఇంకా చాలా తెలుసు. మీకే, ఏమీ తెలియదు. నేను మీకు ఉమ ఉత్తరా లిస్తాను. చదువుకోండి. మీకే తెలుస్తుంది నేను గిరిని మంచివాడుగా నిరూపించటానికి ఈ ప్రయత్నం చెయ్యటం లేదు మీకు అసలు విషయం తెలియక ముసుగులో గుద్దులాట అనుభవిస్తున్నారు. ఉన్నది ఉన్నట్లు తెలిసికున్నాక మీ ఇష్టం వచ్చి నట్లు విచారించండి."

జానకి తన బీరువా తెరిచి ఒక పెద్ద ఉత్తరాల కట్ట బయటకు తీసింది అది చూసి చాడిలి పోయాడు హరి. అది గమనించి జానకి నవ్వుతూ "కంగారు పడకండి. ఇవన్నీ కాదు [illegible] కొంచెం ఇస్తాను" అంది

కొంచెం సేపు ఆ ఉత్తరాలన్నీ వెతికి, కొన్ని ఏరి హరి [illegible] జానకి— హరి వాటిని జేబులో పెట్టుకుని, జానకికి "థాంక్స్" చెప్పి బయటకు నడిచాడు (సశేషం)



# పెళ్లిచూపులు

29వ పేజీ తరువాయి

బాధపడుతూనే, బద్ధకరగా ఆవలిస్తూ లేచి కూర్చున్న వసంతని గుండెలకు అదుముకుంటూ నడిపించుకు వెళ్లింది. అమ్మ.

"ఎందుకే అమ్మా! యిప్పుడు లేవడం. నిద్ర వస్తోందే." కళ్లు మూసుకుని నడుస్తూ అంది.

"పెళ్లివారొచ్చేశారు తల్లీ. మెలుకువ తెచ్చుకో మరి." బుజ్జగింపుగా అంది అమ్మ.

"అబ్బ........నాకు పెళ్ళొద్దే ఇప్పుడు......" నిద్రలో పలవరింతలా అంది వసంత.

"ఛీ! ఏం మాటలవి? నీళ్లతో ఆ నిద్రకళ్లు తుడుచుకుని హాల్లోకి వెళ్లి కూర్చో. నేనిప్పుడే వస్తా."

స్నానాల గది ముందు వదిలేసి అమ్మ వంటింట్లోకి దారితీసింది.

అప్పటికి పూర్తిగా మెలుకువ తెచ్చుకుంది వసంత. నీళ్లతో కళ్లు తుడుచుకుని తలుపు చాటు నుంచి హాల్లోకి తొంగి చూసింది. మెర్క్యురీ బల్బ్ కాంతిలో హాలు నిండా కూర్చున్న మొగవాళ్లలో అన్నయ్యా, నాన్నగారూ కన్పించారు. ప్రక్కనే ఉన్న చిన్న గదిలో ఎవరో ఆడవాళ్లు కూర్చు ఉండటం చూసిన వసంత వెనక్కు పరిగెత్తుకుని కొచ్చి పెరట్లోనే కూర్చుండిపోయింది.

"అమ్మో! అంత మంది కొత్త వాళ్ల మధ్యలో తనెళ్లి ఎల్లా కూర్చుంటుంది? తనకి భయం కాదూ?"

గుండెలు చేత్తో పట్టుకుంది.

"అమ్మా! నాన్నగారు త్వరగా తీసుకురమ్మంటున్నారు. వసంతని." అన్నయ్య కంఠం వంటింటి దగ్గర గొణగటం వింది వసంత.

"అయ్యో యింకా వెళ్లలేదుటే వసూ!

ఏం పిల్లవే. నడూ తల్లీ. వాళ్లంతా నీకోసం చూస్తున్నారు."

"నాకు భయంగా ఉందే అమ్మా! నేను రాను." రెక్క పుచ్చుకు లేవదీస్తున్న అమ్మతో దీనంగా అంది వసు.

"భయం లేదు తల్లీ! నేను ఉంటాగా నీతోకూడా. బామ్మ, నాన్న, అన్నయ్యా అంతా అక్కడే ఉన్నారు. విశాలని కూడా రమ్మని కబురు చేశా. పద్మా, అదీ కలిసి వస్తూ ఉంటారీపాటికి. చక్కగా ధైర్యంగా కూచుని వాళ్లేమైనా అడుగుతే జవాబు చెప్పాలి, సిగ్గుపడకుండా. తెలిసిందా? అతనసలే గొప్ప చదువు చదువుకున్నవాడు. చిన్నవాడైనా! నీ అదృష్టం ఎలా ఉంటుందో మరి. పాటపాడమంటే మొండికెయ్యకుండా పాడాలి సుమా." హాల్లో చాప మీద కూర్చునే దాకా అమ్మ వసంత చెవిలో నూరి పోస్తూనే ఉంది.

"తలెత్తి చూడవే వసూ! నీ ఎదురుగా కుర్చీలో కూర్చున్న అబ్బాయే పెళ్లికొడుకు. ఎంత బావున్నాడో!"

చెవిలో గొణిగింది విశాల ఎప్పుడొచ్చిందో.

"ఉస్.......పో అవతలకి." అంటూనే తలెత్తి ఒక్క క్షణం అతనితో కళ్లు కలిపి ఘుబుక్కుని తలదించేసుకుంది వసంత.

"అమ్మో......అతనలా తనవైపే చూస్తుంటే గుండె దడదడలాడుతోంది తనకి."

"నీ పేరేమిటే తల్లీ?" పెళ్లికొడుకు ప్రక్కనున్న ముసలాయన ప్రశ్నకు జవాబిచ్చింది వసంత.

తల ఒంచుకోవటంలో వసంత చెవులకున్న పోళ్ల జూకాలు తళుక్కున మెరిశాయి.

"ఒక్క పాట పాడతావా అమ్మా!"

చిన్న గదిలో కూర్చున్న అతిథుల్లోంచి ఓ పెద్ద ముత్తైదువ లాలనగా అడిగింది.

"చక్కగా పాడాలి వసంతా. సిగ్గుపడకు."

అమ్మ, చెవి దగ్గర సన్నగా చెప్పింది.

"ప్రక్కనా......నిలబడీ......." త్యాగరాజా కృతి అందుకుంది వసంత. పాట మొదలెట్టగానే సన్నగా ఒణికిన కంఠం గొంతు సారించి పాడినకొద్దీ తేనె వాకలా ప్రవహించి, జాజి మొగ్గల సౌరభంలా గదినంతటినీ నింపుకుంది.

"చాలా చక్కగా పాడావు తల్లీ......యింక చాలమ్మా. లోపలకు వెళ్లచ్చు నువ్వు."

ముసిలాయన వైపు కృతజ్ఞతగా చూసి లేచి నుంచున్న వసంత ఆ అబ్బాయి వైపు ఒక్కసారి ఓరగా కనుకుల్లో నుంచి చూడకుండా ఉండలేకపోయింది. "ఆ పెళ్లి కొడుకు నిన్నే చూస్తూ కూర్చున్నాడే. ఆడపిల్లలంటే మొహం వాచినట్టు." అంది విశాల లోపలకు వచ్చిన వసంతతో.

"ఏం కాదు. చాలా మంచి వాడులా కన్పించాడే నాకు. నిజానికి యిలాంటి పెళ్లిచూపులు, పరీక్షలూ నేను ఆహ్వానించుకుంటాను." వసంత కంటే రెండేళ్లే పెద్దయినప్పటికీ ఆరిందాలా అంది పద్మ.

"వసంత పాడుతున్నప్పుడు మాత్రం ఆ అబ్బాయి ఒళ్ళంతా చెవులుచేసుకుని విన్నాడే పద్మా.

"నిజానికి ఆ అబ్బాయి తనకి చాలా మంచి వాడుగా అందంగా కనిపించాడు. ఏమో! తనకేం తెలుసు! అమ్మా నాన్నగారూ ఎలా చేస్తే అలా వినటం తనవంతు." అనుకుంది.

"పెళ్లిచూపుల అధ్యాయం ఆ విధంగా ముగిసి మధుర స్మృతిగా మిగిలిందిప్పుడు తనకి."

పెళ్ళవటం, అమ్మతో దెబ్బలాడి పట్టుదలగా తను స్కూల్ ఫైనల్ పూర్తిచేయటం, ఆనందరావు కలిసి హైదరాబాదు వెళ్ళిపోవటం, అన్నీ త్వర త్వరగా జరిగిపోయినట్లు అనిపిస్తోందిప్పుడు

ఆలోచనల్లో మునిగి తేలుతూ ఉండగనే విశాలా వాళ్ల యిల్లు వచ్చేసింది.

మెట్లెక్కుతున్న వసంతకు విశాల గొంతు హెచ్చు స్థాయిలో వినిపిస్తోంది లోపల్నించి

"అదుగో వసంత వచ్చింది. చూడమ్మా వసూ! నువ్వయినా చెప్పుదీనికి. వాళ్లొచ్చే వేళయిందా, ఆ బట్టలు మార్చుకుని మొన్న కొన్న పట్టుచీర కట్టుకోవే తల్లీ అని ఇందాకట్నించీ మొత్తుకుంటుంటే, నా కక్కర్లేదు పొమ్మంటోంది. ఆ వాయిలు చీరతో అల్లాగే ఉంటుందట." విశాల అమ్మగారు వసంతతో మొరపెట్టుకుంది.

"అదికాదే వసూ! నేను చెప్పేది కూడా విను ఈ ఈ పెళ్ళి చూపుల తంతు తల్చుకుంటేనే ఒళ్లు మండిపోతోంది నాకు. ఎవడో ముక్కూ మొహం తెలియని కొండ ముచ్చయినా సరే "పెళ్లి కొడుకును" అని రాగానే, ఆయనగారి ఎదుట, పట్టు వస్త్రాలు ధరించి, ఏడువారాల నగలూ దిగేసుకుని, పుత్తడి బొమ్మలా వెళ్లి కూర్చోమంటుంది అమ్మ.

"ఇక ఆ పెళ్లి కొడుకు తాలూకు యివన్నందీ




మీ యిరవై రీళ్ళ చిత్రాన్ని పరిశీలించాం! "సెన్సార్ కట్" పోగా మిగిలిన చిత్రం ఇది! విడుదల చేసుకోండి!!

# మేలురకం కాఫీ గింజలతో తయారైంది

## ...శాస్త్రీయ పద్ధతిని వేచి పొడి చేయబడింది

## ...పరిశుద్ధమైనదని హామీ!

Brooke Bond
french coffee
(blended with chicory)

Brooke Bond
pure
coffee

**నాణ్యతకై ఎంచబడిన:** దక్షిణాదిలో పండే ఒకటో రకం కాఫీ గింజలనే బ్రూక్ బాండ్ వారి నిపుణులు ఎంచుతున్నారు. మరి మీరు కొనే కాఫీ మిక్కిలి శ్రేష్ఠమైందిగా వుండాలికదా!

**మంచి సువాసన, కమ్మదనం వుండేలావేచారు:** నవీన శాస్త్రీయ పద్ధతిని వేచబడినందుననే మీకు సాటిలేని రుచి, కమ్మదనం యిచ్చి తృప్తిపరుస్తోంది.

**అత్యంత పరిశుద్ధతకై గాలిచొరలేని డబ్బాలలో భద్రపరచబడి:** చేతితో తాకకుండా ఆరోగ్యప్రదమగు రీతిని గాలి చొరలేని డబ్బాలలో, సీలుమార్చి కల్తీచేయ శక్యంగాని రీతిని ప్యాక్ చేయబడి, బ్రూక్ బాండ్ కాఫీ ఎంతో తాజాగా, రుచిగా, కమ్మదనం అలాగే వుండేలా సీలు చేయబడింది.



# పెళ్ళిచూపులు

నఖ శిఖ, పర్యంతం పరీక్ష చేసినా సరే నేను మాత్రం బొమ్మలా అలాగే మెదలకుండా వూరుకోవాలి. వాళ్ల యక్ష ప్రశ్నలన్నిటికీ నోపిగ్గా, చిరునవ్వుతో జవాబివ్వాలి. ఇదీ అమ్మగారి ఆజ్ఞ"

విశాల మాటలకు పకా పకా నవ్వింది వసంత.

"యిదీ....పరస. కొండ ముచ్చులుట అలాంటి అనాకారి పెళ్లి కొడుకులు ఎవరొచ్చారో చెప్పమను అసలు? చూడవచ్చిన నలుగురూ నవ మన్మథుల్లాంటి పిల్లలమ్మా వసంతా దాని మాటలు నమ్మకు వాళ్లకీ, మనకీ కట్న కానుకల్లోను ఇతర విషయాల్లోనూ కుదర్లేదు గాని, కుర్రాళ్ళ రూపనుతే మనకే అదృష్టం లేదంతే"

తల్లిమాటలకు ఖస్సుమని లేచింది విశాల.

"మరే.......నవ మన్మథుల్లాంటి వాళ్లే, చూపు లగుర్రాలు. ఎందుకూ.......? సంస్కారం లేకపోయాక. యింతోటి పెళ్లి కొడుకులూ అవక పోయి నంత మాత్రాన అదృష్టానికికేం లోపం లేదులే...."

"తప్పు విశాలా అల్లా మీ అమ్మగారిమీద విరుచుకు పడితే ఆవిడేం చేస్తారు చెప్పు. నీకోసమే కదా ఆవిడ బాధంతా"

నచ్చ చెప్పబోయింది. వసంత

"నీకు తెలియదు వసంతా తెలిసీ తెలియని చిన్నతనంలో నీకు పెళ్లయిపోయింది. అదృష్టవంతురాలివి. ఈ బాధ నీకు అర్థం కాదు. పెద్ద చదువులు చదివిన వాళ్లే నలుగురు పెళ్లి కొడుకులు. ఏం లాభం? సంస్కారం లేకపోయాక. వాళ్ల ప్రవర్తన నాకెంత కష్టం కలిగించిందంటావ్? పెళ్ళంటే విరక్తి కలిగిందనుకో. అమ్మ బాధ పడుతుందనిగాని, పద్మలాగా "ఈ న్యూసెన్సు నేను భరించలేనని" చెప్పాలనిపిస్తోంది"

"మొదటిసారి చూడటానికి వచ్చిన వరుడు ఆఫీసరు హోదాలో ఉన్నాడుట. అతనితో మేనత్తా, ఆమె భర్తా వచ్చారు. ఇక చూసుకో ... వాళ్ల ప్రశ్నల పరంపర........... ...

"ఏం చదువుతున్నావమ్మా....... ?" మేనమామ ప్రశ్న

"బి. ఎస్. సి పాసయానండి." నా జవాబు.

"మా అబ్బాయికి హిందుస్థానీ గాత్ర సంగీతం అంటే ఇష్టం. నీకు అసలు పాటలు వచ్చా ? మీటింగులకూ, డిన్నర్లకూ వెడుతూ ఉంటాడు ఇంగ్లీషు మాట్లాడటం బాగా వచ్చా ?" ఆ మేనత్తకు ఎలా జవాబివ్వాలో తెలియక తల వంచుకు కూర్చున్నాను

"మావాడికి, అన్ని పనుల్లో చేతయి చెలాకీగా ఉండే పిల్లంటే ఇష్టం. నీకు కుట్లూ, వంటా అవి చేతనవునా ?"

ఈవిధంగా సాగింది వాళ్ల ప్రశ్నల పరంపర. ఇష్టాలన్నీ వాళ్ళ అబ్బాయి సొత్తే అయినట్టు.

వాళ్ళు వచ్చి వెళ్ళిన నాలుగోనాడు ఉత్తరం వచ్చింది అందులో నేను అతిగా సిగ్గు పడుతున్నట్టు కనిపించానుట. "ఇలాంటి అమ్మాయితో నాకు కుదరదు నేను సొసైటీలో 'మూవ్' అవాల్సినవాణ్ణి," అంటూ వ్రాశాడు

"ఇక .. తర్వాత వచ్చిన వాళ్ల పరీక్షలు చూడు. ఒకావిడ జడ సొంతమో కాదో అని లాగిచూసింది. యింకొకావిడ, కాలివేళ్లు, చేతి గోళ్లు కూడా సరిగ్గా ఉన్నాయో లేదో పరీక్షించింది. ఒకరు నడుపినుంటే ఇంకోరు పొడుగు సరిపోతానో లేదో కొల్చుకున్నారు. ఈ పరీక్షంతా కుర్చీలో కూర్చున్న పెళ్ళికొడుకు గుడ్లప్పగించి చూస్తూ ఉండగనే. ఇవన్నీ పరీక్షించి "పిల్ల నచ్చలేదు. మరీ మొగరాయుడిలా సమాధానాలు చెప్తుంది. ఆడపిల్లలకు సిగ్గే అందం. అని అన్నారుట. అసలు విషయం......వాళ్లకి సరిపడనంత కట్న కానుకలు యివ్వలేకపోవటం మూలాన్ని అని తర్వాత తెలిసింది.

యిక........రీసెంటుగా వచ్చిన 'అప్టుడేట్' పెళ్లి కొడుకు సంగతి చెప్తా విను అతను ఒక్కడే వస్తాడనీ, పెళ్లి కూతురితో డైరెక్టుగానే మాట్లాడుతాడనీ మధ్యవర్తి ముందుగానే తెలియజేశారు.

అనుకున్న రోజుకి ఆయనగారు వేంచేశారు. కాఫీ, టిఫిన్ ట్రేలో పెట్టి, తీసుకెళ్లి యిమ్మంది అమ్మ. పట్టుకు వెళ్లి ఆయనగారి ముందు టీపాయ్ మీద ఉంచాను ప్రక్కనే సోఫాలో కూర్చుని తీసుకోమన్నాను.

అతను టిఫిన్ చేస్తూ..........

"బియస్.సి లో మీ గ్రూప్? మిస్ ......"

"విశాల"

"వ ....... సీ.....విశాల! బ్యూటిఫుల్ నేమ్."

అతని సంభాషణంతా యింగ్లీష్‌లో నడిపించాడు.

"మీ అభిరుచులేమిటి? విలేజస్‌లోని, నేచురల్ బ్యూటీని లైక్ చేస్తారా? సినిమాస్ యిష్టమా? యిన్‌స్ట్రుమెంట్ ఏదైనా నేర్చుకున్నారా ? మీలాగా లేడీస్ అందంగా అలంకరించుకోవటం చాలా యిష్టం నాకు.

మీ వేళ్లు సన్నగా, పొడుగ్గా అందంగాఉన్నాయి. ఆ వేళ్ళతో చిత్రలేఖనం చేస్తే ఎంత అందంగా వస్తాయో ఆ చిత్రాలు...........!

అన్నట్టు.....మీకు ఆర్టులో ప్రవేశం ఉందా ?"

అతని చూపులు సూదుల్లా గుచ్చుకుంటుంటే అవమానంతో కుంచించుకుపోతూకూడా సహించి. కూర్చున్న దానిని, అతనిధోరణి సహించలేక ఘబుక్కున లేచి ఇంట్లోకి వెళ్లిపోయాను.

ఆ తర్వాత అలాంటి మర్యాదలేని పెళ్లికొడుకుని తెచ్చినందుకు మధ్యవర్తితో పేచీ పడిందట అమ్మ.

యిక యిప్పుడు చెప్పు నేను వినుక్కున్నానంటేనూ, పెళ్లిచూపులంటే అసహ్యం వేసిందంటేనూ కారణం ఉందా లేదా?

సిగ్గుపడితే తప్పు. సిగ్గుపడకపోతే తప్పు. జన్మలో యిలాంటి పరీక్ష ఆడపిల్లలకు ఒద్దు బాబోయ్! అనిపించింది. అమ్మకి నా పెళ్లి చేయాలనే తాపత్రయం తప్ప, అవమానంతో నేనెంత కుంచించుకుపోతున్నానో అర్థం కావటం లేదు."

దీర్ఘంగా నిట్టూరుస్తూ అంది విశాల

విశాల పెద్ద పెద్ద కళ్లల్లో, మెరిసిన కన్నీళ్లు చూసిన వాసంత మనసు గిల గిల్లాడింది. నవ్వుతూ, ఆడుతూ పాడుతూ ఉండే విశాల మొహంలో విషాదన్ని చూడలేను" అనుకుంది

"పోనీండి పిన్నిగారూ. ఇప్పుడు విశాలకేం లోటు ఆ సాదాబట్టల్లోనే అందంగా ఉంది అని"

ఎర్ర గలాబి రంగు ఫుల్‌వాయిల్ చీర, తెల్లని 'లాన్' 'బ్లౌజులో' విరాభరణ సుందరిలా, అజంతా

శిల్పంలా ఉన్న విశాలను చూస్తూ సంతృప్తిగా అది వసంత.

సాయంకాలం 6 గంటలయింది. అనుకున్నట్టుగా పెళ్లివారెవరూ రాలేదు.

రకరకాల ఆలోచనలు చుట్టు ముట్టుతూ ఉండగా మెల్లిగా యింటికి జేరింది వసంత విశాల దగ్గర సెలవు తీసుకుని.

"పెళ్లి, స్త్రీ పురుషుల జీవితాల్లో ముఖ్యమయిన ఘట్టం. అయితే ఈ పెళ్లిచూపుల ఘట్టం మాత్రం కేవలం విషమ పరీక్ష అనిపిస్తుంది. తనకి మటుకు విపరీతమైన ప్రశ్నలతో వేధించటం, సంతలో కొనుక్కొనుక్కునే పశువును పరిశీలించినట్లు పరీక్షించడం ఎంత అమానంగా అనిపిస్తుంది. ఆ ఒక్క గంటలో ఒకర్ని గురించి యింకోరు ఏం తెలుసుకోగలుగుతారు.?! మనుష్యుల తీరులు తెలుస్తాయి అంత వరకూ. అంతే పూర్వం రోజుల్లో పెద్దలే సాంప్రదాయం అయిన కుటుంబం అయితే చాలు చేశేసే వారుట పెళ్ళిళ్ళు. తన పెళ్లి అటుఆధునికం కాకుండా, ఇటు పురాతన పద్ధతి కాకుండా అయింది. తనమనసులో 'మరువరాని మధుర స్మృతిగానేమిగిలింది. ఆనందరావు తనఆరాధ్యదైవం.

*   *   *

"వారెలా ఉన్నారో!........."

రైలు హైద్రాబాదు వైపు పరుగులు పెడుతోంది. వసంత ఊహలు రైలుతో పోటీ పడుతున్నాయి. "అమ్మనీ, నాన్నగారినీ పుట్టిన వూరినీ వదిలేస్తున్న ప్రతిసారీ తనకి దిగులుగానే ఉంటుందెందుకనో!

స్టేషన్లో రైలు కదిలేవరకూ నవ్వుతూ కబుర్లు చెప్తూ వీడ్కోలిచ్చిన విశాల కళ్లముందు మెదిలింది.

"పిచ్చిపిల్ల! ఆఖరికి అది కోరుకున్న వరుడు లభించాడు దానికి. ఆ రోజు పెళ్లి చూపుల కొస్తున్నా వన్న భాస్కరం కాలేజీలో దాని సీనియర్‌ట. ఆ రోజుల్లోనే విశాల చిలిపితనం, సంస్కారం అతన్ని ముగ్ధుణ్ణి చేశేవట. "విశాల లాంటి అమ్మాయిని చేసుకోవాలనుకున్న తన కోరికని విశాలే తీరుస్తుందనుకోలేదని, విశాలకి యిష్టమయినట్లయితే తనకేలాంటి అభ్యంతరం లేదని" తెలియజేశాడుట చూసి వెళ్లి.

"తప్పక రావాలే వసూ! చెప్తున్నా. పద్మకు కూడా రాస్తున్నా. మీరిద్దరూ లేని నా పెళ్లి వెల వెల పోతుంది. ఆనందరావుగారి పర్మిషన్ తీసుకుని వారం రోజులు ముందుకే రాకపోవాలి చెప్తా!" ప్రామిస్ చేయించుకుంది విశాల.

"విశాల పెళ్లికూడా ఐపోతోంది యిక పద్మ మిగిలింది. దానిదంతా అదొక తరహా."

క్రిందటి వేసవి సెలవుల్లో వసంతని చూడటానికి వచ్చిన పద్మ కళ్లముందు మెదిలింది.

"వసూ! నువ్వు చాలా అదృష్టవంతరాలివే. మీ ఇద్దర్నీ చూస్తుంటే, హఠాత్తుగా జీవితంలో కలుసుకున్న మీలో యింత అనురాగం ఎలా కలిగిందా అనిపిస్తోంది. కానీ......నేనలా చేసుకోలేను. నాకు కాబోయే జీవిత భాగస్వామిని బాగా అర్ధం చేసుకోగలిగితే అతనితో నేను సుఖ పడగలను. వివాహం గురించి నాకు కొన్ని ప్రత్యేకమైన అభిప్రాయాలు ఉన్నాయి." అంది పద్మ. విశ్చలత, పట్టుదల చక్రాలాంటి కళ్లల్లో కొటొచ్చినట్టు కనిపిస్తున్నాయి.

"నీ పిచ్చిగాని, మనం వేసే ప్రతి అడుగూ చాలా జాగ్రత్తగా వేస్తున్నాం అనుకుంటాం పద్మా. కాని ఆ అడుగు అడుసులో కూడా పడుతూ ఉంటుంది అప్పుడప్పుడు. ఎంతో ఆలోచించి అర్ధం చేసుకున్న వాళ్లు మాత్రం ఎంత మంది సుఖపడుతున్నారో చెప్పు? సంసారం స్వర్గంగా చేసుకోవటం మనచేతిలో వున్నప్పుడు అవతలి వ్యక్తి ఎలాంటి వాడయినా ఫరవా ఉదని నా ఉద్దేశ్యం. మనకు కావలసింది కొంచెం ఓర్మి. అంతే."

తెల్లటి మెడమీద నుంచి జారుతున్న జుట్టును సరిచేస్తూ అంది వసంత.

"ఊహూ...నేను ఏకీభవించలేను మమా నీలో! నన్ను చేసుకునేవాడు నా అభిప్రాయాన్ని, నా వ్యక్తిత్వాన్నీ గౌరవించగలగాలి. మా యిద్దరి మధ్యా అభిప్రాయభేదాలూ, అనుమానాలూ రాకూడదు." చూపుల్ని క్రిందికి వాల్చుకుంటూ అంది పద్మ.

వసంత, నవ్వి వూరుకుంది.

"రైలు ఆగింది! వూహాలోకం నుంచి దిగి వస్తావా లేదా?" నవ్వుతూ ఆప్యాయంగా చూస్తున్న ఆనందరావునీ, తనకి తెలియకుండానే వచ్చిన నాంపల్లి స్టేషన్‌నీ వింతగా చూసి చిరునవ్వులో దిగింది వసంత.

*   *   *

టెన్నిస్ బేట్ తిప్పుకుంటూ క్లబ్బుకు వెడుతున్న ఆనందరావుని గేటుదాటేదాకా చూస్తూ నిల్చుండిపోయిన వసంతకు పద్మ దగ్గర్నించి వచ్చిన ఉత్తరం జ్ఞాపక వచ్చింది.

"వారు ఉన్నంతసేపూ తనకి యింకేం జ్ఞాపకం రానివ్వరు. పసిపాపలా కూడా తిరుగుతారు." చిరునవ్వు పెదవుల మీద చిందుతూ ఉండగా కవరు విప్పింది వసంత.

కుశల ప్రశ్నలూ, యూనివర్సిటీ విశేషాలు అయ్యాక, ఇలా చదువుకుంది పద్మ ఉత్తరాన్ని.

"పెళ్లిని గురించి ఇంత తీవ్రంగా ఆలోచించ లేదెప్పుడూ నేను. ఈ మధ్య శేఖర్‌తో పరిచయం చాలా దూరం తీసుకెళ్ళింది నన్ను. అతనెవరో నీకు జ్ఞాపకం ఉన్నాడనుకుంటా. సెలవుల్లో మన వూరు డాక్టరుగారింటికి వస్తూ ఉండే వాడు. వాళ్ల మేనల్లుడు. అతనే. ఇక్కడ ఇంజనీరింగ్ కాలేజిలో 'రీడర్'గా ఉంటున్నారు. మా యిద్దరి పరిచయం ప్రేమగా మారి అప్పుడే ఒక కేలండరు మారింది. ఇంత ఆలస్యంగా చెప్తునందుకు నన్ను తిట్టుకుంటున్నావ్ కదూ? ఒక నిర్ణయానికి వస్తేగాని చెప్ప కూడదనుకున్నాను. మా 'మేరేజ్' 'డేట్' 'ఫిక్స్' అవగానే వ్రాస్తాను. మీ శ్రీ వారితో సహా రావాలి సుమా? విశాలక్కూడా వ్రాస్తున్నా.

'మేరేజస్, ఆర్ మేడ్, యిన్, హెవెన్' అంటారు. అదే నిజమయితే ఆ హెవెన్ యీ భూతలమే అని నా ఉద్దేశ్యం.

శేఖర్ నా స్వప్నాల నిధి అని వ్రాయటానికి గర్విస్తున్నానే వసూ! ఈ సంవత్సరం అంతా అతన్ని అర్ధం చేసుకోవటానికి చేసిన నా ప్రయత్నంలో నెగ్గాననే అనుకుంటున్నాను. శేఖర్ నా జీవితంతో అపశృతి పలికించడనే నా నమ్మకం ఉంటాను మరి..

*   *   *

పద్మ.

ఆ రాత్రి వసంత తన డైరీలో ఇలా వ్రాసుకుంది. "ముగ్గురు కన్నెలు. అనుభవాలూ, అభిప్రాయాలూ ఏకీభవించకపోయినా ముగ్గురి గమ్యం ఒకటే అయింది.

ఈ మాత్రం అదృష్టం చాలు స్త్రీకి. ఆప్యాయంగా దగ్గిరకు, తీసుకున్న భర్త చేతుల్లో ఒదిగిపోవటంకన్న స్త్రీ యింకేం కోరుకుంటుంది!?" ★



"పెళ్లి చేసుకొని ఇల్లు చూసుకొని చల్లగ..."

ఈ పది సంవత్సరాలూ అలాగే కదూ గడిచింది? పదేండ్లు! సంతొమ్మిది వందల యాభై రెండు! ఆగష్టు నెల! ఆరోజు తను అనుకోలేదు. పదేండ్లు ఇలా పరదేశంలో నివసిస్తానని ..... మూడేండ్లు ... మహా అయితే నాలుగేండ్లు అనుకున్నాడు అతను.....

తర్వాత ఏ బొంబాయిలోనో, మద్రాసులోనో, మంచి ఉద్యోగం దొరకగానే 'స్థిరపడి' పోదామని అనుకున్నాడు.

డాక్టరేట్ చేతి కొచ్చేసరికే నాలుగయిదేండ్లయింది. ఆ తర్వాత సంవత్సరంపాటు లండన్ ....... తర్వాత మూడేండ్లు అమెరికా ..........

ఈలోగా పరిస్థితులు, తనూ చాలా మారి పోయారు ........ ఆరవయిలో తను ఓ నెలపాటు తిరిగి వచ్చాడు. దేశం అంతా మంచి పుద్యోగం కోసం చూచాడు. బొంబాయి, మద్రాసు, కలకత్తా......ఎవో ఉద్యోగాలయితే ఉన్నాయి. గవర్నమెంటులో కొన్ని పరిశ్రమల్లో చాలా.....కాని తనకు నచ్చలేదు.

తన కాళ్ళమీద నిలబడడం, తన అభిప్రాయాలూ ఆశయాలు స్వేచ్ఛగా వెలిబుచ్చడం అక్కడ వీలు కాదని తెల్సుకున్నాడు. ప్రభుత్వోద్యోగాల్లో చిక్కులు తెలిశాయి. పై అధికారికి తను లోబడి వుండాలన్న విషయం రుచించ లేదు తనకి ....... అదీకాక దేశం వదిలి, ఉన్నత విద్యాభ్యాసం కోసం నేలకొలదీ మైళ్ళు పోయి, ఒంటరిగా విచిత్ర వాతావరణంలో సంవత్సరాల కొద్దీ గడిపిన వారికి స్వదేశంలో గొప్ప సత్కారం ఏమీ లభించదని అర్థమైంది.......

ఎక్కడ చూచినా కూపస్థ మండూక విన్యాసం. అంచేత తను తిరిగి పరదేశాల్లో ప్రవాసం మొదలెట్టాల్సి వచ్చింది.

ఇక్కడయితే ఒక్క విషయం మంచిదిగా తోస్తుంది. సామర్థ్యం వున్నంత వరకూ కులమత విచక్షణ లేకుండా పైకి రావచ్చు ............ తను ఇష్టం వచ్చిన శాఖలో పరిశోధన చేయవచ్చు...

కానీ ...............

ఎన్నాళ్ళిలా? మరో రెండేండ్లు జరిగిపోతే తను ఏదో ఒకటి నిర్ణయించుకోవాల్సిన దినం రానే వస్తుంది.

పుట్టి పెరిగిన ప్రాంతం వదిలి మరోదేశవాసి కావటం — పైన్‌లో మంట చల్లారి పోయింది.

తనకు ముప్ఫయి అయిదేండ్లిప్పుడు ..... పాత ఫోటోలు తిరగేస్తే తప్ప తను పదేండ్ల ముందెలా వుండేవాడో జ్ఞాపకం రాదు.

కళ్ళల్లో కాంతి చచ్చిపోయింది. .... నీడలే మిగిలాయి ... జుట్టు కూడా తన ఆశల్లాగే రాలిపోయి దువ్వెన అవసరం తీరిపోయింది .....

చాలా రోజుల్నుంచి స్వదేశం గూర్చి ఆలోచనలే రావటం లేదు.

"రేపు మాంట్రియాల్‌కు పోవాలి .... ఆ ఉద్యోగం దొరకాలి — " అనుకున్నాడు.

ఈ విషయం మీదే తనకూ మూర్తికీ వాదన ప్రతిరోజూ జరిగేది.

"మనం నాలుగురోజులిక్కడ గడిపి, వెంటనే భారత రాజధానిలో కాలరెత్తుకు తిరగాలంటే వీలుకాదు. మనంలాంటి వాళ్ళే, మనకన్న మంచి వాళ్ళే ఎందరో ఉన్నారు. అక్కడ. వారిని తోసి రాజని మనకు విమానం దిగక ముందే భారతీయు లందరూ నెత్తిన కిరీటం ఉంచుతా రనుకోడం పిచ్చి కాదు" అనేవాడు మూర్తి.

## వాహిని

37 వ పేజీ తరువాయి

"మరి ఇన్నిరోజులు, ఇన్ని కష్టాలు పడి తల్లిదండ్రులకూ, ఆప్తమిత్రులకూ, భార్యా బిడ్డలకూ దూరం అయి సాధించిందానికి విలువే లేదంటావా? భారతీయుడు ఫలాని విధంగా అంతర్జాతీయ గౌరవం సంపాదించిం తర్వాత దానికి మనదేశం ఏ విధంగా ప్రతిఫలం ఇస్తుంది! ముష్టి నాలుగు వందల రూపాయలు! నీ నెత్తిన ఒకడు, వాడిపైన మరొకడు, వాడికి పైన మరో పెద్ద మనిషి! ఇంతా చూస్తే వారికి తెలిసిందంతా న్యూటన్ పుట్టకముందున్న విషయాలు!"

"మరి నీకేం కావాలంటావు? పోగానే యూనివర్సిటీలో ప్రొఫెసర్ కావాలంటావా?

"అలా అనను— కాని పడిన శ్రమకు తగిన ప్రతిఫలం ఇవ్వామంటాను. దేశానికి నేను సేవ చేయాలని అంటావు.. కాని దేశం నాకేమి ఇవ్వగలదో ఆలోచించు! నా గౌరవానికీ, నా శక్తికీ సామర్థ్యానికీ తగిన పదవి ఆశించడం దేశద్రోహం కాదు కదా!" అనే వాధు తను.

"నువ్వు ఆ హోటల్ లో భోజనం ఎందుకు చేయవు? అక్కడ చ్చాలా బాగుంటుంది" అని అడిగాడు మూర్తిరావుని.

"నేను యింగ్లీషు ద్వేషిని- ఆ హోటలు బోర్డు ఆంగ్లంలో వుంటుంది" అన్నాడు.

నిజం కాని— ఒక్కటి మాత్రం చెప్పగలను.. మనం అదృష్ట వంతులం.. ఎలాగో ఇక్కడకు వచ్చి ఈ పశ్చిమ నాగరికతా ఫలాల్ని రుచి చూడ గలిగాం.. ఇక్కడ సామర్థ్యాని కిచ్చిన ప్రతిఫలం మన దేశంలో దొరకదు.. మనం అంతస్థాయి కింకా రాలేదు.. మన తాహతు, శక్తి, పెరిగినంతగా మన దేశమూ మొత్తం మీద పెరగలేదు.. ఈ రెంటికీ సామ్యం కుదిరేదాకా ఇంతే.."

"అంటే నీ ఉద్దేశ్యంలో మనకూ, అక్కడే కూర్చున్న వాళ్ళకీ భేదం లేదు."

"ఓ విధంగా అంతే.. కానీ ఇలా చూడు.. మనం మన దేశానికి ఎక్కువ సేవ చేయగలం.. మనదేశానికి మనలాటి వాళ్ళు కావాలి.. పదవీ, అధికారం కాక ఆ తృప్తి ఉంటే చాలు మనకి."

"అబ్బో! నా తృప్తి మరో వేపు ఉంది— నేను ఏ దేశానికి చెందినా నా మేధస్సు మానవాళికోసమే ఉపయోగిస్తుంటాను! చాలా!"

తన మాటల్లో వ్యంగం గుర్తించిన మూర్తి వాదన నిలిపేవాడు..

మూర్తి అలాగే అన్నాడు.. అలాగే చేశాడు..

తను అలా చేయలేదు..

నా తాహతూ, సామర్థ్యమూ వినియోగించుకో లేని చోట— స్వదేశమైనా సరే— ఉండకూడదు.. అది తన్ను తానే చిన్న బుచ్చుకోడమే కాక తను పడిన శ్రమనే వ్యర్థం చేసినట్లవుతుంది.

డాక్టర్ మిత్రా పుస్తకాలన్నీ సర్దసాగాడు. రేపు మాంట్రియాల్ ఉద్యోగం దొరికిందంటే —దొరుకుతుంది— అనేకా క్వాలిఫికేషన్ లున్నాయి.. ఈ దేశంలో పౌరుడుగా తను స్థిరపడి పోవడం ఖాయం.. పైపులోంచి పొగ దట్టంగా లేచింది..

* * *

డాక్టర్ రాయ్ చాలా రోజులుగా మాలలో భేదం గమనించాడు— వెళ్ళేముందు మూర్తి తన్ను చూడలేదు.. కొన్ని రోజులకు ముందే తనకు కన్పించడం మానేశాడు.. పని తొందర అను కున్నాడు తను..

మాల కూడా మూర్తి విషయం అడిగితే ముభావంగా సమాధాన మిచ్చింది.

ఆ రోజు మాలకు వచ్చిన ఉత్తరం మూర్తిదే అని తనకు బాగా అనుమానం.. చదివీ చదవక ముందే చించిపారేసింది మాల — తను అడగలేదు మాల చెప్పలేదు ఎవరు, ఏమిటీ, అని.

"నా స్వార్థం కోసం అనాలోచితంగా ఇక్కడ స్థిరపడిపోయాను.. కాని మాల విషయం ఆలోచించనే లేదు.. నేను.. ఈ సమాజంలో మాల స్థానం ఏమిటి? భారతీయునికీ, పాశ్చాత్య యువతికీ జన్మించిన ఆమెని వివాహం 'చేసుకోడానికి' తను ఎవ్వరికి అనుమతి ఇవ్వగలడు? మూర్తిలాగే ఏ భారతీయుడూ ధైర్యం చేయలేదు.. మరి ఇక మాలతో బాటు నా వంశం అంతమై పోతుంది. స్వచ్ఛమైన కాయస్థ రక్తం పల్చనై పూర్తిగా మారి పోతుంది"

"మాలా.." పిలిచాడు రాయ్.

మాల లోపల్నుంచి వచ్చింది. కూర్చోమన్నాడు రాయ్ ప్రక్కన. దగ్గరగా కూర్చుంది మాల.

"మాలా, ఈ వేసవిలో ఇండియాకు పోదామనుకున్నాను. ఓ రెండు నెల్లు... మర్చి పోయానంతా.. కానీ మిత్రులూ, బంధువులూ ఉన్నారు.. ఏమంటావు?"

మాల మాట్లాడలేదు..

ఇండియా.. తను ఏ నాడో మర్చిపోయిన 'జన్మ' స్థలం. కథల్లాగే విచిత్రమైన దేశం..

కాని తను పోలేదు. ఆ అవకాశం జారిపోయింది. ఆ రోజే..

"నేను పిరికివాడ్ని మాలా నాకేం కావాలో బాగా తెలుసు నాకు.. కాని అందుకు కావలసిన త్యాగ బుద్ధి నాకు లేదు. బహుశా నాకు మా పురాతన నియమాల్ని ధిక్కరించే ధైర్యం, శక్తి లేవనుకుంటాను.. ఉండి ఉంటే ఈ ఉత్తరం కాక నేనే నీ చేతుల్లోపడి ఉండేవాడిని.. ఇంతకన్నా ఏం వ్రాయగలను.. నన్ను క్షమించు నీకు భగవంతుడు ఆనందం, సంపదా, సౌభాగ్యం ఇస్తాడని ఆశిస్తున్నాను —"

చిరిగి పోయిన కాగితం ముక్కలు గాల్లోకి ఎగిరి పోయినా, ప్రతి అక్షరం, పలుకూ తన మనస్సులో ముద్రితమై పోయాయి.

"ఏమిటమ్మా, ఆలోచిస్తున్నావు?" అన్నాడు రాయ్.

"ఏంలేదు. ఈ వేసవి సెలవల్లో నేను ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నాను. నీకు రాబర్ట్ తెలుసుగా. వాళ్ళ కంపెనీలోనే.. అతనే ప్రయత్నిస్తానన్నాడు...అసలు నీతో ముందే చెబుతామని.."

డాక్టర్ రాయ్‌కి మిగతా ఏమీ వినపడలేదు.. ఎప్పుడో యుగాల వెనుక లీలగా విన్పించిన ఘోష మెదిలింది మనస్సులో—"వందే మాతరం." అని.★



అలసట పోయి
హుషారు కలగాలంటే...

మీరూ అంగీకరిస్తారు

# టాటా-ఫిన్లే టీ

సాటిలేని టీ!

టాటా-ఫిన్లే టీ కంటె తృప్తికరమైనదేముంది! ఇందుకు కారణాలు:—

## తాజా టీ

తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

## పరిమళమైన టీ

అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

## ఉత్తమ టీ

టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

**టాటా-ఫిన్లే** టీ త్రాగండి; ఆనందము అందుకోండి!



ఈ క్రింది రకాలలోను, ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే టీ దొరుకుతుంది:-
క్రెస్టెడ్ డార్జిలింగ్—సుందరమైన టిన్
లలిత్—బంగారు రంగు ప్యాకెట్
మిలాప్—వెండి రంగు ప్యాకెట్
బహదూర్—నారింజ రంగు ప్యాకెట్
షాన్—నీలి రంగు ప్యాకెట్



# అపరసంధ్య

24 వ పేజీ తరువాయి

సును కుగిపివేసింది. తల్లి జ్ఞాపకం వచ్చి అతని కళ్ళు చెమర్చాయి.

ఆ యింటి పాలేరు వచ్చి వారి ప్రక్కన నిల బడ్డాడు. అతడు నడివయసువాడు, దృఢకాయుడు, రాజారావు వెంటవున్న వృద్ధుడతన్ని పలుకరించి రాజారావును చూపిస్తూ "వీరు మీ అయ్యగారికి మేనల్లుడు, రాత్రి వచ్చారు అన్నాడు.

పాలేరు సంబరపడి రాజారావుకు నమస్క రించి అంతలోనే కళ్ళ నీళ్ళు పెట్టుకుని "చూడండి బాబూ! ధర్మరాజులాంటి అయ్యగార్ని పొట్టన పెట్టుకున్నారు. దుర్మార్గులు ....కళ్ళలో మెదులు తావుండాడు మా బాబుగారు. ఎవరొచ్చినా నవ్వుతా పలుకరించేవారు ..అదుగో ఆ సుట్టుపాక సూసి నప్పుడల్లా గుర్తుకొస్తది.....ఆయన అక్కడే కూకుని మందులకోసం వచ్చిన మడుసులతో నవ్వుతా, దయగా మాట్టాడుతా ఉండేవాడు... అట్టాటి మారాజుని అన్యాయంగా సంపేసినారు.." అన్నాడు. అతని గొంతు రుద్ధమయింది రాజారావు అతన్ని పరిశీలనగా చూశాడు.

ఇంతలో మునసబు పంచలోకి వచ్చి పిలిచాడు. వృద్ధుడూ రాజారావు నెమ్మదిగా మెట్లెక్కి లోపలికి వెళ్ళి ముందు హాలులో నిలబడ్డారు. ఎడమవైపు గది చీకటిగా ఉంది. మునసబు ఆ గది గుమ్మం ముందు నిలబడి "అమ్మా! సుభద్రమ్మా! ఇదుగో నేను చెప్పాను కదూ! మీ అల్లుడొచ్చాడు..." అన్నాడు.

లోపలి నుంచి హీనమైన కంఠస్వరం వినిపించింది. ఇంటి యజమానురాలు లోపల కూర్చుని వుండి ఏమంటున్నదో స్పష్టంగా వినరాలేదు. మునసబు మాత్రం తాను అంతవరకూ ఆమెతో ఆ విషయమే మాట్లాడుతున్నాడు కాబోలు, కాస్త గట్టిగా "పిచ్చి, అదేం మాటా? నేనేమని చెప్పాను.?...ఎంత కాదన్నా ఆయనకు చెల్లెలూ, మేనల్లుడూ...ఏ పిచ్చి గాని కావలసినవారు కావలసినవారే. నేనయినా మరొకరయినా ఇబ్బందులలో ఆదుకోవలసిన వారమే గాని దగ్గర బంధువులం కాగలమా?" అంటూ రాజారావు వంక తిరిగి అతని భుజం మీద చెయ్యివేసి "ఆపదలో ఉన్న వారి మాటలు మనకు కష్టం కలిగించినప్పటికీ పట్టించుకోకూడదు. ఆమెక్కు నీపట్ల అభిమానం లేదనుకోకు, దెబ్బతిని ఉన్నందువల్ల సహజంగా పొంగివచ్చే ఉద్రేకం అది . అంతకంటె మరేమీ లేదు పద లోపలికి వెళ్ళి పలకరించు..." అన్నాడు.

రాజారావు గుమ్మం దాటి లోపలికి అడుగు పెట్టి, ఎప్పటి[illegible] బంధుత్వం, మమత, ఆప్యాయత పొంగి కంఠస్వరం సాగక పోతూ ఉండగా, కన్నులు నీటితో నిండుతూ ఉండగా "అత్తయ్యా" అని పలుకరించాడు.

(ఇంకా వుంది)




# 28

ఇంతలో విభీషణుడు మేల్కొని శిబిరమునుండి వెలుపలికి వచ్చెను. అతడు ఆంజనేయుని చూచి, జరిగిన సంగతంతయూ గ్రహించి వానరుల కిట్లు బోధించెను.

"ఓ! వీరులారా! ఓ, మీరిట్లు నిరుపాయులై దుఃఖించుటకిది సమయము గాదు. మంత్ర తంత్ర ప్రవీణుడు మహాబలవంతుడగు అహిరావణుడను రావణుని పుత్రుడు ఒకడున్నాడు. బహుశా వాడే రావణ ప్రేషితుడై వచ్చి రాజకుమారులను హరించి తీసుకొనిపోయి ఉండును. ఇంతటి మాయా శక్తి తదన్యులకు లేదు. అదియేగాక నా రూపు ధరించి మన కటకములో ప్రవేశించు సామర్థ్యము ఒక్క అహిరావణునికే గలదు. ఇప్పుడు యేమాత్రము విలంబన చేయక మనలో వీరు డొకడు పాతాళమునకేగి ప్రభువును రక్షించు కొనుటకు ప్రయత్నించవలసియున్నది."

అంతట సుగ్రీవ జాంబవంతాది ప్రముఖులు మహావీరుని లక్షించి — "ఓ ఆంజనేయా స్వామిని రక్షించి విపదాంబుధి పాలైయున్న వానర జాతిని ఉద్ధరించుటకు సత్వరమే ఉద్యమించుము." అని ఏక కంఠమున పలికిరి.

పవనాత్మజుడు ప్రభు భక్తి పరాయణుడు. ఆపత్కాలమందు అతని వీర్యస్థైర్యంబులు విజృంభించి తేజో విలసితమగును. మేరు గంభీరధీరుడగు మారుతి వానరపతి సుగ్రీవునికి వినయుడై నమస్కరించి—" రాజా! దిగులొందక స్వస్థచిత్తుడవై కపి సేనను కాపాడుచుండుము. ఈ యేడెడు పదు నాలుగు లోకములలో సాకేతవాసు లెక్కడున్నను వెతికి తీసుకొని రాగలను. ఇదే సెలవు తీసుకొను చున్నాను.—" అని పలికి మహావీరుడు మరుక్షణమే రామాన్వేషణార్థమై బయలుదేరెను.

## హనుమంతుడు అహిరావణుని సంహరించి, రామలక్ష్మణులను విడిపించుకొనుట

అట్లు దీక్షాబద్ధుడై వజ్ర సంకల్పముతో బయలుదేరిన వానర వీరుడు ఏకధాటిన రామబాణము వలె పాతాళ లోకము ప్రవేశించి అహిరావణుని నగర బహిర్ద్వారమును సమీపించెను. అక్కడ వనచర జాతి వీరుడొకడు నగర రక్ష చేయుచుండెను. నగరము లోనికి పోవుచున్న మారుతి మార్గమును నిరోధించి వాడు ఇట్లు మనవి చేసుకొనెను— "మహాత్మా! నేను మీ కుమారుడను, నా పేరు మకర ధ్వజుడు. లంకాదహనాంతరము మీరు సముద్ర తీరమునకు వచ్చినపుడు, ఒక మత్స్యము మీ స్వేద బిందువులు పానము జేసినందున గర్భము ధరించి నన్ను కనెను. వాడు మొదలు నేనిక్కడ అహిరావణునికి భృత్యుడనై సేవ జేయుచున్నాను. నా యజమానుడీ దినము దేవికి రామలక్ష్మణులను బలి యిచ్చుటకై హోమము చేయుచున్నాడు. కాబట్టి మీరు లోనికి పోవుటకు ప్రవేశము కల్పించి నేను స్వామికి ద్రోహము చేయజాలను." అని చెప్పి వాడు ఆంజనేయుని మార్గమును నడ్డుకొనెను

మారుతి మకర ధ్వజుని పితృభక్తి, స్వామి సేవకు లోన హర్షించెను. తదుపరి మార్గాంతరము తోచ నందున తండ్రి తనయునితో యుద్ధమునకు తల పడెను. వారివురికి కొంత తడవు ద్వంద్వ యుద్ధ మాయెను. పిమ్మట మహావీరుడు మకరధ్వజుని బంధితునిగాజేసి లోనికి పోయెను

అహిరావణుడు పూజా స్థలమందు సమాసీనుడై మాంసరుధిరాదులతో దేవికి హోమము చేయుచుండెను. సమీర నందనుడంత సూక్ష్మ రూపుడై సుమనమాలలో దాక్కొని పూజా గృహము చేరుకొనెను. రాక్షసుడు యథా సమయమునకు మారుతి దాగియున్న మాలను తీసుకుని దేవిని అలంకరించెను. పవన పుత్రుని పాదము సోకగనే దేవి నేలకు క్రుంగి పోయెను. దేవీ స్థానములో హనుమంతుడు వికృతరూపుడై విగ్రహమువలె నిలుచుండెను.— ఆహా! మహా కాళి ప్రసన్నురాలై మనకు ప్రత్యక్షమైన — దని రాక్షసులు సంతుష్టాంతరంగులై శీఘ్రమే బలి యిచ్చుటకై రామలక్ష్మణుల నచటికి కొని తెచ్చిరి. రాజకుమారులను బలి పీఠమున కెదురుగ నిలబెట్టి వారిని మంత్రపూతము జేసిరి. పిమ్మట అహిరావణుడు దేవికి నరబలి యివ్వమని పూజారులను ఆదేశించెను రాక్షస పూజారులు తక్షణమే ఖడ్గములు పైకెత్తి రామలక్ష్మణులను '—ఓ నరులారా! చచ్చుటకు ముందు దేవుని స్మరించుకొనుడు—' అని హెచ్చరించిరి.

ఇంతలో దేవీ విగ్రహ స్థానములో నిలచియున్న మారుతి — "ఓరీ ముష్కరులారా! దేవుని స్మరించవలసినది మీరు, మృత్యువాసన్నమైనది మీకు గాని, వారికి కాదు, —" అని ఆలయము మారు మ్రోగునట్లు సింహగర్జన చేసి, ఆగ్రహోదగ్రుడై అసుర గుంపుపై బడెను. మహావీరుడట్లు ముష్కరులపై లంఘించి వారి చేతనున్న చంద్రాయుధమొక దానిని లాక్కొని దానితో మొదట అహిరావణుని తల తెగటార్చెను. వాని శిరమెగిరి పోయి బలి పీఠముపై బడెను. హనుమంతుడంత గజ యూథములపై కేసరి బడునట్లు మిగిలిన రాక్షసులపై విరుచుక పడెను. కొందరిని కాళ్ళతో రాచి, మరికొందరిని ముష్టి ప్రహరణములతో మర్దించి మిగిలిన వారిని చేతులతో నలిపి, నిముషములో నిశాచారులను నిశ్శేషము గావించెను.

ఇట్లు హనుమంతుడు రాక్షస రక్తముతో దేవికి దాహము తీర్చి, రామలక్ష్మణులను తన వీపుపై యెక్కించుకొని, వాయువేగ మనోవేగమున వచ్చి వానర కటకములో వ్రాలెను.

ప్రభువులను పునః చూడగనే ప్లవంగ సేనకు పోయిన ప్రాణములు తిరిగి వచ్చినట్లయ్యెను. వారు హర్షోత్సాహితులై వాయు పుత్రుని వేనోళ్ల ప్రస్తుతించి అభినందించిరి. యథా పూర్వము వనచరుల మధ్య ప్రసన్నవదనుడై విరాజిల్లిన అవధ కుమారులకు అమరులు మంగళ హారతులెత్తి జోహార్లు పలికిరి. ఈ సుఖ సమయమున నరవానర దేవతాది సకల లోకవాసులు— ఆడి పాడి ఆనందోత్సవములు జరుపుకొని సానందులైరి.

## రావణుడు నరాంతకుని సహాయ మర్థించుట

ఓ, అపర్ణా! చతురుడు జగద్వంచకుడు మాయావి మహా బలవంతుడగు అహిరావణుడు సైతం కోతుల చేతులలో హతుడయ్యెనను దారుణ వార్త చెవుల బడగనే అసురేశునికి అశనిపాతము సోకినట్లయ్యెను. ధైర్యము కోల్పోయి దిగులుగొని దీనాతి దీనుడై విచారించుచున్న దానవ రాజు రావణుని యొద్దకు సచివోత్తము డొకడు వచ్చి ఇట్లు మార్గోపాయము సూచించెను— "రాక్షసేశ్వరా! శత్రువులు దండెత్తి వచ్చి ఇంటిపై బడిరి. మనవైపు మహా వీరులెందరో మడిసిరి విజయమో వీర స్వర్గమో తేల్చుకో వలసిన సమయమాసన్నమైయున్న యీ సందిగ్ధ స్థితిలో మీరివ్విధముగ భయగ్రస్తులై పరితపించుచూ కూర్చున్న అసురజాతి యేమి కావలెను! మీ బల మపారమైనది. మీ శక్తిసామర్థ్యముల చేవ ఇంకనూ శత్రువులు చూడలేదు. రాజా! అహిరావణుడు లేకున్న అంత కంటే ఘనుడు నరాంతకుడు లేడా ? ఈ సమయమున మీరతని సహాయమపేక్షించి శాత్రవ సంహారమునకు పూనుకొన వచ్చును కదా!"

సచివశ్రేష్ఠుని సూచన సమయానుకూలముగ నుండెను. దశగ్రీవుడీ యూహకు సంతసించినవాడై తక్షణమే విహ్వలపుర మందున్న నరాంతకుని పిలుచుకొని వచ్చుటకై ధూమకేతుని పంపెను.

భవానీ! రావణునికి జన్మించిన అనేక కుమారులలో నరాంతకుడొకడు. వీడు అభుక్తమూల నక్షత్రమున పుట్టియుండెను. అందుచే యీ శిశువు ఇంట నున్నయెడల తల్లి దండ్రులకు మృత్యువు తటస్థించునని శుక్రాచార్యుడు చెప్పినందున, రావణుడు నరాంతకుని సముద్రములో పారవేయించెను. నరాంతకుడు చావుతప్పించుకుని బయటపడి పరమేష్టి పరమేశ్వరుల గూర్చి ఘోర తపమాచరించి వారివలన అనేక వరములు బడసెను. పిమ్మట నరాంతకుడు దేవాంతకుడై అంతరిక్షమున విహ్వలపురము నొక దానిని నిర్మించుకుని, అందు డెబ్బది రెండు కోట్ల యాతుధానులకు నాధుడై భోగముల ననుభవించుచుండెను.

ఆ నరాంతకుడు ధూమకేతు ద్వారా సంగతి సందర్భములు తెలుసుకొనిన వెంటనే జాగుచేయక స్వబలము వెంటనిడుకుని పితృ సహాయార్థమై లంక కొచ్చెను. వాడు, వాని డెబ్బది రెండు కోట్ల సేన రామలక్ష్మణులతో అనేక దినములు ఘోర యుద్ధము చేసెను. మాయా యుద్ధ విశారదుడు, వరబలోన్నతుడు అగు నరాంతకుని సాధించుట రామాదులకు దుష్కరములయ్యెను. తుదకు రఘురాముడు సుగ్రీవుని సుతుడగు ధధిబలుని సహాయ్యముతో నరాంతకుని సంహరించి వాని బలమును నిశ్శేషముగావించెను. — అని కాకభుశుండి గరుత్మంతునకు చెప్పియుండిన రామచరిత్ర యందలి అహిరావణ నరాంతక రాక్షసుల అపజయ క్రమము భర్గుడు భవానికి విశదీకరించి చెప్పెను.

## రావణుని తొలియుద్ధము

రావణుని బలమంతయు పుత్రసహితంబుగా క్షీణించినందుకు రాక్షస స్త్రీలు దుఃఖాక్రాంతులై రోదించిరి. దుర్మరణము చెందిన తమ తమ భర్తలను పుత్రులను పౌత్రులను దలచుకుని విలపించుచున్న నిశాచర స్త్రీలకు దుఃఖోపశమనము గావించుటకై రావణుడు వారి కొకింత వేదాంతము బోధించెను.

> "—తబ దసకంఠ అనేక విధి సమురూా—
> యీా సబ నర నారీ,
> నస్వరూప జగత సబ దేఖహు హ్వ
> దయ విచారీ —"

ఓ కాంతలారా! ఈ అఖిల ప్రపంచము నశ్వరమైనది. ఏదిశాశ్వతమైనది! పుట్టుట గిట్టుటకే కదా!" అని పలికి వైరాగ్యము వెలగబెట్టెను. ఇతరులకు ఉపదేశించుట సులభముకదా!

పిమ్మట దశగ్రీవుడు ముఖ్యులగు రాక్షస వీరులను రావించి — " ఓ నిశాచర వీరులారా! విజయమో, లేక వీర స్వర్గమో తేల్చుకొనవలసిన సమయమాసన్నమైనది. నేను నా స్వభుజ బలము నమ్ముకొనే వైరితో విగ్రహము తలపెట్టితిని. నేనీ దినము సమరాంగణమునకు పోయి, శత్రువునికి తగిన శాస్తి చేసి వచ్చెదను. రణ ధీరులగు రక్షో వీరులు నన్నునుసరించి, గుండెబలము లేని భీరువులు మాత్రం ఇండ్లకు మరలి పోవలసినది"— అని హెచ్చరించి దశాస్యుడు యుద్ధమునకు సన్నద్ధుడాయెను.

అత్తరి అసురనాధున కెన్నియో అపశకునములు తోచెను. రావణరాజు గర్వోద్ధతుడు, శుభాశుభములు లక్షించక ముందుకు సాగెను.

దశాస్యుడు క్రోధాతిశయముచే కన్నుల నిప్పులు గ్రక్కుచూ దుర్నిరీక్షణుడై రథంబెక్కి రక్షో పరివృతుడై రణరంగమునకు కదలెను. రథ గజాశ్వాది వాహనములతో, నానావిధ ధ్వజ పతాక ఛత్ర సముదాయముతో, భేరీపణవ శంఖారవములతో, పరశుపట్టిస శూల గదా ముద్గర ఖడ్గాద్యాయుధములతో సమాయత్తమైన రాక్షస యూధములు సింహనాదములు చేయుచూ కాటుక కొండలు కదలినట్లు రావణుననుసరించి నడచెను.

నిశాటుల పదఘట్టనలకు ధరణి దద్దరిల్లెను, ధూళి పటలము సూర్యుని గప్పివేసెను. దిగ్గజములు చలించెను. సముద్రములు ఘూర్ణిల్లెను. వాయువు స్తంభించెను. వీర వసంతుని సేనావాహిని బౌలి మోహరించి ముందుకు బోవుచుండిన దానవ చతురంగిణీ సేనా వైభవము వర్ణింప శక్యము గాకుండెను.

"ఓ జాతుదాన యోధులారా! మీరు మర్కటానీకము నెదుర్కొని వారిని మర్దింపుడు, నేను తాపసులను మార్కొని ధర్షించెదను—" అని ఉద్ఘోషించి రావణుడుగ్రుడై సేనాగ్రభాగమున నిలబడెను.

దానవుడు దృక్పథమైనంతనే వానర భల్లూకములు రణోత్సాహితులై తరుశిలా ఖండములు ఎగురవేయుచూ వచ్చి దనుజులను దార్కొనిరి. పోరు ముమ్మరముగా జరిగెను. రావణ్‌కీ జయ్ — రావణకీ జయ్ — అను ఘోషలు మిన్నుముట్టెను. రామ రావణార్థమై శాఖాచర — నిశాచర వీరులు ప్రాణపణముగా పోరాడిరి.

రణరంగమున రావణుడు రథమందు రఘువీరుడు నేలపై నిలబడియుండుటకు విభీషణుడు డోకించుక నొచ్చుకొని రామమూర్తితో "ప్రభూ! రథము లేదు, కవచము లేదు, తుదకు పాదరక్షలు కూడ లేక యీ దానవ వీరునెట్లు దార్కొనగలరు!" అని శంకాచిత్తుడై పలికెను.

రాముడా మాటలకు మందస్మితుడై విభీషణు నిట్లు ఆశ్వాసించెను.

"సఖా విభీషణా! జయ సాధనకు ధర్మరథ మధిష్టింపవలెను, సాధారణ స్యందన మారోహించిన ఫలితము శూన్యము. ఏ రథమునకు — శౌర్య ధైర్యములు చక్రములుగాను, సత్యశీలములు ధ్వజ పతాకములుగాను, బల వివేక హితోపకారములు గుర్రములుగాను, దయాక్షమలు కళ్లెములుగాను, శంకరుని భక్తుడు సారథిగాను, జ్ఞాన—వైరాగ్య సంయమ — సంతోషములు అస్త్రశస్త్రములుగాను — అమరి యుండునో అట్టి ధర్మరథం బెక్కిన రథికుడు అజేయుడుగా నుండును. వాని నెదురించిన యోధుడీ ముజ్జగముల నుండబోడని నమ్ముము".

రావణానుజుడంత ప్రభువు ఈ మిషతో నాకు ధర్మ ప్రబోధము చేసెనని భావించి ప్రసన్నుడయ్యెను.

" వోగిరిజా! రామరావణులట్లు రణాంగణమున యుద్ధోన్ముఖులై నిలబడినపుడు సురులు సిద్ధులు మునులు మున్నగువారు అంతరిక్షమున విమానములపై నిలచి వేడుకచూడసాగిరి. నేనుకూడా వారితో మండి రామరావణుల యుద్ధక్రీడలను కన్నులారా గాంచగలిగితిని " — అని శంకరుడు పలికెను.

పిమ్మట ప్లవంగ — పౌలస్త్య వీరులు ఒకరి నొకరుపై పరాక్రమించి హోరాహోరి పోరాడుకొనిరి. ఆ యుద్ధము చూచుటకు భయంకరముగా ఉండెను. కపులు కోపోద్రిక్తులై విజృంభించి నిశాటులను చితుక గొట్టసాగిరి. వారు కొందరి తలలు తెగ టార్చిరి., కొందరిని గిరగిర త్రిప్పి నేలకేసి బాదిరి. కొందరి కడుపులు చీల్చిరి, కొందరి శరీరములు ఖండ ఖండములై తెగిపడునట్లు నరికిరి. వానరులాగ్రహోద్రగులై నరసింహమూర్తి వలె విక్రమించి సమరభూమి శాత్రవ సంహారమొనర్చి సింహనాదములతో దిక్కులు పిక్కటిల్ల జేసిరి తృణప్రాయులగు వానరులు దైవబల సంపన్నులై యుండుటచే వజ్రములవంటి వైరి వీరులను తుత్తునియలగునట్లు ఛేదించగలిగిరి.

తన సైన్యబలము కోల్పోయి వెనుకంజ వేయ నుండుట గమనించి దశగ్రీవుడు రోషకషాయనేత్రుడై రొప్పుచూ ముందుకు చని పదిచేతులతో ధనస్సులు పదిచేతులతో బాణములు పట్టుకొని శరవృష్టి కల్పించి వానరానీకమును ముంచెత్తివేసెను. కపులు కుపితులై ప్రయోగించిన పర్వతములు వృక్షములు శిలాఖండములు రక్షోనాధుని వజ్ర శరీరము దాకి చూర్ణమై పోవుచుండెను.

రావణుడు రణదుర్మదుడు. వాడు వైరి వ్యూహములపై వివిధగతుల వర్తించి శాత్రవ సంహారమునకు గడంగెను. రావణ ధనురుక్త బాణ పరంపరలచే యుద్ధభూమి కప్పబడిపోయెను. సురాంతకుని దుర్వార సాయకవృష్టికి రామదండు వెరగొంది — అంగదా!ఆంజనేయా! అంబధేశా! ఎక్కడుంటిరి? — అని అరచుచూ భీతావహమై పరుగు లెత్తెను.

## లక్ష్మణుడు రావణు నెదుర్కొని మూర్ఛిల్లుట

లక్ష్మణుడత్తరి క్రోధతామ్రాక్షుడై ముందు కురికి రావణు నెదుర్కొనెను. సౌమిత్రి దృక్పథము కావటముతో దానవనాధుడు సింహగర్జనచేసి — "ఓరీ లక్ష్మణా! నీవు నా పుత్ర ఘాతకుడవు. నీకై ఇంత కాలము కాచుకుని యుంటిని. నిన్ను బలిగొని నా గుండెలమంట చల్లార్చుకొందును రమ్ము." అని రోషభీషణ స్వరంబున తర్జించి శత సహస్రముఖములు సౌమిత్రిపై గుప్పించెను. కోసల కుమారుడు ప్రతి శరములు ప్రయోగించి వానిని ముక్కలు ముక్కలుగా ఖండించి నిరుపయోగ మొనర్చెను. రామానుజుడాపై తీవ్ర సాయకములు ప్రయోగించి రక్షోనాధుని రథము విరుగగొట్టి సారథిని చంపి, వానిని శర విద్ధాంగునిచేసి వహార్చిల్లు నట్లు చేసెను.

ముహూర్త మాత్రముతో ముష్కరుడు మూర్ఛ నుండి తేరుకొనెను. కన్నుల కోపానలజ్వాలలు ప్రజ్వలించెను. దానవుడత్యుగ్రుడై ఆగ్రహించి, బ్రహ్మదత్తమగు అమోఘశక్తిని అభిమంత్రించి వదలెను. అదివచ్చి లక్ష్మణుని హృదయము దాకెను. దాశ పుత్రుడా శక్తి ఘాతమున క్రందించి స్పృహ దప్పి ధరిణి తలమున కొరిగెను.శక్తిపీడితుడై నేలబడిన

**లక్ష్మణు నెత్తుకొని పోవుటకు దశానుడు ప్రయత్నించెను.** బ్రహ్మాండధారియగు ప్రభు సోదరుని కదిలించుటకా మూర్ఖుడు ముందుకు వంగినపుడు మహావీరుడేమూల నుండియో వచ్చి పిడుగు వలె వానిమీద దూకెను రావణుడు వెటుక్కున పైకిలేచి ఒక్క పిడిగ్రుద్దుతో పవనాత్మజుని ప్రహరించెను. వానరవీరుడా ప్రేటుకు నిలద్రొక్కుకుని నిలిచి, ఒక్క తీవ్ర ప్రతి ఘాతమున ముష్కరుని మర్దించెను. ఆ దెబ్బకు దనుజేశుడు కండ్లు మబ్బులు క్రమ్మి నేల బడబోయి తిరిగి నిలద్రొక్కుకుని లేచి నిలబడెను. ఆపైన రావణుడు హనుమంతుని ఢీకొనుట వ్యర్థమని భావించి, అతని బల శౌర్యంబులను పొగడుటకుపక్రమించెను

"రావణా! నాదెబ్బకు నీవు నీల్గి చావక మొండివై బ్రతికియుంటివి ఇక నా బలవీర్యంబులు కాల్పనా! నీ పొగడ్తలు వినుటకు నాకే సిగ్గగుచున్నది —" అని పలికి హనుమంతుడు లక్ష్మణు నెత్తుకుని అచటనుండి వెళ్ళిపోయెను

శక్తి తగులుటచే తెలివి గోల్పోయి నేల బడియున్న లక్ష్మణమూర్తిని జూచి రాముడు వేదనపడి — సోదరా! నీవు పలుమార్లు శక్తిచే పీడింపబడుట ఉచితముగాదు, లక్ష్మణా నిజబలము స్మరించుకొని లేచి నిలబడుము" అని ఉద్బోధించెను

రాముని మాటలు సౌమిత్రి చెవులుసోకగనే అతడు పైకిలేచి కుర్చుండెను ఆకరాళ శక్తి వ్యోమమార్గముబట్టి బ్రహ్మ లోకము చేరుకొనెను

లక్ష్మణుడు పునః తేజోవిలసితుడై పరాక్రమించి రణాంగణమందున్న రక్షోవిభుని తీవ్రముగా ఎదుర్కొనెను. తన అపూర్వ శర కౌశల్యము ప్రదర్శించి అతడు శాత్రవుని రిచ్చగొనునట్లు చేసెను త్రుటికాలములో తీక్ష్ణమగు బాణ పరంపరలు గుప్పించి రావణుని రథము విరుగగొట్టి, హయములను హతమొనర్చి, దేవారి దేహమును తీవ్రముగా గాటు వేసెను దుర్వార శరపరంపరలను నివారించ లేక, రావణుడు శరవిద్ధాంగుడై నీరసించి నేలకొరిగెను అత్తరి సారథి రావణుని రెండవ రథముపై నిడుకొని లంకలోనికి పోయెను

## రావణుడు విజయార్థియై హోమముచేయ సంకల్పించుట

దశాస్యుడు మూర్ఛతేరుకుని ఆనాటి అపజయమునకు ఖిన్నుడై విచారించెను. తదుపరి వాడు వైరి వధ నభిలషించి విజయార్థియై చైత్ర శుద్ధ బహుళదశమినాడు హోమము చేయుట కుపక్రమించెను.

వాని యజ్ఞము నిర్విఘ్నమైనయెడల వానిని జయించుట దేవదేవులకే దుష్కరమగును. రావణుడు హోమము తలపెట్టిన సంగతి చారులవలన తెలుసుకొని విభీషణుడు తక్షణం దరశరథ నందనుని యొద్దకు పోయి — "రక్షోనాదుడు మహా యజ్ఞము తలపెట్టినట్లు వింటిని. దానినెట్లయిననూ ధ్వంసముచేయించుటకు ప్రయత్నించవలసియున్నది. అది పూర్ణమైన అసురేశుడు అజేయుడగును —" అని సూచించెను

విభీషణుని సమయజ్ఞతకు సీతాపతి సంతసించి సత్వరమే యాగము ధ్వంసము చేసిరండని అనుచరుల లనాదేశించెను.

భానుకుల భూషణుడగు రామభద్రుని ఆదేశ ప్రకారము అంగద హనుమదాది మహా కపులు యాగ ధ్వంసార్థమై భల్లున తెల్లవారు నప్పటికి లంకలో ప్రవేశించిరి. వారు కోటప్రాకారములధిగమించి సరాసరి రావణమందిరాంతర్భాగమున జొరబడి — అక్కడ యాగవ్రతుడై దీక్షలో నున్న దశానుని కనుగొని — "ఓరీ నిశాచరాధమా! సంగ్రామమునుండి పారివచ్చి ఇక్కడ సిగ్గులేక కన్నులు మూసుకుని కృతపూజ యుందుంటివా!" అని గర్జించి వానిపై బడిరి

నిశాటుడు కపుల బెదరింపులు లక్ష్యించక దీక్షారతుడై నిశ్చల సమాధిమందెను. వానరులు క్రోధోన్మత్తులై అనేక ఆగడములకు పూనుకొనిరి. హోమాదికములు చిందరవందర చేసి, యజ్ఞవేదికను పగులగొట్టి, వాని ముక్కు చెవులు కొరికి కాళ్ళుబట్టి లాగి, జుట్టు లాగి, ముక్కు పుటములను మూసి నానా రభసచేసిరి అప్పటికినీ వాడు ధ్యానభ్రష్టుడు గాకుండుటకు నొచ్చుకుని వానరులు రావణుని స్త్రీలను ఈడ్చుకొనివచ్చి వానిమీద పడద్రోసిరి. ఆ శుద్ధాంత కాంతాజనములు లబోగుబో యని కేకలుబెట్టి దశకంఠుని దేహముపై వ్రాలి రోదోంతరాళము ప్రతి ధ్వనించునట్లు రోదనకు లంకించిరి. రావణుడా రభసకు ధ్యాన విరతుడై కన్నులు విచ్చి, కుపితుడై నిప్పులు గ్రక్కుచూ కపిపుంగవులపై కురికెను. శాఖాచరులంత వానిచేతికి చిక్కక తప్పించుకొని, వాని వ్రతభంగమైనందుకు సంతోషముతో కేకలిడుచూ కాలికి బుద్ధిచెప్పి క్షణములో స్వస్థానములు చేరుకొనిరి.

## రావణుని రెండవ యుద్ధము

యజ్ఞము భంగమైనందుకు యాతుధానపతి వర్షగమువలె పెద్దగి నిట్టూర్చి, పిమ్మట కోపించి రణభేరి మ్రోగింపజేసి, యుద్ధమునకు సన్నద్ధులైరండని తనవారి కాజ్ఞాపించెను ఘోరాకారుల్ని మహాబలురుఅగు రాత్రిచర యోధులు వివిధాయుధపాణులై చతురంగబల సమేతముగా కదలి కాలాంతకుల వగిది ఘనగర్జనలతో కదన భూమికి నడచిరి. అనల జ్వాలల కెదురునడచు పతంగ సముదాయ కరణి పౌలస్త్యుని బలము ముందుకు సాగెను. దర్పోద్ధతుడై రణరంగమునకు పోవుచూ రావణుని కప్పుడెన్నియో దుర్నిమిత్తముల తోచెను. మదాంధుడా దుశ్శకునములయెడ దృష్టి పెట్టకపోయెను

ఆసమయమున దేవతలు కొందరు దాశరథి సన్నిధికి వచ్చి — "దేవా! దనుజేశుడు దుర్మార్గుడు. వాడు మమ్ము నానావిధముల హింసించెను. తమరు వినోదార్థమై వానితో క్రీడించక సత్వరమే వానిని సంహరించి స్వర్లోకమునకు సంతోషము చేకూర్చవలసినది శ్రీపతీ, వైదేహి విలంబనము సహింపలేక విరహ వ్యాకులితయై కృశించుచున్నది —" అని మొరపెట్టుకుని పోయిరి అమరులు సీతాదేవి దుఃఖము మోళవించి స్వకష్టములను వ్రస్తావించిన పద్ధతికి దాశరథి తనలో తాను నవ్వుకొనెను

అంతట రఘువీరుడు కోదండము నందుకొని నడుముకు అంబుల పొది అమర్చి, పుష్పాలంకృత జటామకుటము సవరించుకొని సమరక్రియకు సమాయత్తుడాయెను. శ్యామాంగుడు, జలజారుణనేత్రుడు, బాహుబలుడు, విశాలవక్షోవిభూషితుడగు నరరూప నారాయణమూర్తి ధనుర్బాణములు ధరించి రణరంగమున నిలబడుట జూచి దివిజులు హర్షితులై అతనిపై కుసుమ వర్షము కురిపించి జయధ్వానములు చేసిరి

## రామరావణ యుద్ధము

రఘువీరుడప్పుడు రుద్రుడై భూమ్యాకాశములు ప్రతిధ్వనించునట్లు ధనుష్టంకారము చేసెను. ఆజ్యా ఘోషకు ధరణి కంపించెను, దిగ్గజములు ఉలికిపడెను. శేషకచ్ఛపములు చలించెను. వారిధులు క్షోభించెను. కులపర్వతములు కృంగెను బ్రహ్మ భాండమే బ్రద్దలగునంత ఘనధ్వని కలిగెను

పరస్పర విజిగీషా పరులైన రామరావణ బలములకు క్షణములో లోకభయంకరమగు సంగ్రామము సంఘటిల్లెను. ఆయుద్ధమప్పుడు ప్రళయ కాలమువలే భయంకరముగ రూపొందెను. ఒండొరుల నోరుసుకొని ఘర్షించిన సేనాఖండములు కారు మేఘములను దలపించెను. పరశుపట్టిన శూలాద్యాయుధములు విద్యుల్లతలవలె తళుక్కున మెరయుచుండెను. గజాశ్వఘోషలు మేఘ గర్జనలను మరిపింప జేసెను. పైకెత్తబడిన కపుల తోకల వివిధ వర్ణములతో ఇంద్ర ధనుస్సును స్ఫురింప జేసెను. శరపరంపరలు వర్ష బిందువులుగాను, ఎగురవేయబడిన పర్వతములు పిడుగులుగాను పాదఘాతములచే పైకెగరిన ధూళి నీటి తుంపరులుగాను భాసించెను



సంగరధీరుడగు సాకేతపతి శరపరంపరలకు దానవుల దేహములందు రుధిర ధారలు కప్పెను. ఆరక్త ప్రవాహము ఉభయసేనల మధ్య ప్రవహించి భీరువులకు భీతి పుట్టించెను. ఆ రుధిర ప్రవాహమునకు విరిగిన రథచక్రములు సుడి గుండములై తనరెను. గజతురగాదుల కళేబరములు జలచరముల్లై భాషించెను. ధనుస్సులు తరంగసముదాయముగను, డాలులు కచ్ఛపములుగాను, శూలఖడ్గాదులు సర్పావళిగాను, పుర్రెలనుండి కారుచున్న మెదడు జలఫేనముగాను, వికృతాకారుల శవములు తీరస్థ వృక్షరాజగాను కనుపించసాగెను.

రామ బాణాహతికి హతులైన అసురుల శరీరములు యుద్ధభూమిలో గుట్టలుగా యేర్పడెను. రక్తార్ణవమైన రణాంగణమంతట భూతప్రేత పిశాచ గృధ్ర కాక-శ్వాన శృగాలములు మాంస రుధిర మేధస్సులు మెసవుచు విచ్చలువిడిగా సంచరించెను. ఆ రక్త ప్రవాహమున కొట్టుక పోవుచున్న పీనుగలపై కూర్చునియున్న కాకులు గ్రద్దలు నదిలో నావ పోటీలు జరుపుకొంటున్నవా అన్నట్లు తోచెను. ఆ నెత్తుటి యేటి గట్టున — కూర్చుని ప్రవాహమున పోవుచున్న కళేబరములను పొడిచి ప్రేగులు లాగుచున్న గ్రద్దలు నదిలో గాలము వేసి చేపలు పట్టు వేటగాండ్రను జ్ఞప్తికి తెచ్చుచుండెను. రణభూమి పిశాచభీభత్సమై యుండెను. ఆడ పిశాచములు అంతరిక్షమున నాట్యము చేసెను. చాముండులు పుర్రెలతో తాళము వేసి గానము చేసిరి. యోగినులు కపాలములకు రక్తము నింపుకొని త్రేంపుతూ త్రావుచుండిరి. తలలులేని మొండెములు పైకిలేచి తైతక్కలాడుచూ దయ్యాల మధ్య సంచరించెను. యుద్ధ దృశ్యములిట్లు దృష్టి భయంకరముగానుండెను.

రఘువీరుడు చండప్రచండుడై విజృంభించి ఆనాటి సంగ్రామములలో ఎందరి రాక్షసులను తన దుర్వ్యాశరాహతికి బలిపెట్టెనో వూహించలేకరాని విషయము. శాత్రవ పక్షమున పదివేల యేనుగులు — పదిలక్షల పదాతులు — లక్షాయేబదివేలు రథికులు — సంహరింపబడినపుడు రాముని కోదండమునకు కట్టిన ఘంటికలలో ఒకటి టింగుమని ఒక మారు మ్రోగును. ఆ కోదండ ఘంటికా సమూహమానాడ ఏడవో రాత్రములు నిర్విరామముగా నినదించెను. ఆనాటి రామరావణ సంగ్రామము అపూర్వము అవర్ణనీయమై యుండెను. రావణుని మూల బలమంత యూనిశ్శేషమై పోయెను.

ఆ ఘోర సంగ్రామమున కోసలవీరుడు నేల నిలబడి యుద్ధముచేయుచుండెను. అది జూచి సురేంద్రుడు మాతలితో — రథము తీసుకుని రాము వద్దకు పొమ్మని — చెప్పెను. మాతలి చేకొని రాబడిన ఇంద్ర రథమును ఇనవంశ భూషణుడు చిరునవ్వుతో అధిష్టించెను. సాకేతపతి సురస్యందన మారోహించి సంగర క్షేత్రము శోభింప జేసినందుకు వానరులు హర్షోత్సాహితులై వైరి సమూహములపై విరుచుకపడిరి.

ప్రత్యర్థులంత కంతకు బలోద్ధతులైగుటచుండుటకు పౌలస్త్యుడు కనిపెను. అంతట వాడు వానరానీకముపై రాక్షస మాయ విస్తరింపజేసెను. దాని ప్రభావమునచే వానర భల్లూకములకు ఒక్కసారిగ అనేక రాముళ్ళు, అనేక లక్ష్మణులు, అపారమైన వైరి బలమును కన్నుల యెదుట గోచరించెను.

# రామచరిత మానస్

తనవారి బిత్తరిపాటుకు కాకుత్స్థమణి కొంత కలతజెంది మరుక్షణమే ఒక్క బాణ ప్రయోగముతో రాక్షసమాయకు అటగట్టించెను. తదుపరి దాశరథి మేఘగంభీర స్వరముతో స్వపక్షీయులనిట్లు ఉద్బోధించెను. "ఓ వానరవీరులారా! నిరంతరము యుద్ధరతులై యున్నదున ఇప్పటికే మీరు అలసియున్నారు. కాబట్టి ఇక మీరు కొంత తడవు సుంత విశ్రాంతి తీసుకొని — రామ రావణయుద్ధము చూచుచుండ వలసినది."

రాఘవుడట్లు తనవారిని యుద్ధమునుండి వెనుకకు మళ్ళించినమీదట, భూసురోత్తములకు మనస్సులో ప్రణమిల్లి, రావణుని కెదురుగా రథము నడిపింపజేసెను. రణరంగమునందప్పుడు రామరావణ పరస్పరాభిముఖులై నిలబడిరి. రాముడట్లు దృక్పథమైనంతనే రావణుడిట్లు తర్జించెను.

"ఓయీ నీవు వేటకానివలె యేమరించి సన్యాసి వాలిని చంపితివి. ఖరదూషణ కుంభకర్ణ మేఘనాదులను సంహరించితినను గర్వముతో ఉద్ధతుడవై నన్నెను దుర్కొన వచ్చితివి. నన్ను గత వీరులతో పోల్చుకుని పొరబడుచుంటివేమో! కానీ నేను రావణుడను, రాక్షసేశ్వరుడను, దిక్పాలుడు సైతం నా కారాగారమున ఖైదుచేయబడియున్నారన్న సంగతి విస్మరించకుము. నాబల ప్రతాపములు లోక విదితములు. రామా! నేడు నీచే యమసదనమునకు ప్రయాణము గట్టించి, కలకాలముగా మనకున్న వైరమును తుదముట్టించదలచితిని. వెన్నిచ్చి పారిపోక రావణునితో పోరాడుము."

కాలప్రేరితుడై ప్రలాపించిన లోక పీడితుని వైఖరికి రామభద్రుడించుక మందస్మితుడై వానికిట్లు సమాధానమిచ్చెను.

"రావణా! నీ ప్రభుప్రతాపములు ప్రపంచమునకు తెలియనివికాదు. కాబట్టి ప్రగల్భములతో పనియేల! లోకములో వాక్శూరులు కార్యశూరులని ముఖ్యముగ రెండు రకముల మనజులుందురు. వారిలో నీవే తెగకు చెందినవాడవైనది ఇప్పుడు మాటలతో ప్రదర్శింపచు కొనుచుంటివి."

ఆ మాటలకు రావణుడాగ్రహించి "ఓరీ! నీవు నాకు నిర్భయుడవై నీతులు బోధించుటకు పూనుకుంటివా!" అని గర్జించి రామునిపై బాణములు గుప్పించెను. అవధేశుడు ఆగ్నేయాస్త్రముతో వాని బాణవృష్టిని నిముసములో వమ్ముజేసెను దేవాంతకుడంత కుపితుడై శక్తితో రాఘవుని గురిచూసి కొట్టెను. సీతానాధుడొక సాయకముతో ఆ శక్తిని తిరిగి వానిపైనకే మరలునట్లు చేసెను. దానవుడాపైన పండ్లుగిటకొట్టాడి శూల చక్రములను కోసలవీరునిపై గుప్పించెను. కానీ అవన్నియూ మార్గములోనే ఖండింపబడి నిరుపయోగముగా చేయబడెను. దుష్టుని మనోరథములట్లు తన ప్రయోగములన్నియు ఫలించక వ్యర్థమగుటకు ముష్కరుడు మహోద్రగుడై శతసాయకములొకపెట్టున సంధించి, వానితో రాముని సారథి నేలబడి మూర్ఛిల్లునట్లు కొట్టెను.

(సశేషం)

చదువుకుంటున్న వాళ్లు. వాళ్ళు ప్రేమించుకుని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్న సంగతి మనకెంతో స్వాతి వదినెకు కూడా అంతే తెల్సు. అంతేగాని మురహరి బాసను ఆవిడ మభ్య పెట్టిందనుకోవడం నమ్మవలసిన విషయం కాదమ్మా'' అన్నది జ్యోతి ఆయాసపడుతూ మెల్లిగా.

"ఎవరివల్ల తప్పంటే మనకేంతల్లీ. అతన్ని మనవాడు కాకుండా చేశారు. అందుకు కొంత వరకూ నేనూ బాధ్యురాలినే. ఆ ఉసురే నిన్ను ఈ స్థితికి తెచ్చింది తల్లీ'' అన్నదావిడ కళ్ళొత్తుకుంటూ.

"అమ్మా, నాకు జ్వరంగా ఉన్నట్లు బావకు తెలుసామ్మా? జ్యోతికి ఎట్లా ఉన్నదని ఎప్పుడయినా ఈ అయిదారు రోజుల్లోను అడిగాడా బావ?''

మనస్సును తేలిక పర్చుకుందామని అడిగింది జ్యోతి. ఆమె మనస్సులో మురహరి మూర్తి ఏ మాత్రం చెరిగి పోలేదు అంత జ్వరంలోను బావను తల్చుకుంటే లేని ఓపిక వచ్చినట్లుగా ఉండేది జ్యోతికి. కాని జయలక్ష్మి మనస్సులో మెదలగానే ఆ ఓపికంతా చచ్చిపోయినట్లనిపించేది

"రోజూ మీ నాన్నగార్ని అడుగుతూనే ఉన్నాడు అది మనస్ఫూర్తిగా అడుగుతున్నాడో, అడక్కపోతే బావుండదని అడుగుతున్నాడో, అతని మనస్తత్వం ఎవరికి తెలుస్తుంది.''

జ్యోతి ఆలోచనలో పడ్డది

"బావకు మనం చేసిన అన్యాయం ఏముందమ్మా నేనంటే అంత అయిష్టతగా ఉంటానికి. నన్ను పెళ్ళి చేసుకోనన్నాడుగాని నన్ను ద్వేషిస్తున్నట్లుగా ఎప్పుడూ అనలేదు'' అన్నది

మురహరిమీద జ్యోతికి ఎంత నమ్మిక ఉన్నదో తల్లికి ఇప్పుడు అర్థమైంది. ఈ పిచ్చితల్లి బావను ఇంతగా తన మనస్సులో నిల్పుకుని ఆరాధిస్తున్నదనే పరిజ్ఞానం ఆ కన్నతల్లికి లేదు. తన మూర్ఖపు పట్టుదలతో, ధనాధికార హోదాతో ఇలాంటి వాతావరణాన్ని కల్పించటంతో తనకూ ఇంట్లో స్థానం, గౌరవం లేదని గ్రహించి మురహరి ఈవిధంగా ప్రవర్తిస్తున్నాడా అనే ఆవేదనా పూరితమైన హృదయంతో ఇప్పుడామె బాధ పడుతున్నది.

"జ్యోతీ నీ విషయంలో నేను చాలా అన్యాయమే చేశానమ్మా. ఆ అన్యాయమే నిన్ను ఈ స్థితికి తెచ్చిందేమో.''

హృదయావేదన ఆమెలో సుళ్ళు తిరిగింది

"ఇందులో నీ తప్పేమీలేదమ్మా బావకు నేను నచ్చలేదు. తన చదువుకూ, తన మనస్తత్వానికీ తగిన భార్య జయలక్ష్మి అని తెలుసుకుని ఆమెనే ప్రేమించి పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు అందులో నీ తప్పేముందమ్మా'' అన్నది జ్యోతి

మనస్సులోని వ్యథను దూరం చేసుకుని పైకి ఈ మాటలు అన్నా లోలోన కుమిలిపోతునే ఉన్నది జ్యోతి.

"నాన్నగారు బావతో మళ్ళీ ఏమీ మాట్లాడలేదేం అమ్మా.''

ఆశయానికి కొనవూపిరినిచ్చి ఈ ప్రశ్న వేసింది జ్యోతి.

"ఆయన మనస్సు విరిగిపోయింది తల్లీ. నీ కూతుర్ని చేసుకోనని ముఖంమీదనే చెపితే ఇంక ఏ ముఖం పెట్టుకుని ఆయన అడుగుతారు. పోనీ అత్తయ్య అయినా బ్రతికుంటే కన్నకొడుకు మనస్సు మార్చ గలిగేదేమో. ఆవిడ కూడా పోవటంతో తెగిన గాలిపటంలా అయ్యాడు మురహరి ఈ గాలిపటానికి మళ్ళీ దారం కట్టి ఎగుర వేస్తున్నది జయలక్ష్మి.''

అవును అత్తయ్య కనక బ్రతికుంటే తాను ఆ ఇంటికోడలు తప్పక అయ్యేది కాని అత్తయ్య పోవటం కూడా తన దురదృష్టమే అనుకుంది జ్యోతి

"అత్తయ్యా లోపలికి రావచ్చునా, జ్యోతికి ఎట్లా ఉంది'' అన్నాడు మురహరి గుమ్మం అవతల ఉండి.

తల్లీ, కూతుళ్ళు చకితులయ్యారు. మురహరి ఈ రీతిగా అంటాడని వాళ్ళు ఎప్పుడూ అనుకోలేదు

"రావచ్చు నాయనా లోపలికి రా'' అన్న దావిడ

మంచంపక్కనున్న కుర్చీ లాక్కుని కూర్చుని "ఎట్లాఉన్నది జ్యోతీ రోజూ మొత్తంమీద ఒకసారయినా టెంపరేచరు నార్మలుకు వచ్చిందా. డాక్టరు గారు ఏమన్నారు'' అన్నాడు.

"టైఫాయిడ్‌గానే తేల్చారు. రోజల్లా ఎప్పుడూ నూటమూడు డిగ్రీలకు తగ్గటమేలేదు మాట్లాడుతూఉండు నాయనా ఏంటావిడకు వంట ఏర్పాట్లు చెప్పివస్తాను'' అని వెళ్ళింది



మురహరి ముఖంలోకి కళ్ళార్పకుండా చూస్తు పడుకుంది జ్యోతి. పెదవులపై మందహాసాన్ని తెచ్చుకున్నా కన్నుల్లో అశ్రుకణాలు నిలిచే ఉన్నయ్యి. ఆమె ముఖం వింతగా ప్రకాశించింది. మనస్సు సంతృప్తితో నిండిపోయింది. మనోభావాలలో అణగారిన చైతన్యం తొంగిచూసింది. తనంతట తానుగా మాట్లాడని బావ ఈనాడు తన మంచం దగ్గరికి వచ్చాడనే తృప్తి ఆమె నర నరాల్లోనూ ఉత్తేజాన్ని కలుగజేసింది.

"బావా, కులాసాగా ఉన్నావా, ఇంట్లో ఉండి కూడా దర్శన మివ్వటానికి నీకు మనస్కరించదా, నేనేం తప్పు చేశాను బావా''

పెల్లుబికివచ్చే ప్రేమానురాగాన్ని వ్యక్తపర్చలేక, అంతకన్నా ఆడగలేకపోయింది.

"దర్శనమివ్వటానికి నేనేం భగవంతుడినా జ్యోతీ. రోజూ మీ ఇంట్లో తిని, మీ ఇంట్లో ఉండే వాడిని కనిపించకపోవట మేమిటి. నీ మనస్సులోని ఆవేదన అట్లా అనిపిస్తుందేమోగాని నీమీద నాకు కోపం ఎన్నడూలేదు జ్యోతీ, ఎన్నడూలేదు'' ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకుని అన్నాడు.

తదేకంగా అతనివైపు చూసింది జ్యోతి. జ్వర తీవ్రతతో, మానసిక ఆందోళనతో, ఆవేదనతో వాడిపోయిన ఆమె ముఖం విప్పారింది. సర్వమూ మరిచి ఎవరికోసం పరితపిస్తూ మంచాన అంటుకు పోయిందో ఆ మేనబావ తన మంచం దగ్గర కూర్చుని తనతో మాట్లాడుతుంటే ఆమె సర్వమూ మరిచి అట్లాగే అతనిమీద దృష్టి నిల్పి చూస్తున్నది. బావ చేతుల్లోఉన్న ఆమె చేతులు సిగ్గుతో వణక సాగాయి. కాని తన చేతులను తీసుకోలేకపోయింది.

"నన్ను క్షమించు బావా. నీ సహచర్యాన్ని కోరింది జయలక్ష్మి. నువ్వామెకు మాట ఇచ్చావు మీది నిజంగా ఆదర్శ దాంపత్యమే అవుతుంది. నీ మనస్సును తెల్సుకోకుండా ఎక్కడోఉన్న నిన్ను నా మనస్సులో నిలుపుకోవటం హర్షించతగిన విషయం కాదుకదూ బావా''

ఈ మాటలు అనిర్వచనీయమైన ఆనందంతో జ్యోతి అన్నా, ఎలి[illegible] అనుకున్నాడు మురహరి

"జ్యోతీ, నువ్వు ఎప్పన్నా ఈ విషయంలో పడకతప్పదు మీరంతా నమ్మినా నమ్మకపోయినా నేను నిన్ను ఈ రోజుకూ ప్రేమిస్తున్నాను. కాని నా జీవిత భాగస్వామిగా చేసుకోవాలనే ఉద్దేశ్యం నాకెన్నడూ లేదు. అత్తయ్య దయవల్ల నాకీ ఇంట్లో అలాంటి వాతావరణమే ఎప్పుడూ ఆవిడ కల్పించలేదు. నీకు తెలియదు చిన్నప్పుడు ఒకసారి సినిమాకువెళ్ళి రాత్రి పది దాటాకవస్తే ఇదేం పెంకిపోటలా లేక దర్మశాల అనుకొని ఎవరిష్ట ప్రకారం ఎప్పుడు వడితే అప్పుడు వచ్చి వంచేడప్పుడు తినేందుకు అన్నది అత్తయ్య ఇలాంటి వాతావరణంలో ఉన్న నేను నిన్ను వివాహం చేసుకుంటానని ఎట్లా అనుకోగలనో ఆలోచించు జ్యోతీ? నా మనస్సులో ఏ భావాలులేని అలాటి తరుణంలో జయలక్ష్మితో నాకు పరిచయమైంది ఇంకొక్క సంగతి నేను [illegible] నా [illegible] వితంతువైన జయలక్ష్మిని నేను పెళ్ళాడ దల్చుకున్నానంటే నాలోని [illegible], నిశ్చయాలూ [illegible] నువ్వు అర్థం చేసుకున్నావో అనుకుంటాను జ్యోతీ'' అన్నాడు రుద్ధమైన కంఠంతో. అప్రయత్నంగా రెండు కన్నీటి బొట్లు జ్యోతి చేతులమీద పడినయ్యి.

ఒక్కవేడి నిట్టూర్పు విడిచింది జ్యోతి. "పోనీలే బావా ఎవరికి ఎవరు ప్రాప్తమో ఎవరు చెప్పగలరు'' అన్నది.

మురహరి మాట్లాడలేదు.

"బావా, ఒక సహాయంచేసి పెడతావా?''

"తప్పక చేస్తాను ఏమిటి జ్యోతి అది''

"స్వాతి వదిని మనింటికి రావటంలేదు జయలక్ష్మి కూడా రావటం మానేసింది. ఒకసారి వాళ్ళిద్దర్నీ చూసి ఇక్కడికి తీసుకువస్తావా''

"అట్లాగే జ్యోతీ, రేపే వెళతాను''

"అకారణంగా వారు మనింటికి రావటం ఎప్పుడూ మానెయ్యరు. వారి మనస్సు నాకు తెలుసు. అమ్మ ద్వారా వారేదో పరాభవం పొంది ఉంటారేమోనని నా అనుమానం. అదే నిజమైతే ఎంత జ్వరంలోఉన్నా నేను వెళ్ళి వాళ్ళను బ్రతిమాలుతాను, వేడుకుంటాను అకస్మాత్తుగా రాకపోకలు ఆగిపోయాయంటే అంతకన్న వేరు కారణం నాకు తెలిసినంతవరకూ ఏమీలేదు. తప్పక వెళ్ళొస్తావుగా'' అన్నది. (సశేషం)

# మద్రాస్ సినిమా వార్తలు

## ఛాయాచిత్ర షూటింగ్ ప్రారంభం

ఛాయాచిత్ర అనే నూతనసంస్థ వారి ప్రథమ చిత్రం షూటింగ్ మార్చి 20వ, తేదీని వాహిని స్టూడియో 7వ, ఫ్లోర్‌లో ఉదయం 9గం. 30ని. లకు ప్రారంభించారు. వాణీ ఫిలింస్ డిస్ట్రిబ్యూటర్స్ అధినేత శ్రీ కాకర్లపూడి. వెంకటేశ్వరరావు స్విచ్ ఆన్ చేశారు. యన్. టి. రామారావు, శ్రీ జగ్గయ్య, కుమారి జమునలతో ప్రథమ చిత్రీకరణ చేశారు. జగ్గయ్యగారి బంగళా మేడమీద భాగం సెట్‌వేశారు. ప్రారంభోత్సవానికి శ్రీ చక్రపాణి, పి. ఏ. పి. నిర్మాత శ్రీ సుబ్బారావు, శ్రీశ్రీ మొదలగువారు హాజరయ్యారు.

ఈ చిత్రంలో యన్. టి. రామారావు, జగ్గయ్య గుమ్మడి, పద్మనాభం, మిక్కిలినేని, జమున,గీతాంజలి, హేమలత మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి మాటలు : పినిసెట్టి శ్రీరామ మూర్తి., పాటలు : కొసరాజు రాఘవయ్యచౌదరి, శ్రీశ్రీ, సి. నారాయణరెడ్డి., సంగీతం : యన్. రాజేశ్వరరావు అండ్ టి. చలపతిరావు., ఛాయ : యం. కె. రాజు., కళ . కృష్ణారావు., కూర్పు : సంజీవి., స్క్రీన్‌ప్లే అండ్ దర్శకత్వం : కె. ప్రత్యగాత్మ., నిర్మాతలు : కె. సుబ్బరాజు అండ్ టి. చలపతిరావు.

## శ్రీ సాయీ మందిర్ నిర్మాణానికి కుమారి జె. లక్ష్మి నృత్య ప్రదర్శన

మద్రాసు త్యాగరాయనగర్‌లోని సాయీమందిర్ నిర్మించేందుకు నిధులను సేకరిస్తూ ఈ మధ్య రాజా అన్నామలై హాలులో కుమారి జె. లక్ష్మి భరతనాట్య ప్రదర్శన జరిగింది మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ భక్తవత్సలం ప్రదర్శనానికి అధ్యక్షత వహించారు. మద్రాసు శాసన సభాపతి శ్రీ చెల్ల పాండ్యన్ ఉపన్యసించారు. సాయీ తత్వ ప్రచారానికి జీవితం అంకితం చేసిన బషీర్ సాయిబాబా (కడప జిల్లా — చెన్నూర్ నివాసి ) ఆశీస్సులు పలుకుతూ సాయీ మహిమలను విపులీకరించారు మద్రాసు సినిమారంగంలోని అనేకమంది వారి శక్తికొలది నిధులను సమర్పించారు.

## “శ్రీశైలక్షేత్ర మహిమ”

యస్. కళ్యాణరావు అండ్ కంపెనీవారు “శ్రీశైలక్షేత్రమహిమ” డాక్యుమెంటరీ చిత్రంను నిర్మించారు. ఈ చిత్రం తాలూకు మరికొంత పూర్వ చరిత్రను నిర్మాత భరణీ స్టూడియోలో “ శంకరుడు — గంగ ” “ శివభక్తుడు — గజదొంగ ” కథలను, భక్తుని ప్రార్థనపై శ్రీశైల మల్లికార్జునుడు సర్వరూపమున గజదొంగ ఆపదలోవున్న శివభక్తుని కాపాడటం వగైరాలను చిత్రీకరించారు.

శంకరుడుగా శ్రీ భాస్కరపద్మనాభశాస్త్రి, గజదొంగగా శ్రీ యన్. లక్ష్మారెడ్డి పాల్గొన్నారు. వ్యాఖ్యానం — పాటలు : వడ్డాది , సంగీతం : టి. వి. రాజు., ఛాయ : ఆర్. విజయరాఘవన్ (భరణీ స్టూడియో ), ప్లేబాక్‌పాటలు . పి. బి. శ్రీనివాస్. ప్రొడ్యూసర్ అండ్ డైరక్టర్ : యస్. దుర్గారావు, ఈ చిత్రాన్ని తెలుగు — కన్నడబాషల్లో తయారు చేస్తున్నారు



‘అమరశిల్పి జక్కన’లో బి. సరోజాదేవి.

## పూర్ణాపిక్చర్సు వ్యవస్థాపకులు శ్రీ జి. కె. మంగరాజు అస్తమయం

పూర్ణా పిక్చర్సు వ్యవస్థాపకులు శ్రీ జి కె. మంగరాజు గతనెల 23 వ, తేదీ ఉదయం 6 గంటల 40 నిముషాలకు విశాఖపట్నంలోని వారిస్వగృహంలో బంధుమిత్రులను విడిచి స్వర్గస్థులయ్యారు. వారు ఎగ్జిబిటర్, ప్రొడ్యూసర్, డిస్ట్రిబ్యూటర్‌గా కాకుండా తెలుగు ఫిలిం పరిశ్రమ చరిత్రకారుల్లో ఒకరనే చెప్పాలి

## అనుపమాఫిలింస్ “ఉయ్యాలా జంపాలా” చిత్రం షూటింగ్ ప్రారంభం

అనుపమా ఫిలింస్ వారు వారి తాజాచిత్రం “ఉయ్యాలా — జంపాలా ” షూటింగ్ వీనస్ స్టుడియోలో “ ఏ ” ఫ్లోర్‌లో గతనెల 25వ, తేదీని ఉదయం 9గం. 30ని. లకు ప్రారంభించారు. స్టూడియో మేస్త్రి శ్రీ చంగయ్య స్విచ్ ఆన్ చేశారు.

శ్రీ తులసి క్లాప్ కొట్టారు కృష్ణకుమారి, సూర్యకాంతం,చలంలపై ప్రథమ చిత్రీకరణ చేశారు. ఈ చిత్రంలో వీరుగాక యింకా జగ్గయ్య, గుమ్మడి, రమణారెడ్డి, చదలవాడ. కుటుంబరావు, వాసంతి, మీనాకుమారి, వాణిశ్రీ మొదలగువారు నటిస్తున్నారు.

“ అందాల రాముడు — ఇందీవర శ్యాముడు..
ఇనకులాబ్ధి సోముడు — ఎందువలన
దేముడు .......”

పై పాటను ఆరుద్ర వ్రాసారు. పి. లీల వారి బృందం పాడగా రికార్డు చేశారు.

ఈ పాటను పాఠశాల సెట్టులో వాసంతి, బాలబాలికలతో వీనస్ స్టూడియోలోనే చిత్రీకరించారు.

“ కాయందదు — పూవందదు ”

పై పాటను కొసరాజు రాఘవయ్యచౌదరి వ్రాశారు బి. గోపాలం, జమునారాణి పాడగా రికార్డు చేయబడింది

“ ఉంగరాల జుట్టువాడు .......
.......పూరించే కన్నులవాడు ....”

పై పాటను ఆరుద్ర వ్రాశారు. పి. సుశీల పాడగా రికార్డు చేశారు.

“ ఏటిలోని కెరటాలు — యేరు విడిచిపోవు
ఎదలోని మమకారం — ఎక్కడికీపోదు.”

పై పాటను ఆరుద్ర వ్రాశారు. పద్మశ్రీ బాల మురళీకృష్ణ పాడగా రికార్డు చేశారు.

ఈ చిత్రానికి కథ — మాటలు · పినిసెట్టి. శ్రీరామమూర్తి, సంగీతం . పెండ్యాల నాగేశ్వరరావు, ఛాయ చౌదరి, పాటలు . ఆరుద్ర అండ్ కొసరాజు, నృత్యం వెంపటి సత్యం, కళ · తోట, కూర్పు : వెంకటేశ్వరరావు, స్టిల్సు వెంకటరత్నం, నిర్మాత — దర్శకుడు ; తిలక్.

## ఆర్. ఆర్. పిక్చర్సు ప్రొడక్షన్ నెం 12 రు.

అది భాగ్యవంతుల భవనంలోని ఒక గది. వారబ్బాయి చదువు ముగించి నిద్రకుపక్రమించాడు. అదే సమయంలో అతని స్నేహితుడు 'సురేష్' వచ్చి జమీందారుగారబ్బాయి వాలిని ఎత్తుకుని — ముద్దులాడి ——

" గురూ ! నీ బుర్ర వుందే — ఇది (బుర్రను చూపిస్తూ) వండర్‌ఫుల్—అమోఘం" అన్నాడు.

దానితో వాలి తన కాలేజీ అనుభవం చెప్పుకుని — ఇక వుండలేక " చెప్పరా చెప్పు — వేధన పస్పెన్సు మవ్వాను."

సురేష్ వాలి భుజం తట్టేడు. సస్పెన్సు భరించ లేకపోతున్నాడు. సురేష్ చెప్పి వేశాడు అసలు విషయం. " జలజను పిలిపించేశారు ......" వాలికి షాక్ తగిలి నట్లు అయింది. క్రింద పడ్డాడు. సురేష్ తిరిగి ప్రారంభించేడు. " జలజ మనల్ని పిలిపిస్తోంది....... ఇదిగో ఉత్తరం ..............."

వాలి ఆనందానికి అంతులేకుండా పోయింది. తన యాక్షన్‌కు రీయాక్షన్ వచ్చిందని సురేష్‌తో బయలుదేరి సురేష్‌ను లాక్కుని తీసుకువెళ్ళి పోతాడు.

ఈ సన్నివేశం ఆర్. ఆర్. పిక్చర్సు వారి ప్రొడక్షన్ నెం 12 రు లోనిది. సురేష్‌గా యన్ టి రామారావు., వాలిగా పద్మనాభం, నటించారు వీరుగాక ఇంకా కృష్ణకుమారి, వాసంతి, రమణారెడ్డి, రాజనాల, ప్రసాద్, జగ్గారావు, గీతాంజలి, మొదలగువారు నటిస్తున్నారు.

ఛాయ : మర్జీ ఇరానీ, దర్శకుడు : బి యన్. మూర్తి, నిర్మాత ఆర్. ఆర్. పిక్చర్సు తరఫున టి. ఆర్. చక్రపాణి

## అశ్వరాజ్ పిక్చర్సు "శ్రీ సత్యనారాయణ మహాత్మ్యం"

అశ్వరాజ్ పిక్చర్సు వారు "శ్రీ సత్యనారాయణ మహాత్మ్యం" చిత్రంను వాహినీ స్టూడియోలో చురుకుగా షూటింగ్ జరిపిస్తున్నారు. త్వరలోనే చిత్రాన్ని పూర్తిచేసి విడుదల చేయాలని ఈ చిత్రాన్ని సమర్పిస్తున్న కె. గోపాలరావుగారి అభిప్రాయం.

ఈ చిత్రంలో యన్. టి రామారావు, కాంతారావు, రేలంగి, రమణారెడ్డి, చలం, ప్రభాకరరెడ్డి, ముక్కామల, అల్లు రామలింగయ్య, కృష్ణకుమారి, గిరిజ, గీతాంజలి, సూర్యకళ, ఛాయాదేవి మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి రచన: సముద్రాల రాఘవాచార్య., సంగీతం · ఘంటసాల, ఛాయ : సి. నాగేశ్వరరావు., కళ · వాలి., నృత్యం : వెంపటి., స్టూడియో విజయా — వాహినీ., అశ్వరాజ్ పిక్చర్సు అధినేత యీ చిత్రాన్ని సమర్పిస్తున్నది కె. గోపాలరావు, నిర్మాత . పి. సత్యనారాయణ.

## యస్. ఆర్. మూవీస్ "ప్రమీలార్జునీయం"

యస్. ఆర్. మూవీస్ వారు నిర్మిస్తున్న "ప్రమీలార్జునీయం" పౌరాణిక చిత్రం వాహినీ స్టూడియోలో నిర్మిస్తున్నారు. ఈ చిత్రంలో యన్. టి. రామారావు, కాంతారావు, రేలంగి, పద్మనాభం, శోభన్‌బాబు, బాలకృష్ణ, మిక్కిలినేని, జగ్గారావు, రమేష్, సురేంద్ర, బి. సరోజాదేవి, రాజమ్మ, రాజశ్రీ, గిరిజ, ఛాయాదేవి, కన్నాంబ మొదలగు వారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి సంభాషణలు : పింగళి నాగేంద్ర రావు , సంగీతం . పెండ్యాల నాగేశ్వరరావు., ఛాయ : రవికాంత్ నిగాయిజ్., కళ : గోఖలే., నృత్యం : వసుమర్తి., కూర్పు : రాజన్., స్టూడియో : వాహినీ, నిర్వహణ : లక్ష్మీప్రసన్న., నిర్మాతలు : నాగమణి అండ్ ఆదిబాబు., దర్శకత్వం : మల్లికార్జునరావు.

## చందమామ ఫిలింస్ "దొరికితే దొంగలు"

చందమామ ఫిలింస్ వారు " దొరికితే దొంగలు " అనే సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. యింత వరకు సుమారు 10రీళ్ళ చిత్రం పూర్తి అయింది. క్రొత్త నటీనటులకు, సాంకేతిక నిపుణులకు అవకాశమిస్తూ, చక్కటి కథా వస్తువు గల చిత్రాలు నిర్మించుటలో సిద్ధహస్తుడనిపించుకున్న చందమామ ఫిలింస్ డి. యల్. నారాయణ వీనస్, విక్రమ్, మెజెస్టిక్ స్టూడియోలలో యీ చిత్రం షూటింగ్ చురుకుగా సాగిస్తున్నారు.

ఈ చిత్రంలో యన్. టి. రామారావు., కాంతారావు, గుమ్మడి, రాజనాల, రమణారెడ్డి, కృష్ణవాణి



"డా॥ చక్రవర్తి"లో సావిత్రి, జగ్గయ్య.

యణ, ధూళిపాళ, అల్లు రామలింగయ్య, పేకేటి, జమున, సూర్యాకాంతం, జయంతి, శారద, రాజశ్రీ మొదలగువారు నటిస్తున్నారు

ఈ చిత్రానికి కథ . కె. వి. ఆర్. ఆచార్య., సంభాషణలు· పినిశెట్టి. శ్రీరామమూర్తి., పాటలు : ఆరుద్ర, దాశరధి, సి. నారాయణరెడ్డి., సంగీతం : యస్. రాజేశ్వరరావు , ఛాయ · కె. యస్. ప్రసాద్., నృత్యం . హీరాలాల్., కళ గొడగాంకర్, స్టూడియో : వీనస్, విక్రమ్, మెజెస్టిక్, దర్శకత్వం · పి. సుబ్రహ్మణ్యం , నిర్మాత డి ఎల్ నారాయణ.

## భరణీ పిక్చర్సు "వివాహబంధం" ఔట్ డోర్

భరణీ పిక్చర్సు వారు తాము నిర్మిస్తున్న సాంఘిక చిత్రం " వివాహబంధం " అవుట్‌డోర్ షూటింగ్ యీ మధ్య యన్. టి. రామారావు, భానుమతితో చేశారు. యీ అవుట్‌డోర్‌లో ఒక పాటను చిత్రీకరించారు. చిత్రం పూర్తి కావచ్చింది.

ఈ చిత్రంలో యన్. టి. రామారావు, భానుమతి, హేమలత, హరనాథ్ , మొదలగువారు నటిస్తున్నారు ఈ చిత్రానికి సంభాషణలు · పిచ్చేశ్వరరావు., పాటలు సి. నారాయణరెడ్డి., సంగీతం : ఎం. బి. శ్రీనివాస్., సంగీత పర్యవేక్షణ . శ్రీమతి పి భానుమతి., ఛాయ : అన్నయ్య., కళ : రాజేంద్రకుమార్., నిర్మాత — దర్శకుడు : పి. రామకృష్ణ. ( భరణి. )

## శ్రీ దేవి పిక్చర్సు "విచిత్ర వ్యక్తులు"

శ్రీ దేవి పిక్చర్సు వారు "విచిత్ర వ్యక్తులు" అనే సాంఘిక చిత్రాన్ని పూర్తి చేస్తున్నారు. ఈ

చిత్రంలో శివాజీ గణేషన్ మూడు పాత్రలను పోషించారు. యం ఆర్. రాధా ద్విపాత్రాభినయం చేశారు. ఈ రెండూ యీ చిత్రంలో ఒక ప్రత్యే కత. వీరుగాక ఇంకా యీ చిత్రంలో దేవిక, వాసంతి, సంధ్య మొదలగువారు నటించారు. ఈ చిత్రానికి మాటలు — పాటలు : రాజశ్రీ., సంగీతం : విశ్వ

# సినిమా వార్తలు

నాధం — రామమూర్తి అండ్ పురుషోత్తం., ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ : కె. యం. నాయుడు., దర్శకత్వం : బి. ఆర్. పంతులు., నిర్మాత : రామ భూపాల్‌రెడ్డి,

## రేఖ అండ్ మురళీఆర్ట్సు

పై సంస్థను హాస్యనటుడు పద్మనాభం స్థాపించి మంచి చిత్రాన్ని తీయదలచినట్లు. ఈ చిత్రానికి రచన : పిటూరి., దర్శకత్వం : కె హేమాంబరధర రావు., నిర్మాత . పద్మనాభం అని తెలుస్తుంది.

సి. ధర్మారావు ★

---

మళ్ళీ అరెస్టు చేయటం, చార్జిషీటు దాఖలు చేయటం, కేసు నడిపించటం. . . . ఇదంతా ఏమిటా ఎందుకా అని విస్తుపోతున్నారు, ఢిల్లీ వాసులు. పైగా, ఇండియాను రక్షించగల, 'వీరుణ్ణి'గా అబ్దుల్లాను ఎందుకు భావిస్తున్నారో చాలా మందికి అర్ధం కావటం లేదు.

ప్రధానినెహ్రూ, అబ్దుల్లాను తన గృహానికి ఆహ్వానిస్తూ వ్రాసిన లేఖకు బోలెడంత ప్రచారం లభించింది. తనకు చేయూత నివ్వమని శ్రీ నెహ్రూ అబ్దుల్లాను అడుగుతాడని ఒక వాదన బహుశా యీ నెలాఖరు లోగానే యీ యిద్దరు కాశ్మీరీలు కలుస్తా రని తెలుస్తున్నది.

కాశ్మీర్ వ్యవహారాలను తానే స్వయంగా చూడాలని పండిట్ శ్రీ నెహ్రూ మొదటినుంచీ పట్టుదల తోనే వున్నారు. కాని, ఆయన కాశ్మీరు వ్యవహారాలను పరిశీలించ టంలో ఎలా వ్యవహరించాలో నన్నది భావికాలపు, చరిత్రకారునికి వదిలేద్దాము,

**'బరాముల్లా'**

1946 నాటి మాట. లార్డ్ వేవెల్ ఉండే రోజుల్లో, దేశ విభజనకు పూర్వం, పండిట్ నెహ్రూ అప్పుడే పరిపాలనా బాధ్యతలను పుచ్చు కొన్నారు. "సెక్యులరిజం" యొక్క ప్రాధాన్యత ఉగ్గడించేందుకు ఆయన నైరుతివైపు ఎలా పరుగిడారో, అదే విధంగా, తన పూర్వీకులున్న కాశ్మీరుకు కూడా వెళ్ళారు అప్పుడు సర్ హరిసింగ్ ఆ ప్రాంతాన్ని పరిపాలిస్తూ ఉండేవారు. పండిట్ కాక్ ప్రధానిగా ఉండేవారు ఆ సమయంలో శ్రీ నెహ్రూ కాశ్మీరు ప్రాంతంలో అడుగు పెట్టి ఉంటే, ఆయన్ను అరెస్టు చెయ్యటం జరిగేది. అప్పటికీ ఆయన్ను 'బరాముల్లా' వద్ద నిలిపేయ టం జరిగింది.

కాశ్మీరు ఇండియాలో కలవటానికి ఒక రకంగా కారణభూతులైన సర్ హరిసింగ్, కాక్‌లు నిరా దరణలో చనిపోయారు. పైగా, ఇండియా మీద ధ్వజమెత్తిన నైజాం నవాబును ఆదరంతో చూడటం జరిగింది. దీనికి నెహ్రూయే కారణం.

మరో పూర్వ సంఘటన గుర్తుకొస్తున్నది. సరిగా, హైదరాబాదులో పోలీసు చర్య జరిగిన రోజది. పార్లమెంటు వరండాలో నెహ్రూ,

## న్యూఢిల్లీ లేఖ

7 వ పేజీ తరువాయి

ఆయన వెనుక పండిట్ పంత్ నడుస్తున్నారు. వారిద్దరి వెనుక నేనూ ఉన్నాను.' నైజాం' నవాబును ఏం చేయాలా అన్న ఆలోచిస్తున్న ఆ క్షణంలో నవాబును పూర్తిగా 'రూపుమాపు' చేయమని 'పండిట్ పంత్ సలహా ఇచ్చాడు. అలా జరిగితే ఇండియాలో "సెకులరిజం" ముగిసి పోవటమేనని నెహ్రూ సమాధానం చెప్పారు..... అదీ విషయం.

షేక్ అబ్దుల్లాను విడుదల చెయ్యాట మన్నది 'విశ్వాసపుచర్యగా' రాష్ట్రపతి అభివర్ణించారు. అంటే విడుదల అయిన అనంతరం అబ్దుల్లా తన పూర్వపుచర్యలు తిరిగి విజృంభించ డని దీని అర్థం.

అబ్దుల్లాను నిర్బంధించి, అతని మీద కేసు నడిపేందుకు ఇండియా లక్షల రూపాయలను వెచ్చించింది. మరో వైపు అబ్దుల్లా తరపున మృదులా శారాభాయ్ ఇంకా ఎక్కువ ఖర్చు చేసింది. శారాభాయ్ చాలా కాలం నుంచి అబ్దు ల్లాకు మంచి స్నేహితురాలు. అందువల్ల ఆవిడ ఎలాంటి సంకోచం లేకుండా, ఎంతో డబ్బు ఖర్చు చేయ గలిగింది. ఆవిడకు ధైర్య సాహసాలు ఎక్కువ. తాను చేసే కార్యకలాపాలలో శారాభాయ్‌కు దృఢ విశ్వాసం.

మొదట్లో శారాభాయ్ ప్రధాని నెహ్రూ స్నేహితురాలే. తరువాతనే శ్రీ నెహ్రూ ద్వారా అబ్దుల్లా పరిచయం కలిగింది. ఇండియాను వ్యతిరేకిస్తూ, అబ్దుల్లాను సమర్థిస్తూ రచనలను కరపత్రాలు ఆమె పంచిపెట్ట గలిగింది. భద్రతా సంఘంలో పాకిస్తాన్ పలుమార్లు వీటి ప్రస్తా వనను కూడా తీసుక వచ్చింది. మరో విషయం. దాదాపు నెల రోజుల క్రితం వరకు ఆవిడ శ్రీనెహ్రూ ఇంటికి వెళ్లటం కూడా నిషేధింప బడినట్లే కాని, ఈ మధ్య మాత్రం ఆమె ప్రధాని శ్రీ నెహ్రూను తరచుగా కలుస్తున్నది.

తటస్థవిధానం నెహ్రూజీకి ఒక సరదా గుర్రంలాంటిది. కాని, ఇటీవల ఆయన పరిపాలనా కాలంలో, ఆ సరదా గుర్రమే ఒక "పవిత్రమైన ఆవు"గా మారిపోయింది.

తెలిసో, తెలియకో కాంగ్రెసు వాళ్ళు, ఏదో మొహమాటం కోసం కమ్యూనిస్టులు— రెండు వర్గాలు తటస్థ విధానం వైపు మొగ్గాయి.

**కమ్యూనిస్టుల ఎత్తుగడ వేరే ఉన్నది,** ఇండియా త్వరలో రష్యావైపు మొగ్గదని వాళ్ళకు తెలును. అందువల్ల, ఇండియా పాశ్చాత్య దేశాల వైపు మొగ్గకుండా చూచేందుకు కమ్యూనిస్టులు తటస్థ విధానానికి "జేజేలు" చెబుతున్నారు. కొన్ని ఇదమిద్ధమైన ఆశయాలకు ఒక దేశానికి కట్టుబడి పోయిన కమ్యూనిస్టు పార్టీ తటస్థ విధానాన్ని బోధించటం హాస్యాస్పదం గదా ?

త్వరలో మరో సమావేశం జరపాలని తటస్థ దేశాలన్నీ యోచిస్తున్నాయి ప్రారంభ సమా వేశానికి ఇండోనీషియాన్ కేంద్రంగా ఎంచు కొన్నారు. తటస్థ విధానాన్ని అమలు జరపనప్పటికీ పై సమావేశానికి చైనాను ఆహ్వానించారు. చైనాతో నిమిత్తం లేకుండా, ఇండోనీషియా సమావేశా నికి భారత దేశం హాజరు కాగలదని శ్రీ నెహ్రూ అన్నారు. ఆహార వ్యవసాయ మంత్రి స్వరణ సింగ్ నాయకత్వాన్ని ఒక జట్టు ఈ సమావేశానికి హాజరు కానున్నదట ! తటస్థులమని గొప్పలు చెప్పుకొంటున్న చైనా, తటస్థ దేశమైన ఇం డియా మీద దాడిచేసినపుడు ప్రపంచంలోని ఎన్ని తటస్థ దేశాలు "ఇండియా"ను రక్షించ టానికి ముందుకు వచ్చాయో ఆ నెహ్రూగారే చెప్పాల్సి ఉంటుంది.

**రాజకీయ గారడీ**

దేశమంతటా ధరలు మండిపోతు న్నాయి. అవన్నీ ఆకాశాన్ని విడిచిపెట్టకుండా, అంటుకొనే వున్నాయి. జీవనవ్యయం పెరిగి పోతున్నది. తనను తాను పోషించు కొని, ఆలుబిడ్డలను పోషించా లంటే, యీ రోజుల్లో తల ప్రాణం తోకకు వస్తున్నద. కాని, "రింగ్ మాస్టరు" పండిట్ నెహ్రూ మాత్రం ప్రజలదృష్టిని వాస్తవిక జీవితంలో నుంచి, కామరాజుపధకం ప్రజా స్వామ్యం, సోషలిజం, అబ్దుల్లాకథ, తటస్థవిధానం, చైనా దురాక్రమణ మొదలైన కథల్లోకి మళ్లిస్తున్నారు.

ఇంత తక్కువమంది కాంగ్రెసు వాదులు ఎంతో ఎక్కువమంది ప్రజలను అప్రయోజకులను చేసి కూర్చోపెట్టటం చరిత్రలో ఇదే మొదలు.

శ్రీకృష్ణ. ★

## ఋతుక్రమం ఆలస్యమైతే?

విచారపడవద్దు ప్రఖ్యాతిగాంచిన "దేవిపిల్సు" వాడండి!

పూర్తికోర్సు ప్యాకెట్టు 28 మాత్రలు వెల రు 11/-
సగం కోర్సు ప్యాకెట్టు 14 మాత్రలు వెల రు. 6/50
వి. పి. పి. అదనము
ప్రతి చోటు దొరకును

"దేవి పిల్సు" ముఖ్యంగా ఆలస్యమైన, క్రమముగాకాక పోయిన, బాధతో కూడిన, లేక ఆగిపోయిన బహిష్టకు దేవిపిల్సు బాగుగ గుణమిచ్చును

1 అన్ని సందర్భములలోను శీఘ్రముగాను, అమోఘముగాను పని చేయును
2 ఏస్థితిలోను ఆరోగ్యమునకు ఎట్టిహాని కలిగించదు.

MFRS:- SEENU & CO., MADRAS-21

మెసర్స్. ఎస్. జి. వెంకటస్వామి & కంపెని,
48, ఎం. జి. రోడ్, సికిందరాబాద్.

---

## "ఫ్రూటాల్"

★ ఇండియా కానింగ్ ఇండస్ట్రీస్ ..., విజయవాడ...

Agents for Andhra: ఆక్రెడిటెడ్ ఏజన్సీ, విజయవాడ-1

---

గృహిణుల
పొదుపు
రక్షణ నిధికి
మదుపు

---

## నాలుగు కొత్త నవలలు!

ఆంధ్ర పాఠకలోకం ఎంతో కాలంగా ఎదురుచూస్తున్న అత్యుత్తమ నవలలు,

కోడూరి కౌసల్యాదేవిగారి
**శాంతినికేతన్ 7-00**

'సుమలత'గారి
**జీవనకలశం 5-00**

మూలం: త్రివేణి అనువాదం: శర్వాణి
**తామరకొలను 3-00**

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి
**"గంగూలీ ప్రేమకధ" 4-00**

కనీసం ఏ రెండు పుస్తకములకైనా ఎం.ఓ. పంపినచో పోస్టేజి ఉచితం.

సర్వోదయ పబ్లిషర్స్,
ఏలూరు రోడ్డు, విజయవాడ-2.

---

'ఎఫార్' గ్యాస్లైట్ మరియు వత్తితో

**EFAR** REGD

మీ యిల్లు శోభాయమానముగా ఉంటుంది




ఎఫార్ వత్తులు యీ క్రింది కేండిల్ పవర్లలో లభిస్తున్నాయి:

100 సి. పి.
200 సి. పి.
300/400 సి. పి.
400/500 సి. పి.
800 సి. పి.




ఎఫ్. రాసెక్ అండ్ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్

పి. ఓ. బాక్స్ 2006 బొంబాయి-2 · పి. ఓ. బాక్స్ 2121 కలకత్తా-1 · పి. ఓ. బాక్స్ 1248 మద్రాస్-1

JWT-FR. 2347

# షేక్స్పియర్: ఒక ప్రశంస


## జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి


విలియమ్ షేక్స్పియరు క్రీ.శ. 1564 వ సంవత్సరంలో ఏప్రిల్ 23 వ తేదీనాడు జన్మించినాడు. ఆయన జన్మస్థలం స్ట్రేట్‌ఫర్డ్ — ఆన్—ఏవన్. ఇది వార్‌విక్‌షైర్‌లో ఉంది.

అతని తండ్రి వర్తకము చేస్తూ ఉండేవాడు. డబ్బు సంపాదించినాడు. సొంతవూరుకు కాలక్రమాన హైబలిఫ్ లేక మేయర్ అయినాడు. వూరిపిల్లల వలె షేక్స్పియరు పల్లెలో గ్రామర్ స్కూలులో ప్రవేశించాడు. అక్కడ లేటిన్, లెక్కలు అభ్యసించాడు. తండ్రి నిప్పచ్చరంలో పడిపోవడం వల్ల 14 వ ఏటనే షేక్స్పియరు బడి చదువుకు ఉద్వాసం చెప్పవలసి వచ్చింది. కుటుంబ పోషణకై అతడు కొంత కృషి చేయవలసి వచ్చింది. అప్పుడేరీతి పని చేసేవాడో ఆధారం దొరకలేదు.

తన 19 వ ఏట అతడు ఆనే హేత్‌వే అను బాలికను పెళ్ళాడాడు. ఆమె తండ్రి ధనికుడే. భార్య భర్తకంటె ఎనిమిదేళ్ళు మాత్రమే పెద్ద. పెళ్ళి తొందర పాటుతో జరిగింది. ఇది ఇరువురకు సుఖం కలిగించిందని చెప్పలేము. సుసన్నా, జూడిత్, హేమ్‌నెట్ అను పిల్లలు వారికి కలిగిరి. కడపటి వారిద్దరు కవలలు. దుస్సాంగత్యంలో పడిపోవడం వల్ల షేక్స్పియరు ఒక పర్యాయం ఒక దుండగుడై లేడిని దొంగలించెనను నేరము అతని పై పడింది. ఇది నిజమో అబద్ధమో చెప్పలేము. 1587 లో సొంత పల్లెనుండి కదలిపోయి జీవిత వృత్తికై లండన్ పోయినారు. అప్పటికే యూనివర్సిటీవిట్స్ అనబరగిన వారి వలన నాటకము పెంపొందజూనింది. నాటక రంగము షేక్స్పియరును ఎంతో ఆకర్షించింది. మొదట పాత్రధారిగా, దానిపై ప్రవేశించాడు. తరువాత నాటకాలు వ్రాయడం మొదలు పెట్టినాడు. 1592 లో గ్రీన్ అను పమ కాలికుడు చూస్తూ చూస్తూ ప్రకటించిన ఈర్ష్యను బట్టి షేక్స్పియర్ రచన విజయవంతమవుతూంది అని గ్రహించ వచ్చు. అతడు లండన్‌లో సుమారు ఇరవై సంవత్సరాలు ఉన్నాడు. విశేష కృషి చేసి ఏడాదికి రెండు నాటకాలు రచించేవాడు. ధనమూ, కీర్తి అతనిని వరించాయి. బ్లేక్ ఫ్రైయర్స్, ది గ్లోబ్ అనే నాటక కంపెనీలలో షేర్లు సంపాదించి లండన్‌లోనూ, సొంతవూరిలోనూ కొంత ఆస్తి సంపాదించాడు. తోడ్తోడనే అతని కుటుంబములో విపత్తులు ఘటిల్లినవి. అతని ఏకైక పుత్రుడు 1596 లోను, తండ్రి 1601 లోను, ఏకైక తమ్ముడు ఎడ్మండు 1607 లోను, తల్లి 1608 లోను మరణించారు. 1610 1612 మధ్య సొంత పల్లెకు తరలి పోయినాడు. కాని అతని ఆరోగ్యం శిథిలమై పోయింది. 1616, ఏప్రిల్ 23 వ తేదీనాడు అస్తమించాడు.

బేకన్, బెంజాన్‌సన్‌ల వలె అతడు మహా విద్వాంసుడు కాదు. లేటిన్, గ్రీక్ భాషలలో అతనికి గల పరిచితి మిగుల సామాన్యమైనది. బహుళాంశములందు అతనికి పరిజ్ఞానము కలదు. ఏ విషయమునైనా చప్పున హృద్గతం చేసుకునే ప్రజ్ఞ అతనికి గలదు. అతని నైసర్గిక ప్రతిభ నిరుపమానమైనది. అనువాదములందు ప్రాచీన వాఙ్మయమును పఠించినాడు. ఏ విషయం చేజిక్కినా దానికి సర్వోత్కృష్టమైన స్వరూపం కలిగించే ప్రజ్ఞ అతనికి కలదు.

నాటక రూపంలోని లేని కథాసంబద్ధ పద్య కృతులు వీనస్ అండ్ ఎడోనిస్ ల్యూక్రీస్ అనువాటిని అతడు వ్రాసినాడు. 154 గేయాలను వ్రాశాడు. 126 గేయాలొక వ్యక్తినిగురించి, తక్కినవి ఒక ఆడుదానిని గురించి అతడు వ్రాశాడు. ఇవి మధుర భావ భరితములు.

షేక్స్పియరు నాటకాలు వట్టి బూటకపు కథలుకావు. కొన్ని తాత్విక సూత్రాలకవి దృష్టాంతములు చప్పున వ్రాసి ఒడుదుడుకులకు విడిచిపెట్టినాడు. పామరులను మెప్పింప యత్నించాడు. శామ్యూల్ జాన్సన్‌వంటి విమర్శకులు వీనిని పురస్కరించుకొని అతనిని దుయ్యపట్టినారు. టాల్‌స్టాయ్ కూడ అతనిని మెచ్చలేదు. అయినను షేక్స్పియరు మహాకవి సర్వకాలములందూ ఆరాధ్యుడే.

షేక్స్పియరు నాటకాలలో షేక్స్పియరును కనుగొనలేమని విమర్శకు లంటూఉంటారు. ఇది సమగ్ర సత్యంకాదు. వేర్వేరు జీవిత స్థితులలో షేక్స్పియరు అనుభూతులు అతని పాత్ర చిత్రణములో అగుపడుతూ ఉంటుంది. హృదయము పరితపించి పడసిన తర్వాత జీవితమందలి తీవ్రాంశముల నుండి అతడు దూరస్థుడైనాడు. అతడు రచించి













షేక్స్పియర్ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని బ్రిటన్‌లో అతని నాటకాల దృశ్యాలు చూపే రకరకాల తపాలాబిళ్ళలను విడుదల చేశారు.

తాలు. హృదయశక్తి, మేధా శక్తులందూ, సంకల్ప శక్తి, భావనాశక్తు లందూ సమన్వయం లేకపోయిన యెడల మనుష్య జీవనము విషాద సంభరితమవుతుందని రూఢి చేయడం షేక్స్పియరు ఉద్దేశం. డెస్డెమోనా ఒథెల్లో, లియరులకు హృదయము లున్నవికాని మెదడులేదు. హేమ్‌లెట్‌కు అద్భుత మేధా శక్తి ఉందికాని సంకల్ప శక్తి హుళిక్కి. ఐయాగో మేధాశక్తి నిరుపమానమైనది. వానిసంయమ శక్తికి సోక్రటీస్ సంయమ శక్తిగాని, స్టాయిక్ ఫిలాసఫర్ సంయమ శక్తిగాని దీటుకాదని బ్రాడ్లే చెప్పినాడు. కాని అయాగోకు హృదయంలేదు కాబట్టి పిశాచమైనాడు.

బెన్‌జాన్ ప్రభృతులవలె ప్రాచీన కాలము నుండి గణింపబడుతూవున్న స్థల కాల నిబంధనలను షేక్స్పియరు పాటించలేదు. ఒక కాలమందలి విషయములను వేరొక కాలపు నెత్తికి కట్టినాడు. నాలుగవ శ్రేణి నాటకాలలో ఈ విషయం అగుపడుతుంది.

స్థల కాల పరిస్థితుల సంస్పర్శ నెరుగక సాహిత్యం శూన్యంలో పుట్టదు. మొదటి ఎలిజబెత్ కాలంలో ఇంగ్లాండు పెక్కు ఒడుదుడుకులనుండి బయటపడింది. రాజకీయ, సాంఘిక మతాంగములందు రవుల్కొనిన నిప్పులు చల్లారినవి. భయంకరమైన నౌకాబలంతో విజృంభించిన స్పెయిన్ వోడిపోయింది. ఫ్రాన్స్ శక్తి క్షీణించి, కాందిశీకురాలై ఇంగ్లాండుకు పరిగెత్తుకొని వచ్చిన స్కాట్లండు రాణీ మేరి ఇరవై యేళ్ళు ఫదరింగ్ హే కేసిలులో ఖైదీగా నుండి పెక్కు రోమన్ క్యాథలిక్ కుట్రలకు నడుమ రహస్యంగా నిలిచి, తుదకు సెసిల్ డడ్లీ పోరువలన ఎలిజబెత్‌చే ఉరికంబమున కెక్కింది. ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వ కళా పరిషత్తులందు వైదుష్యం

ప్రకాశించినది. సమస్త ఆంగ్ల దేశంలో అత్యద్భుత జాతీయ చైతన్యం లహరిగా ప్రవహించింది. ఈ లహరి షేక్స్పియరు లేఖిని నాశ్రయించింది. అన్నమయ మెరుగని సాహిత్యంలో వ్యక్తమయింది. కావుననే కార్లైల్ మహాశయుడు "ఇంగ్లండు కెట్టి దుఃస్థితి దాపురించినను, సరే షేక్స్పియరు చరిత్ర నాటకములు జగతిలో నిలుచునంతకాలము

## షేక్స్పియర్ ప్రశంస

మేము దుఃఖముతో [illegible]" అని ముక్తకంఠంతో పలికినాడు.

షేక్స్పియరు కృతులవలన విశ్వ జనీనమైన అద్భుత సాహిత్యము సృష్టియైనది. ఆతడు కేవలము ఆంగ్ల జాతి సొత్తని ఎవ్వరును తలపరా ఆతడు సమస్త మానవులకు సంబంధించిన పె ఖజానా. ఆతనివలన ఆంగ్ల భాష లోకారాధన న సది. విశ్వ మానవ దృష్టి మిక్కిలి అక్కర ఈ దినములలో అతని నాలుగు వందలవ జన్మో హమును సమస్త మానవులు భక్తి శ్రద్ధల నిర్వహించడం ముదావహం.

# సుశీల గ్రహించిన సత్యం-24 - దేవిక

శేఖర్ చెప్పినట్లు అతను గడప మీద కూర్చున్నాడు. సుశీల తన కళ్ళని తానే నమ్మలేకపోయింది.




మోహన్ ఆమెను చేరుకున్నాడు




మోహన్ తో కలిసి ఆమె ఇంటికి వచ్చింది.











Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press: 6 &7 Thambuchetty Stree
Madras-1. Phone: 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.

